# చతుర

331 వ సంచిక
ఆగస్టు 2005
రూ.7/-

గంటి వెంకటరమణ నవల

## 'అందిన స్వర్గం'

దృశ్యా దృశ్యం
'కథ వెనుక కథ'
చెబుతున్న
చంద్రలత






# విచిత్రమైన పోస్టాఫీస్

ఉత్తర ఫిన్లాండ్‌లో శాంతాక్లాస్ అనే గ్రామం ఉంది. అక్కడ ఉన్న ఓ రెండు గదుల పోస్ట్ ఆఫీస్‌కు, శాంతాక్లాస్ పేరిట ప్రపంచ వ్యాప్తంగా గల బాలబాలికల నుంచి ప్రతి సంవత్సరం 40 వేల ఉత్తరాలు వస్తాయి. అనేక మంది విద్యార్ధులు ఆ పోస్టాఫీస్‌కు వెళ్లి, ఉత్తరాలు అన్నిటికీ జవాబులు వ్రాస్తారు. ఆ జాబుల్లో కొన్ని తమ సంతోషాన్ని వ్యక్తం చేసినవీ, మరి కొన్ని తమ కష్టాలను తెలియచేసేవి ఉంటాయి. కొందరు తమ వైద్యం కొరకు ధన సహాయం చెయ్య వలసినదిగా అర్ధిస్తూ ఉండి మనస్సుకు బాధ కలిగిస్తాయి. క్రిస్టమస్ వేడుకల సమయంలో అక్కడి పోస్ట్ మాస్టర్ శాంతాక్లాస్ దుస్తులు ధరించటం విశేషం.

రసమయ నవలా తరంగం

సంపుటి : 28 సంచిక : 7

చతుర

ఆగస్టు: 2005 331వ సంచిక

## లోపలి పేజీలలో...



బొమ్మలు: పినిశెట్టి ✦ కవర్ పేజీ ఫొటోగ్రాఫర్: మధు ✦ మోడల్: శిరీష

# ట్విస్ట్... ట్విస్ట్...

**వ్యంగ్య రచన**

ఏమయ్యా! డైరెక్టరూ! కొత్త రైటరు అన్నావు. సీన్ చెప్పకుండా ఎక్కడికి వెళ్లిపోయాడయ్యా! మీరంతా కలిసి నన్ను గంగలో ముంచేలా ఉన్నారు. పరిచయం చేసినప్పుడు.. ఆరుపాటలు, ఏడు ఫైట్లు వీటితో పాటు ఒక పావు మసాలా, ఒక పావు సిస్టర్ సెంటిమెంటు, ఒక పావు ట్రాజెడీ, ఒక పావు కామెడీ, అంటూ తాళింపు సామాన్ల పేర్లన్నీ చెప్పారు కదయ్యా!

అన్నీ చెప్పి అడవిలోకి తీసుకొచ్చి పారేశారు. అలాంటి, ఇలాంటి అడివా! తలకోనాయే! నా డబ్బునంతా మినరల్ వాటర్ పేరుతో మంచి నీళ్లలా ఎలా తాగేస్తున్నారో చూడు!

ఇదిగో అటు చూడు జూనియర్ ఆర్టిస్టులు ఉదయం నుంచి పోలీసుల డ్రెస్సుల్లో రడీగా ఉన్నారు హీరో హీరోయిన్లు వచ్చేశారు. అసలు రాత్రి సీన్ చెప్పినప్పుడు ఏమన్నాడు.

అడివిలో హీరో, హీరోయిన్లు, హీరో ఫ్రెండ్స్ దాక్కున్నట్లు పోలీసులకు ఇన్‌ఫర్మేషన్ వస్తుంది. వీరిని వెతుక్కుంటూ పోలీసులు అడవిలోకి వస్తారు. అలా వెతుక్కుంటూ ఉండగా సడన్‌గా వీరంతా ఒకచోట తారసపడతారు!

అప్పుడు ప్రేక్షకులంతా ఎదురుచూసినట్లుగా హోరాహోరీ కాల్పులు, ముష్టియుద్ధాలు, భయంకరమైన డైలాగులు ఏవీ ఉండవు.

ఇక్కడే ఉంది అసలైన ట్విస్ట్.. అంటూ ఉదయం సెట్లో చెబుతానన్నాడు మరేడీ!.

| |
|---|
| *4 ఆగస్టు 2005* (signature) |

'తిరుపతి దేవుని దర్శనానికి పోయాడేమో?'

డైరెక్టర్ నర్మగర్భంగా అన్నాడు.

ఎందుకయ్యా! ఎలాగూ మీరంతా నాకు గుండు కొట్టిస్తారు కదా! అప్పుడెల తప్పదు. సరే! ఏదో ఒకటి ఆలో వయ్యా! డైరెక్టరూ!

కాల్షీట్ల గొడవ ఒకటి హీరోయిన్‌ను ముంబాయి నుంచి తీసుకువచ్చాం. ఈలోపు మొత్తం అడివినంతా ఓసారి పరుగులెట్టించు.




నెక్స్ట్ సీన్ ఏం రాశాడో చూడాలి.

బాబోయ్! ఓయ్! డైరెక్టరు ఆ అసోసియేట్లకి సీన్ అప్పజెప్పి ఇలా రావయ్యా! కొంప మునిగింది..

ఏంటిది హీరో స్వయంగా ఇద్దరిపై కాల్పులు జరుపుతాడు. ఆ తర్వాత ఎలా బయటపడ్డాడన్నదీ ప్రేక్షకులు కూడా ఊహించని ట్విస్ట్ అన్నాడు. ఇక్కడా ముగించలేదు..

ఒక డౌటయ్యా! అసలు ఈసినిమాదంతా ట్విస్ట్‌ల మీదే నడుస్తుందా!

మొదటి కథ చెబుతూ ఏమన్నాడు?

సమకాలీన వాస్తవ రాజకీయాలపై ఆధారపడి ఉంటుందన్నాడు. అంతకన్నా ముందు నాజీవితం-మార్వాడీలపై ఆధారపడి ఉన్న సంగతే మర్చిపోయాడు.

సరే! ఇది చూడు. సినిమాకి ప్రాణం అన్నాడు.

నా ప్రాణం మీదకు తెచ్చేలా ఉన్నాడు.

జైలులో ఉన్న హీరో సెల్‌ఫోన్లతోనే వ్యవహారాన్నంతా నడిపి ఒక మర్డర్ చేయిస్తాడు. కాని పోలీసులు తెలుసుకోలేరు.. అంత పకడ్బందీగా ఉంటుంది వ్యవహారం. నిందితులందరూ స్వచ్ఛందంగా లొంగిపోతుంటారు. జైలులో ఉన్న హీరో పేరే చెబుతుంటారు. అందులో కీలకమైన నిందితుడు టీవీ ఛానళ్లకు ఇంటర్వ్యూలు కూడా ఇస్తుంటాడు. కాని పోలీసులు అతన్ని అరెస్ట్ చేయలేరు. రాష్ట్ర రాజకీయాన్నే కుదిపేసిన ఆసంఘటన ఎటువంటి ముగింపునకు చేరుతుందన్నది ప్రేక్షకులు ఊహించని విధంగా ఓ ట్విస్ట్.

ఇంకో పేజీ తిప్పాను.. ఒక మహిళా రాజకీయ ప్రముఖురాలు ఉంటుంది. అయితే సీత(య్య)మ్మలా ఎవరిమాటా వినదు. అంతే కాదు, ఎవరినీ లెక్క చేయదు.. ఆదాయానికి మించిన కేసులుంటాయి, అంతకుమించి కోర్టు కేసులుంటాయి.. వాటన్నింటి నుంచి ఎలా బయటపడిందనేది.. ఓ ట్విస్ట్..

ఆ తర్వాత ఒక గురూజీ ఉంటారు.. ఇది సినిమాలో కామెడీ ట్రాక్ అన్నమాట.. ఒక ప్రముఖ హాస్యనటుడితో చేయిస్తే చాలా బాగుంటుంది.. పోలీసులు తీసుకువెళుతుంటారు, వస్తుంటారు.. అర్ధరాత్రనీ లేదు.. అపరాత్రనీ లేదు.. సినిమా ప్రారంభమైన దగ్గర నుంచి ముగిసే వరకూ ఈ ట్రాక్ నడుస్తూనే ఉంటుంది. దీంట్లో చాలా ట్విస్ట్‌లున్నాయి. కాని ఒకటే చివరకు చెబుతాం.

అలాగే లగాన్ సినిమాలా ఓ క్రికెట్ మ్యాచ్ ఒకటి ఉంటుంది.. కాని అది బ్రిటీష్ వారితో ఉంటే ఇది. మన పక్క దేశంతో ఉంటుంది. దీనిని చివరి బాల్ వరకూ ఉత్కంఠభరితంగా చూపిస్తామని ప్రేక్షకుడిని ఊరిస్తాం. అలా ఊరించి, ఊరించి, మొత్తం మ్యాచే జరగకుండా లేపేస్తాం. అదెలాంటే ఒకవైపు టైగర్, మరోవైపు శివుడు, క్రికెట్ పిచ్, పాముల బొమ్మలను సింబాలిక్‌గా చూపిస్తామన్నమాట అసలేం జరిగిందన్నది చివరలో చెబుతామన్నమాట.

నాకు అంతా అయోమయంగా ఉంది.

కథంతా ఇలాగే నడిపించాడు. ఇంతలో ఎక్కడికో వెళ్లిన డైరెక్టరు వస్తూ కనిపించాడు.

నాకు వళ్లు మండింది.

'ఏమయ్యా! ఏమిటీ ట్విస్టులు' అంటూ సీరియస్‌గా అరిచాను.

'మీరు ఆవేశంతో ఉన్నారు. కాని అసలు విషయం చెబితే మీరు షాకై పోతారు.'

'ఏమిటీ!' అన్నా

వాస్తవ సంఘటనలు, వాస్తవ సంఘటనలు అంటే ఏదో అనుకున్నాం. మనవాళ్లు చెబుతున్నారు. ఇవన్నీ పాత పేపర్లన్నీ తెప్పించుకొని తిరగేసి రాసేశాడంట.

మళ్లీ డైరెక్టరే మొదలుపెట్టాడు రాస్తే రాశాడుగానండి. అచ్చంగా అన్నీ సినిమాల్లో సంఘటనల్లాగే జరుగుతున్నాయి. వాటినే తీసేస్తే చాలా బాగా ఉంటుంది. ఎఫెక్టివ్‌గా, రియల్‌గా వస్తుంది కూడా. కంటిన్యూ చేసేద్దాం! ఏమంటారు!

ఏమీ అనను.

ముందు మీ అందరినీ మార్చేస్తానంటాను.

అంటూ వెనక్కితిరిగి చూశాను..

షూటింగ్‌లో అందరూ నావైపే చూస్తున్నారు.

ఏంచెబుతానోనని.

'పేకప్' అని గట్టిగా అడవి దద్దరిల్లేలా అరిచాను

– శ్రీనివాస్ మిర్తిపాటి

★

జ్ఞానతరంగిణి

# మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్‌గారి సందేశం

నిశ్చలత

## నిశ్చలత-గర్వం

గురునానక్‌గారు పంజా సాహిబ్‌కి వెళ్లినప్పుడు ఆయన్ని బాధించాలని ఒక వ్యక్తి ఆయనకు నీళ్లివ్వ లేదు. పైగా పైనుండి ఆయనపైకి ఒక రాతిని దొర్లించాడు. నానక్‌గారు తనున్న చోటునుండి కద ల్లేదు. తనపైకి దొర్లుకు వస్తున్న రాయిమీద తన కాలు పెట్టాడు. ఆ రాయి అక్కడే ఆగిపోయింది. పాదం పెట్టిన ఆ స్థలం నుండే అదే క్షణాన ఉవ్వెత్తున జలధార పొంగింది. ఆ పర్వతంపై నున్న నీరంతా ఎండిపోయి ఆ చోటునుండి జలజలా జలం ఊరసాగింది. సిక్కులు ఆ పుణ్యస్థలాన్ని సందర్శించుకొనడానికి వెళ్తుంటారు. ఇందులో సత్యమెంత ఉందో ఆ భగవంతునికే తెలుసు గానీ దీనివలన దృఢత్వం, శాంత స్వభావం, నిశ్చలతల ఉత్తమోపదేశం లభిస్తున్నది. శాంతచిత్తులు, సత్యమైన మనుషులు లోకుల నిందల్ని లెక్కచేయక నియమబద్ధులై ఉంటారు.

ఎందరో మంచి మనుషులకి కష్టాలు ఎదురయ్యాయి. తలలు ఛేదించబడ్డాయి. ఉరిశిక్షలు, శిలువలు వేయబడ్డాయి. అయినా వాళ్లంతా తమ నియమాల్ని, నమ్మిన సిద్ధాంతాలని అతిక్రమించలేదు. అంత్య సమయంవరకు తమ ధర్మంపై నిలబడ్డారు. అందుకే ఆనాడు వారిని బాధించిన లోకమే ఆ తరువాత ఈనాటికీ వారిని ఆదర పూర్వకంగా గౌరవిస్తోంది, పూజిస్తోంది.



మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్

ఏసుక్రీస్తును శిలువ ఎక్కించారు. మనసూర్‌కు ఉరిశిక్షవేశారు. కబీర్‌గారిని అనేక ప్రకారాలుగా బాధలు పెట్టారు. స్వామి దయానందసరస్వతిపై నిందల నిప్పులు కురిపించారు. గురు అర్జునదేవును నీటిలో ముంచారు. గురు హరగోవింద్‌ను పధ్నాలుగు సంవత్సరాలు జైల్లో నిర్బంధించారు. గురుతేగ్‌బహదూర్ తల నరికివేశారు. గురు గోవింద్‌సింహ గారిని నానా ప్రకారాలుగా హింసించారు. అయినా ఆయన చివరికి ధర్మవేదికపైనే ప్రాణాల్ని పరిత్యజించాడు. ఏడు, పదకొండేళ్ల వయసు

గల ఆయన కొడుకు లిద్దరిని గోడలలో పెట్టి మెత్తివేశారు. రాధాస్వామి మతాన్ని కొందరు లెక్కలేనంతగా నిందించారు. కానీ వీరంతా తమ ధర్మంపై దృఢచిత్తంతో, ధీమతత నిల్చున్నారు. ప్రపంచం అందుకే వారి పేర్లను ఇప్పటికీ ఆదర సన్మాన పూర్వకంగా స్మరించుకుంటోంది.

ధర్మంలోని సూక్ష్మతని, వాస్తవాన్ని ముందుగా అవగాహన చేసుకో. అది సరిగ్గా నిశ్చయరూపం సంతరించుకున్నాక సత్సాంగత్యంలో సత్యానికీ, అసత్యానికీ భేదం తెలుస్తుంది. అప్పుడు దానిని దృఢ చిత్తంతో గ్రహించు. నిన్నెవరు ఎంత బాధపెట్టినా, హెచ్చరించినా, లాలూచీ చూపినా, హేళనచేసినా, ఉరివేసినాసరే సత్యమార్గాలనుండి తప్పుకోకు. నీవు సత్యమైన మనసుతో సఫలత ప్రాప్తింపచేసుకుంటావు. ఇహ లోక, పరలోకాలకు ఈ నియమమే వర్తిస్తుంది. చివరికి మరణ భయం కూడా నీ దరికి రాదు. నిన్ను కదిలించదు.

## గర్వం

గర్వించకు. ఏం చూసుకుని గర్వపడతావు?

శరీరాన్ని చూసుకుని గర్విస్తున్నావా? ఇది పృథ్వి, జలం, వాయువు, అగ్ని, ఆకాశతత్వాలతో తయారైంది. అది నీదెప్పటికీ కాదు.

శరీరం నాశమానమైనది. దహన సమయంలో శరీరంలోని పంచతత్వాలు వాటి వాటి తత్వాల్లో కలిసిపోతాయి. భూమిలో పూడ్చితే చీమలు, పురుగులు దాన్ని తినేస్తాయి. నీటిలో పడవేస్తే చేపలూ, తిమింలాలూ మింగివేస్తాయి. ఊరవతల విసిరేస్తే కుక్కలూ, గద్దలూ పొడుచుకుతింటాయి. రారాజుల తలకాయలు మైదానాల్లో బంతుల్లాగా దొర్లడం చూస్తూనే ఉన్నాం. ధనికులు, మాత్రం శరీరాన్ని త్యజించి మరణశయ్యపై పడుకోవటంలేదా? వాళ్లు వాళ్లార్జించిన ధన సంపదల్ని వెంట తీసుకుపోతున్నారా? లేదే! ఖాళీచేతుల్తో ఈ లోకంలోకి వచ్చి ఖాళీ చేతుల్తోనే వెళ్లిపోతామని ప్రతి ఒక్కరూ గుర్తుంచుకోవాలి. ఇక శరీరం శాశ్వతమని భ్రమించి అహంకారం పెంచుకోవటం ఎంతవరకు సబబు?

**ఇల్లు, వాకిలి, దుకాణాలు మొదలైన ఆస్తుల్ని చూసుకుని గర్వపడుతున్నావా? వాటిని అనుభవిస్తున్నది నీ వొక్కడివే కాదు**, అందులో చీమలు, ఎలుకలు, పిల్లులు కూడా ఉంటున్నాయి. పురుగులూ, కీటకాలు తిరుగుతున్నాయి. ఇల్లు ఇవాళ కట్టించావు రేపు మరమ్మత్తుకొస్తుంది. ఎల్లుండి పడిపోతుంది. అది ఉన్నా దానిని వదిలి నీవే వెళ్లిపోవాలికదా ఇక తిరిగిరాని సుదూరతీరాలకు.

ఇక నీ సంపదపై, ఐశ్వర్యంపై ధనకనక వస్తు వాహనాలపై గర్వముందా? చక్రవర్తి యుధిష్ఠిరుడు హస్తినాపురినేలినా హిమాలయాల్లోకి పోయాడు. రావణుని బంగారు లంక బూడిదైపోయింది. ఆ చక్రవర్తులు, రాజులు, వారి రాజ్యాలు చివరికి ఏమయ్యాయి? ఎక్కడున్నాయి? ఎవరిచుట్టూ లోకం తిరిగిందో ఆ చక్రవర్తులే కొన్నిసార్లు భిక్షగాళ్లై తిరుగుతుండటం నీవు చూడలేదా? వినలేదా? చదువలేదా?

**విద్యా, బుద్ధిమీద గర్వపడుతున్నావా? పెద్దపెద్ద పండితులు, విద్యావంతులు, ఋషులు, మునులు, జ్ఞానులు, ధ్యానపరులు, యోగులు, సన్యాసులు లోకంనుండి వెళ్లిపోయారు.**

రూపం, రంగు, ధనం, ఆరోగ్యం, వస్త్రాలు, భూషణాలు అన్నీ నాలుగు రోజుల ఆటవస్తువులు. వీటిని చూసుకుని గర్విస్తున్నావా? ఈ రోజున్నవి రేపు ఉండకపోవచ్చు.

సేకరణ, అనువాదం: జ్యోతిరాణి





# రచయితలకు ప్రత్యేకం

## కథలు-కబుర్లు (9)

యం.వి.కె.

పాఠకులలో మంచి ఊహలు రేకెత్తించాలని, కేవలం ప్రజాశ్రేయస్సును మాత్రమే జీవితాశయంగా పెట్టుకున్న (?) రాజకీయ నాయకులనూ, పతివ్రతా శిరోమణులనూ, నీతికి ప్రాణమిచ్చే ఉద్యోగుల్నీ, న్యాయంగా కోట్లు సంపాదించిన కుబేరుల గురించీ రాశాడనుకోండి. మరో ఉదాహరణ. రచయిత మందుల దుకాణదారు. అక్కడ బలమిచ్చే టానిక్కులూ ఉంటాయి. రోగాలు నయం చేసే బిళ్లలూ ఉంటాయి. నిద్రమాత్రలూ, విషరసాయనాలూ ఉంటాయి. అతడికి 'నిషిద్ధ' వస్తువంటూ ఉండదు. నేను ఫలానా మందు అమ్మను అనటానికి లేదు. లాండ్ స్కేప్ చిత్రం గీసే కళాకారుడికి తెలుసు. ఆ ప్రకృతి దృశ్యానికి పేడకుప్పలు కూడా అందం చేకూరుస్తాయని.

3. స్థలకాల పరిమితులు రచయితలకూ వర్తిస్తాయి. సమాజ నియమాలకు వాళ్లు అతీతులు కారు. అందువల్లనే వాళ్లను 'వాస్తవిక రచయితలు' అంటాం. బురదగుంటల్ని గురించీ, పాపకూపాల్ని గురించీ రాసినా నేనే పాపం చెయ్యలేదని నాకు తెలుసు.

4. ప్రతి కథకూ నేను నా అంతరాత్మను సంప్రదిస్తానని చెప్పలేను. ఏదో ఒక విషయం గురించి మంచిగానో, చెడుగానో రాసినా అది నా అభిప్రాయం అనుకోవలసిన అవసరంలేదు.

5. నేను సంపాదకుడినే ఐతే నీకథను తిప్పిపంపేవాణ్ణి అన్నారు. అంతటితో ఆపారేం? ఇప్పటికీ నా కథల చేసిన సంపాదకులందరి మీద కేసులు పెట్టండి. సెన్సారు వాళ్లకు నా గురించి చెప్పి ఇలాంటి బూతు కథల్ని నిషేధించమని సలహా ఇవ్వండి.

6. ప్రతి వ్యక్తి తన ఇష్టప్రకారమే జరగాలంటే సాహిత్యానికి దుర్దశ పట్టినట్టే. మరో విషయం సాహిత్యంలో మంచి చెడులను నిర్ణయించగల పోలీసులెవరూ ఇంతవరకు పుట్టలేదు. కొన్ని పనులు చెయ్యకూడదని ఎవరికివాళ్లు ఆంక్షలు విధించుకోవడం మంచిదే. 'విమర్శ', 'రచయిత అంతరాత్మ' అప్రకటితంగానే రచనలకు పరిమితులు విధిస్తున్నాయి. మీ నిర్ణయం అమలు జరిగేటట్టయితే నాకు నూటపదిహేను రూబుళ్ల నష్టం. కాని మా నాన్నకు ఈ కథ బాగా నచ్చింది మరి.

"చవకబారు రచయితలు మాత్రమే ఇలా రాస్తారు. మీరిలా రాయటమెందుకు?" అని సలహాయిస్తున్నారు. పాపం శమించుగాక. నా గురించి మీకు నిజంగా ఇంత గొప్ప అభిప్రాయం ఉందని నమ్మనా? ఈ విశాల సాహితీ లోకంలో నాలాంటి 'చవక బారుగాళ్లక్కూడా' పిసరంత స్థానం లేదంటారా? మాలాంటి వాళ్లతో పోల్చుకుంటేనేగద కొందరు గొప్పవాళ్లమనుకొని మీసాలు మెలేసుకోగలిగేది. మాటకూ, మనసుకూ ఎంత తేడా!

### ఎడ్గార్ అలాన్ పో

కథల గురించిన చర్చకు ముగింపు ఉండదు. రాయదలచుకున్న వాళ్లెవరూ లాక్షణికతను అధ్యయనంచేసి ప్రారంభించరు. మౌఖిక సాహిత్యంలోనే కథలున్నాయి. "కథకు భాషక్కర్లేదు. సైగల్తో కూడా చెప్పవచ్చు". ఈ వాదాలన్నీ సబబే గాని 'ఆధునిక కథ' మాత్రం నిర్దుష్టంగా పడమటి దేశాల్లో రూపుదిద్దుకున్న ప్రక్రియ

అనటంలో ఎవరికీ సందేహముండక్కర్లేదు. ప్రధానంగా, అమెరికాకు చెందిన ఎడ్గర్ అలాన్ పో (1809-1849)కు కథాలక్షణాల్ని విశ్లేషించిన కీర్తి దక్కుతుంది. ఆ రోజుల్లో సాహిత్య విమర్శ అంతగా అభివృద్ధి చెంద లేదు. 'పో' తొలి సారిగా కథా ప్రక్రియలోని సాంకేతిక పదాల్ని, తాత్వికతను చర్చిం చాడు. (ముఖ్యంగా డిటెక్టివ్, హారర్ కథ లకు ఆద్యుడు పో)

మరొక కథారచయిత నథానియేల్ హథార్న్ (1804-1864) రాసిన ట్వైస్ - టోల్డ్ టేల్స్‌ను సమీక్షిస్తూ ఇలా రాశాడు పో.

రచయిత తన ప్రతిభను చాటుకోవటా నికి చిన్న కథ చాలా అనువైన ప్రక్రియ. కథ ఎంత పొడుగుండాలి? సుమారు ఓ గంట సేపట్లో ముగించగలిగినంత. (కవితకూ, చిన్న కథకూ దగ్గర సంబంధ ముంది. ఏకబిగిన ఆసాంతం చదివితే తప్ప దేన్నీ పూర్తిగా ఆస్వాదించలేం) కథలో ముఖ్యంగా కావలసింది ఒక ఉద్వేగాన్ని కలి గించటం. యూనిటీ ఆఫ్ ఎఫెక్ట్. ఒక సిట్టింగ్‌లో చదవలేకపోతే ఈ అనుభవం కలగదు. అనేక సంఘటనలు, తత్పరిణా మాలు ఉన్న పెద్ద పుస్తకాలు చదివితే కలిగే అనుభూతి వేరు. అక్కడ పఠనాక్రమమే ఒక ఆనందం.

ఏ ఉద్వేగమైనా తీవ్రస్థాయిలో ఎక్కువ సేపు నిలవలేదు. అందువలన అనేక మలు పులు తిరిగే పెద్ద పుస్తకంలో అది సిద్ధిం చదు. "ఎక్సైట్‌మెంట్" అనబడే స్వభావ రీత్యా క్షణికం. తాత్కాలికం. అందువలన కథాప్రయోజనం తీవ్రోద్వేగాన్ని కలిగించ టమే అనుకుంటే దానికి అత్యనుకూలమైనది కథానిక. మరీ చిన్న కథ కూడా మనల్ని ఇంప్రెస్ చెయ్యొచ్చు కాని ఆ ఇంప్రెషన్ కాస్త బలహీనంగా ఉంటుంది. ఒక్కనీటి చుక్కతో రాయి చల్లబడదు. మరీ చిన్నక థలు పిట్టకథల్లా తేలిపోయే ప్రమాద ముంది.

ఒక సిట్టింగులో, ఏకబిగిన చదివించగలి గిన కథ కావాలి. నవల పనికిరాదు. మధ్యలో పుస్తకం మూసేసి ఇతర పనులు చేసుకుంటాం. ఉద్విగ్నతలోని తీవ్రత తగ్గు తుంది. వాయిదా పడుతుంది. ఏకబిగిన చదివే క్రమంలో పాఠకుడు, రచయిత సృష్టించిన లోకంలోకి ప్రవేశిస్తాడు. పాఠ కుడి ఉద్వేగాల్ని, ఆలోచన్ని కంట్రోల్ చెయ్య గలిగిన అవకాశం దొరుకుతుంది రచయి తకి. మధ్యలో అంతరాయం ఉండదు.

రచయితకు స్పష్టత ఉంటే మొదట పాత్రలు, సంఘటనలు ఊహించడు. పాఠ కుడిలో కలిగించవలసిన 'ఎఫెక్ట్' ఏమిటో మొదట నిర్ణయించుకొని అందుకనుకూ లంగా పాత్రల్ని వగైరా సృష్టిస్తాడు. పాఠకు డిని కథలోకి లాగని పదం ఒక్కటి కూడా ఉండదు అలాంటి రచనలో రచయిత తాను దర్శించిన 'సత్యాన్ని' పాఠకుణ్ణి కట్టిపడేసేలా చెప్పగలడు.

★ ★ ★

'సమస్య'కు పరిష్కారం చూపించని 'ప్లాటు' అసంపూర్ణం. ('పరిష్కారం' అంటే ప్లాటులోని హేతుబద్ధత అని మాత్రమే అర్థం). పరిష్కారాన్ని దృష్టిలో పెట్టుకుని, ఏక సూత్రతతో ఆ దిశగా మాత్రమే కథనం సాగుతుంది. కారణాలు, పరిణామాలు, తత్సంబంధిత సంఘటనలు, సంభాషణలు- అన్నింటి ప్రయోజనం 'పరిష్కారం'.

ఈ పరిష్కారమే పాఠకుడిలో కలగబోయే ఎఫెక్ట్. ఉద్వేగాలు అసంఖ్యాకం. అందులో ఒకటి ఎంపిక చేసుకోవాలి. 'ఒరిజినాలిటీ' అంటేనే విలక్షణత. కథ చదివిన పాఠకు డిలో, అది రచయిత తనొక్కడితోనే మొద టిసారిగా పంచుకున్న 'రహస్యం' అన్న భ్రమ కలిగించగలగాలి.

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు) ★

# ఆనకట్టలకింద సమాధి అవుతున్న జీవితాలకథ 'దృశ్యాదృశ్యం'

కథ వెనుక కథ

ముచ్చటగా మూడునవలలతోనే మంచి రచయిత్రిగా పేరు తెచ్చుకున్నారు యువ రచయిత్రి చంద్రలత. ఆమె ఆరేళ్లపాటు ఎంతో కష్టపడి అధ్యయనం చేసి రాసిన 'దృశ్యాదృశ్యం' ఆశించిన ప్రయోజనం సాధించిందనే చెప్పవచ్చు. నదుల అనుసంధానం, భారీ ఆనకట్టలు, ముంపు ప్రాంతాలు, ప్రజలకు నష్టపరిహారం.. ఇవన్నీ మనం తరచుగా వినే మాటలే. వీటివల్ల ఇల్లూవాకిలీ, పొలమూపుట్రా కోల్పోయి చెల్లాచెదురయ్యే ప్రజలు, ఆయా ప్రాంతాల సంస్కృతులు, ప్రకృతి, పర్యావరణాలకు జరుగుతున్న నష్టాల గురించి మాత్రం ఎవరూ మాట్లాడరు. ప్రకృతిపై ఆధిపత్యం చలాయించడమే గొప్పనుకునే మనిషికి ఆ ప్రకృతి ప్రకోపిస్తే ఏం జరుగుతుందో తెలియదా? ఈ ప్రశ్నే వేస్తున్నారు చంద్రలత 'దృశ్యాదృశ్యం' నవలలో. పర్యావరణ సమస్యపై వచ్చిన తొలి విస్తృత నవలగా ప్రముఖులు పేర్కొన్న ఈ నవల ఏడాదిన్నర క్రితమే వెలువడింది.

## క్లుప్తంగా కథ ఇది..

విదేశాల్లో పుట్టి, పెరిగిన ఓ ఆంధ్ర యువతి ఈ దేశం వస్తుంది. ఇక్కడ పర్యావరణం, జలావరణాలపై జరుగుతున్న కృషిని అధ్యయనం చేయడం ఆమె ఉద్దేశం. భారీ ఆనకట్టల ఫలితంగా ముంపునకు గురై నిరాశ్రయులైన వారి దీనగాథలు, ఆనకట్టలు కట్టే విషయంలో సాంకేతిక నిపుణులపై రాజకీయనాయకుల పెత్తనాలు, చివరకు




మిగిలే వ్యతిరేక ఫలితాలు.. ఇవన్నీ తెలుసుకున్న ఆ యువతి పరిష్కార మార్గాలు ఆలోచించమంటుంది. ఇదీ క్లుప్తంగా నవలలో కథ.

## ప్రతిపాత్రా హీరోయే

రచయిత్రి అభిప్రాయం ప్రకారం కథలో ప్రతిపాత్రా హీరోనే. ఒకో ఆలోచననీ ఒకో పాత్ర ద్వారా చెప్పే ప్రయత్నం చేశారు. నదికి ప్రతీకగా ఓ వ్యక్తిని పెట్టి కథ నడిపించడం, సందర్భోచితమైన భాష వాడటం.. ఇవన్నీ ఈ నవల ప్రత్యేకతలే. వాస్తవిక సమస్యను కాల్పనిక కథతో ముడి వేసి మనసుకు హత్తుకునేలా చిత్రించిన ఈ నవల ముందూ వెనక జరిగిన సంఘటనల గురించి రచయిత్రి చంద్రలత ఏం చెప్తున్నారంటే..

## బజార్నపడే బతుకుల్ని ప్రత్యక్షంగా చూశాను

మేం నెల్లూరులో ఉంటాం. సోమశిల ప్రాజెక్టు కండలేరు రిజర్వాయరు కింద డిస్‌ప్లేస్‌మెంట్ జరగడం, పునరావాస కార్యక్రమాల్లో లోటుపాట్లపై పేపర్లలో రోజూ వార్తలు వచ్చేవి. అవన్నీ ఆసక్తిగా చదివేదాన్ని. అలా కడపనుంచి నెల్లూరు వచ్చినవాళ్లలో చాలా మంది గిరిజనులే. ఎక్కువగా యానాదులుండేవారు. వాళ్లకు నష్టపరిహారం అందకపోవడం, అందినా ఒకేసారి చేతికందిన వేలరూపాయలను ఏంచేయాలో తెలియక పిచ్చిగా కొద్ది రోజుల్లోనే ఖర్చు పెట్టేసి, తిరిగి రోడ్డున పడటం... అదంతా ప్రత్యక్షంగా చూశాను. తిరుమూరు సుధాకరరెడ్డి అనే తెలుగు లెక్చరరు ఉండేవారు. నా 'రేగడి విత్తులు' నవల చదివిన ఆయన నేను గ్రామీణుల మనస్తత్వాన్ని బాగా అర్థం చేసుకోగలనని ఈ అంశం గురించి రాస్తే బాగుంటుందని సూచించారు. నిజానికి 1997లో నేనీ నవల రాసినపుడు ఇది ముంపువాసుల కథ. మునకచెలక అని పేరు కూడా పెట్టాను. ముంపు వాసులకు సరైన పరిహారం దొరకాలన్నదే అప్పుడు నాకు ప్రధానాంశం. పలువురు ముంపువాసులను కలుసుకుని వారి అనుభవాలు తెలుసుకుని ఆ అనుభూతితో ఒక అధ్యాయం రాశాను. కానీ రాసేటప్పుడు ఈ అంశంపై నాకున్న అవగాహన చాలదనిపించింది. ఇంకా చదవాలనుకున్నాను. ఏనాక్షీ గంగూలీ ఎడిట్ చేసిన బిగ్ డ్యామ్స్ డిస్‌ప్లేస్ పీపుల్.. అనే పుస్తకం చదవడం నన్ను మరింత అయోమయంలో పడేసింది. దాంతో రాత పక్కన పెట్టి అధ్యయనం మొదలెట్టాను. అప్పటివరకూ నాలో ఉన్న



చంద్రలత

పెద్ద ఆనకట్టలపై ఫ్యాసినేషన్ పోయి కొత్త దృక్పథం అలవడింది. ప్రపంచవ్యాప్త అనుభవాలను, ప్రజా ఉద్యమాలను, ఆనకట్టల నిర్మాణశాస్త్రాన్ని, ప్రముఖ ఇంజినీర్ల కృషినీ అధ్యయనం చేశాను. పుస్తకాల సేకరణ, వ్యక్తులతో సమావేశాలు, పలుప్రాంతాల పర్యటన.. ఇలా కొన్ని సంవత్సరాలే గడిపాను. ఆలోచిస్తున్న కొద్దీ విషయం మరింత జటిలమవడం, మరింత అధ్యయనం చేయాల్సిరావడం.. జరిగేది. నా ఆలోచనలకు ఒక స్పష్టత వచ్చేసరికి విషయం ముంపు వాసులు కాక జలావరణం అయింది. ఇంతలో నో బిగ్ డ్యాం.. నుంచి నో డ్యాం... వాదనలు బలం పుంజుకున్నాయి. దేశవ్యాప్తంగా చర్చ ప్రారంభమైంది. మళ్లీ అధ్యయనం. అలా ఆరేళ్ల పాటు విషయంతో, పాత్రలతో నాకు చాలా సాన్నిహిత్యం ఏర్పడింది. నవల పూర్తయింది. నవల కావడంవల్ల కాల్పనికతకు ప్రాధాన్యమిచ్చే ప్రయత్నంలో విషయాన్ని విపులంగా చెప్పే వీలులేనిచోట సూచనప్రాయంగానైనా నా పరిశీలనను ప్రస్తావించే ప్రయత్నం చేశాను. జలవనరుల వినియోగంపై అంతర్జాతీయ దృష్టిని, పునరాలోచనను పరిచయం చేసేందుకు నేను చేసిన ఈ ప్రయత్నం ఫలించిందనే అనుకుంటున్నాను. అయితే ఇది వ్యక్తిగా నా ఒక్కదాని అధ్యయనం, విశ్లేషణ మాత్రమేనన్నది గమనించాలి. నాకున్న పరిమితుల్లో నాకు తెలిసినంతవరకు తృప్తికలిగేరీతిలో అందించే ప్రయత్నం చేశాను.

## అమెరికాలోనూ ఆదివాసీ తెగలు అంతరించాయి

పెద్ద ఆనకట్టలు లేకపోతే హరితవిప్లవం లేదు. అది లేకపోతే మన ఆర్థిక వ్యవస్థ లేదు. ఆర్థిక విషయాలకు సంబంధించింది కళ్లకు త్వరగా కనిపించే విషయం. కానీ ఈ నవలలో నేనెంచుకున్నది తక్షణం కంటికి కనిపించేది కాదు. పర్యావరణానికి సంబంధించిన భవిష్యదృశ్యం. అందుకే దృశ్యాదృశ్యమన్న పేరు పెట్టాను. అమెరికాలో మొట్టమొదట కట్టిన కొలరాడో డ్యామ్ మూలంగా ఎన్నో ఆదివాసీ తెగలు పూర్తిగా అంతర్ధానమైపోయాయి. ఇక చెట్లు చేమలు, నీటిలోని జీవరాశి సంగతి చెప్పనే అక్కర్లేదు. నిజానికి ఆలోచిస్తే ఈ పెద్ద ఆనకట్టలన్నీ కూడా సామ్రాజ్యవాదులకు ఉపయోగపడ్డాయి. కాబట్టే వారు వాటిని ప్రోత్సహించారు. నాశనమయ్యే ఇక్కడి సహజ సంపద, సంస్కృతి వాళ్లకు అనవసరం. చిన్న ఆనకట్టల వల్ల ఎలాంటి నష్టం ఉండదు. నా అధ్యయన క్రమంలో కాటన్ మహాశయుడి గురించి, కె.ఎల్. రావుగారి గురించి ఎన్నో విషయాలు తెలుసుకున్నాను. ప్రముఖ ఇంజినీరు శ్రీరామకృష్ణయ్యను కలిసి మాట్లాడాను. వారంతా కేవలం ఇంజినీర్లు కాదు. సామాజిక స్పృహ కలిగిన వ్యక్తులుగా వారు నన్ను ఎంతో ప్రభావితం చేశారు. నవల రాసే ప్రయత్నంలో చాలా విషయాలు నేర్చుకుని రచయిత్రిగా నేనూ ఇంప్రూవ్ అయ్యాననే అనుకుంటున్నాను.

ఇక నవలకు వచ్చిన స్పందన గురించి చెప్పమంటే... పర్వాలేదు. పాఠకులు వెంటనే ఆమోదించారు. పదినెలల్లోనే రెండో ముద్రణకు వెళ్లింది. ఇంజినీరింగ్, పర్యావరణ శాస్త్రం చదువుతున్న విద్యార్థులు తప్పనిసరిగా చదువుతున్నారని తెలిసింది. దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి, ప్రవాస భారతీయుల నుంచి కూడా తమ అభిప్రాయాలను తెలియజేస్తూ నాకు ఉత్తరాలు వస్తున్నాయి. ప్రపంచవ్యాప్తంగా ఉన్న పరిస్థితుల్ని ఆలోచనల్ని స్థానిక సమస్యలతో కలిపి రాయడం ద్వారా నేను చేసిన ఈ ప్రయత్నం సఫలమయిందనే అనుకుంటున్నాను.

సేకరణ: పద్మశ్రీ యలమంచిలి

# రచయితలకు సూచనలు

- 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, జోకులు, జ్ఞాన తరంగిణి, రచయితలకుప్రత్యేకం, వ్యంగ్యరచన, ఫీచర్లు, 'కథ వెనుక కథ', 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 95 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగానీ, తగ్గించడంగానీ వుండదు గనుక రచయిత-(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 95 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతి వ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 95 పేజీలకు సరిపోయేలా ప్లాన్ చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచి పద్ధతి.**
- ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- **ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్
హైదరాబాద్ 500 082.



## నవలాపరిచయం

వృద్ధులను వృద్ధాశ్రమాలలో చేర్పించటం అమానుషం. రెక్కలు ముక్కలు చేసుకుని కష్టపడి సంపాదించి సంతానాన్ని పెంచి, పోషించి, చదివించి, ప్రయోజకులను చేసిన తల్లిదండ్రులను ఓల్డేజీహోములలో చేర్చటం ఎంత అన్యాయం? పెద్దలు మన జీవితాలకు చుక్కాని లాంటివారు. ఆశ్రమాలు వృద్ధులకు కేవలం కాలక్షేపం కోసమే ఉపయోగపడాలి గానీ అవి పంజరాలూ, చెరసాలలూ కాకూడదు. వృద్ధులను పసి పిల్లల్లా చూసుకోవాలి" అంటున్న ఆపెద్దమనిషి మాటలను అందరూ హర్షించారు. ఫలితంగా ఓ సరికొత్త నిర్ణయం తీసుకుని ఆచరించారు.

వృద్ధాశ్రమాలలో చేరిన వృద్ధుల ఇబ్బందులూ, మానసిక క్షోభ, అయిన వారి కోసం- ఆత్మీయల కోసం వారు పడే తపన, పరిష్కార మార్గం సోదాహరణంగా విశ్లేషించిన గంటి వెంకటరమణ నవల 'అందిన స్వర్గం' ఈ నెల చతుర సమర్పణ.



## రచయిత్రి పరిచయం

**ఆమె మాటల్లోనే...**



పుట్టి పెరిగిందీ, స్థిరపడిందీ ఇక్కడే. నా రచనలు వివిధ దిన, వార, మాస పత్రికలలో ప్రచురితం అయ్యాయి. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, ఆంధ్రభూమి, స్వాతి(మాస,వార) పత్రికల పోటీల్లో నిలబడి నాకు సంతృప్తిని ఇచ్చాయి.

నా మొదటి పాఠకులూ, విమర్శకులూ నా పిల్లలే. ఈక్షణం వరకూ రాయమని ప్రోత్సహించేది నా స్నేహితురాలు శ్రీమతి శీలాసుభద్రాదేవి గారు. ఆమెకు నా కృతజ్ఞతలు తెలపడం సంతోషంగా వుంది.

ఓల్డ్ మెలొడీస్ వినడం, పాడడం, రైల్లో కిటికీ దగ్గర కూర్చొని ప్రకృతిని చూడడం ఇష్టం.

"అందినస్వర్గం" చతుర మాసపత్రికలో ప్రచురించ బడడం నాకు నిజంగా అందిన స్వర్గమే. అందుకు సర్వదా కృతజ్ఞురాలిని.

రచయిత్రి చిరునామా:
**గంటి వెంకటరమణ,**
ఇం. నెం. 4-41/2,సాయికృప,ప్రశాంతినిలయం,
శ్రీనాగేశ్వర నగర్ కాలనీ,
స్ట్రీట్ నెం-2, కొత్తపేట, (రంగారెడ్డి జిల్లా)
హైదరాబాద్ - 500035.



# అందిన స్వర్గం

**గంటి వెంకటరమణ**

"ప్రశాంతి నిలయం" ఆర్చిలా ఉన్న గేటు మీద అక్షరాలు పొందికగా ఉన్నాయి. పగలు సూర్య కాంతిలో రాత్రిళ్ళు మెర్క్యూరీ లైట్ల వెలుగులో ఆకర్షణీయంగా కనిపిస్తాయి.

హైద్రాబాద్ చూడాలని వచ్చిన దేశ, విదేశీ టూరిస్టులు ఆ పెద్ద భవనాన్ని తప్పకుండా చూసి వెళ్తారు. అందంగా, అద్భుతంగా పాల రాతితో నిర్మించిన చారిత్రక చిహ్నంలా కనిపిస్తూ చూసేవాళ్లని ఆకట్టుకుంటుంది. అక్కడ భాషకీ, జాతికీ, రంగుకీ భేదం లేదు.

ఆ గేటు పై భాగంలో ఓ చేయి నాలుగు వేళ్ళు మడచి చూపుడు వేలు మాత్రం పైకెత్తినట్లు అమర్చబడింది. సర్వమత సారమొక్కటే, దేవుడొక్కడే, సర్వేశ్వరుణ్ణి చేరే మార్గమూ ఒక్కటే అని చెబుతున్నట్లుంది.

తెల్లవారు ఝామున నగర సంకీర్తనం, తర్వాత భజన, ఆపైన నమాజ్ అటుపిమ్మట ప్రార్థన ఇలా సాగిపోతూ ఉంటాయి రోజు వారీ కార్యక్రమాలు.

విశాలమైన ఆ ఇంటి చుట్టూ చెట్లున్నాయి. వాటిని నాటి కొంత కాలం పెంచిన ఆ తరం మనుషులు లేరు. కొత్త వాళ్లు వస్తున్నారు. వాటి ఆలనా పాలనా ఇప్పుడున్న వాళ్లు చూస్తున్నారు.

గేటు దాటి లోపలికి వచ్చాడు మహేంద్ర. పక్కనే ఉన్న భువనేశ్వరి అతని వైపు చూసి "పళ్ల బుట్ట కారులోనే మరచిపోయాం" అంది నొచ్చుకుంటూ.

తల తిప్పి అటు తిరిగి "అదిగో ప్రసాద్ వస్తున్నాడు" అని చూపించాడు. డ్రైవరు భుజం మీది గంపలోంచి మామిడి పళ్లు తొంగి చూస్తున్నాయి.

అతను నడుస్తూ భార్యతో అన్నాడు, "నువ్వు ఎన్నైనా చెప్పు భువనా! నాకీ గిల్టీ ఫీలింగ్ పోదు గాక పోదు. ఛ! ఏం బ్రతుకు ఇది? మనల్ని మనం మభ్యపెట్టుకుంటూ పైకి నవ్వుతూ, నటిస్తున్నాం భువనా!"

భువనేశ్వరి చిరాకు పడింది. "ఇక్కడికి వచ్చిన ప్రతిసారీ మీరిలా బాధపడుతుంటే నేను ఏమి చేయగలను? మన వాళ్లకి విదేశాల మీద మోజు పెరిగింది. అఫ్‌కోర్స్ నాక్కూడా! తక్కువ సమయంలో ఎక్కువ డబ్బు సంపాదించే మార్గం అది. ప్రతివాడూ ఎదగాలని కోరుకుంటాడు. అందులో తప్పేం ఉంది? అలా దేశం విడిచి వెళ్ళాల్సి వచ్చినప్పుడు పెద్దవాళ్లని ఎక్కడో ఓ చోట భద్రంగా ఉంచాలి కదా".

మహేంద్రకి వొళ్లు మండింది. "మనమేం వెళ్లటం లేదుగా..."

"ఇవాళ కాకపోతే రేపైనా వెళ్ళాల్సిన వాళ్ల మేగదండీ!.

"స్టుపిడ్! నేను నీతో చెప్పానా మనం వెళ్తున్నాం అని"

భువనేశ్వరి విసురుగా నడుస్తూ "ఎప్పుడూ ఉండే భాగోతమే ఇది. మీరు మూడ్ పాడు చేసుకుని నా మూడ్ పాడు చేస్తారు. మనమే... మనమే ఎందుకు ఈ బాధ్యతల్ని నెత్తిన పెట్టుకోవాలి? ఖర్మరా దేవుడా ఖర్మ" అంది.

మహేంద్ర మరో మాట అనేలోగా గుమ్మం దగ్గరకి వచ్చేశారు. అక్కడే కూర్చున్న వ్యక్తి అడుగుల చప్పుడు విని తల పైకెత్తాడు. నవ్వు మొహంతో "రండి" అని లోపల వైపు నుంచి అటు మరింత విశాలంగా ఉన్న పెరట్లోకి తీసుకు వెళ్లాడు. అతను ఆ ఇంటినీ, ఆ ఇంట్లో మనుషుల్ని ప్రేమాభిమానాలతో చూసే 'కేర్‌టేకర్' రంగారావు.

మహేంద్ర ఇక్కడికి వచ్చినప్పుడల్లా తల దించుకునే వస్తాడు. గేట్లో అడుగు పెట్టగానే అతని తల సిగ్గుతో వొంగిపోతుంది. అతన్ని అంతగా క్షోభపెట్టే విషయానికి భువనేశ్వరి కొంచెం కూడా చలించదు.

"రంగారావుగారూ మీ ఋణం..." అని ఆపేశాడు మహేంద్ర.

ఆ మాట పూర్తి చేయనీయ లేదు రంగా రావు. "ఇందులో నేను చేసిందేముంది పొట్ట కోసం చేస్తున్నాను. అంతే"

"ఊహు", మహేంద్ర ఒప్పుకోలేదు. మీరు వీళ్లని ఎంత బాగా చూసుకుంటారో నాకు మాత్రమే తెలుసు"

రంగారావు చెబుతున్నాడు.

"ఒక విధంగా జాలేస్తుంది. ఈ వయసులో ఆశ్రమంలో ఉండటం బాధేనండీ! ఎంతో ఆశతో గేటు వైపు చూస్తుంటే గుండె తరుక్కుపోతుంది. ఇది ఆశ్రమం కాదు జైలు... సారీ".

మహేంద్ర అని అతను చెప్పేది వింటున్నాడు.

"జీవితం పడమటి వైపుకు మళ్ళుతున్న ఆ అమ్మలనీ, నాన్నలనీ చూసుకునే అవకాశం నాకూ, నా కుటుంబానికీ భగవంతుడు ఇచ్చాడు".

"అమ్మా ఎవరొచ్చారో చూడు" అనబోయి ఆపేశాడు రంగా. చల్లని గాలి భూదేవిని తాకుతూ ఆ పరిమళాన్నీ, అక్కడున్న చెట్లూ, మొక్కలూ, పూలూ, మొగ్గలూ వీటి సువాసనల్ని మోసుకు వస్తూ వస్తూ అదిగో అక్కడ ఆ శబ్ద తరంగాల్లో ఐక్యం అయిపోయింది.

అరవైకీ అరవై అయిదుకీ మధ్య ఆమె నాయికగా మారి తనని తాను మరచి పరిసరాలను మరచి భర్తకి ఇష్టమైన పాట పాడుతోంది. "ఒద్దురా కన్నయ్యా... ఈ పొద్దు" ఆయన అరమోడ్పు కళ్లతో ఆ గాన మాధుర్యంలో మునిగి తేలుతున్నారు. ఆయనే భవానీశంకరం, ఆవిడ భానుమతి.

మహేంద్రకి కళ్ల వెంట నీళ్లు ఊటలూరుతున్నాయి.

"మహీ! మీకు మతి పోతోంది". భువనేశ్వరి అతని చేతిని పట్టుకుని లాగింది. భానుమతి కల చెదిరినదానిలా ఉలిక్కిపడింది. ఆమె పాట ఆగిపోగానే ఆయనా కళ్లు తెరిచారు.

"మహీ! ఎలా ఉన్నావురా? ఇలారా! నువ్వుకూడా" కూడబలుక్కున్నట్లు ఇద్దరూ ఏక కంఠంతో అని అక్కడ ఉన్న పాలరాయి సోఫామీద ఇటూ అటూ జరిగి మధ్యలో వీళ్లిద్దరికీ చోటు ఇచ్చారు.

డ్రైవర్ ప్రసాద్ పళ్ల బుట్ట తెచ్చి అక్కడ పెట్టేసి వెళ్ళి అక్కడ ఉన్న వాళ్ళని పలకరిస్తున్నాడు.

"బామ్మా! ఆరోగ్యం ఎలా ఉంది? నీకు ఇష్టం అని పాటల క్యాసెట్లు తెచ్చాను. మాయాబజార్ వీడియో కేసెట్. తాతగారికి..." మహేంద్ర నానమ్మ భుజం మీద చేయి వేశాడు.

ఆవిడ వింటోంది. మనవడిని అపురూపంగా చూస్తోంది. రెండు కళ్లు చాలవన్నట్లు రెప్ప వేయడం మరచి పోయింది. రెండు చేతుల్తో అతని మొహాన్ని చేతుల్లోకి తీసుకుంది.

భవానీ శంకరం గారు మనవరాలి వరుస అయిన భువనేశ్వరితో ముచ్చట్లాడుతున్నారు. 'భాను వట్టి అమాయకురాలు. ఎప్పుడో ఓ రోజు వస్తుంది. ఆ రోజు పండగ చేసుకోబోతామని అంటుంది. ఇటువంటి ఆలోచనల్నే స్వర్గానికి నిచ్చెనలు వేయటం అంటారు. తెల్లవారింది మొదలు రాత్రి నిద్ర పోయే వరకు గత వైభవం తప్ప మరో ఆలోచనే లేదు. ఒక్కోసారి నా గుండె ధైర్యం కూడా పిరికి పిల్లిలా పారిపోతుందేమో అని భయం వేస్తుంటుంది."

"అయ్యో! తాతగారు మీరు వర్రీ అవద్దు. ఆవిడ కోరుకున్నట్లు జరగాలనే ఆశిద్దాం. మీరు ఇలా నిరాశతో మాట్లాడితే మహీ బెంగతో భోజనం కూడా చేయరు. ఆయన బాధ పడితే నాకు మాత్రం ఏం బావుంటుంది? "

ఆయన దుఃఖాన్ని మింగుకున్నారు. అది స్పష్టంగా కనిపిస్తూంటే భువనేశ్వరికి ఏం చేయాలో తోచలేదు. ఒకటా రెండా నాలుగేళ్ళు గడిచిపోయాయి.

"అతడాజానుబాహుడు, అరవింద దళా

యతాక్షుడు... మహేంద్రా రాముడెలా ఉంటాడో నాకు తెలీదు. ఆ భద్రాద్రిరాముడు, కోదండరాముడు, జానకీరాముడు అచ్చం నీలాగే ఉంటాడేమో?" ఆవిడ ఉద్వేగంతో మనవడిని అబ్బురంగా చూస్తూ, అంతులేని ఆనంద సాగరంలో మునుగుతూ తేలుతోంది.

"అరే మరచే పోయాను. తాతగారూ ఇదిగో ఇది మీకు" అని పొగాకు కాడలు రెండు ఇచ్చాడు మహేంద్ర.

అది అందుకుని భవానీశంకరం అన్నారు, "మీ నాన్న గొప్పవాడురా మహీ, చాలా మంది ముందు చూపుతో బ్యాంక్ బాలెన్స్, ఇల్లూ, వాకిలీ, షేర్లూ, ఇలా ఎన్నో రకాలుగా ఏర్పాట్లు చేసుకుంటారు. అందరిలా ఉంటే మరి నా కొడుకు గొప్పతనం ఏముందీ?"

భువనేశ్వరీ, మహీ ఆయన చెప్పే విషయాన్ని వినేందుకు ముందుకు జరిగారు.

భానుమతి భర్త మొహంలోకి చూస్తోంది.

"వాడు కొంత వయసు వచ్చేవరకూ తను సిగరెట్ కాల్చే విషయం నాకు తెలియకుండా జాగ్రత్త పడ్డాడు. పెద్దవాడు కరుణాకర్ పుట్టిన రెండేళ్లకి నువ్వు పుట్టావు. అప్పుడు దొరికి పోయాడు"

దూరంగా గంటలు వినిపిస్తున్నాయి.

నలుగురూ నెత్తిమీద పిడుగు పడ్డట్లు హడలిపోయారు. తిరిగి సర్దుకోబోతుంటే మరోసారి గంటలు మోగాయి. రంగారావు అందర్నీ పలకరిస్తూ ఇక్కడికి వచ్చేశాడు.

హఠాత్తుగా భానుమతి మనవడి చేతిని అందుకుంది. ఆ మరో చేతిని భవానీ శంకరంగారు గట్టిగా పట్టేసుకున్నారు.

"మమ్మల్ని కూడా నీతో తీసుకువెళ్లరా మహీ! మేము ఇక్కడ ఉండం. అమ్మా! భువనా మమ్మల్ని తీసుకు వెళ్ళండి" అని ప్రాధేయపడుతున్నారు.

రంగారావు వచ్చి "అమ్మా! నన్ను వదిలేసి వెళ్ళిపోతారా! మరి నాకెవరున్నారు? నాన్నా! మీరు కూడా ఏమిటీ చిన్న పిల్లాడిలా బెంబేలు పడడం ఏం బాగుంటుంది చెప్పండి? మీరో గొప్ప మేధావి. ఆ విషయం అందరికీ తెలుసు. లాయరు భవానీ శంకరం గారు నీరుగారి పోవచ్చా" అని మెల్లగా ఆ వృద్ధ దంపతులిద్దరి మధ్యా కలగ చేసుకున్నాడు.

అటు దృష్టి ఇటు మళ్లింది. రంగారావు మాటలు జోలపాటలు. ఇటు దృష్టిని అటు మళ్లించుకోలేని మహేంద్రా భువనేశ్వరీ కొద్దిసేపు ఆగి, మనసులో నిండిన బెంగని మోయలేక మోస్తూ కారు దగ్గరికి వెళ్లారు.

కారులో కూర్చోబోతూ భార్యా భర్తలు ఇద్దరూ తల తిప్పి ఆ వైపు చూస్తే అక్కడ పది మంది చేతులు గాల్లో కదులుతున్నాయి. వాళ్లంతా ఆశ్రమవాసులు.

కారు మలుపు తిరిగింది.

గుండె తట్టుకోలేని బాధ నిశ్శబ్దాన్ని ఆశ్రయిస్తుంది. మహేంద్రుని మాట్లాడించలేదు భువనేశ్వరి.

అరగంట తర్వాత కారు ఇల్లు చేరుకుంది.

హారన్ శబ్దం విని వాచ్‌మన్ తలుపు తీశాడు. గేటుకీ ఇంటికీ మధ్య చాలా దూరం ఉంది. చుట్టూ మొక్కలూ, తీగలూ ఉన్నాయి. గేటుకి రెండు వైపులా రెండు కొబ్బరి చెట్లున్నాయి. నిండు చూలాల్లా ఎప్పుడు చూసినా కొబ్బరి బొండాలతో కొద్దిగా వొంగినట్లు కనిపిస్తాయి.

ఓ వైపు బంగినపల్లి, మరో వైపు రసాల మామిళ్లు వేసవిలో నోరూరిస్తాయి. అక్కడ వేసవిలో పూల ఘుబాళింపులు వర్ణించలేం. ఇవన్నీ భవానీ శంకరం పాతినవే. వేయి గజాల భూమి కొని తనకి ఇష్టం అయిన రీతిలో కట్టించారాయన.

లోపల కలకలం వినిపించింది. ఉలిక్కిపడ్డాడు మహేంద్ర. భువనేశ్వరి అతని చేతిని పట్టుకుని పోర్టికోనుంచి మెట్ల మీదికి నడిచింది.

'తాతగారెలా ఉన్నారు?' అడిగాడు మహేంద్ర కొడుకు మనోహర్ మెట్ల మీదకు

ఎదురొచ్చి, అతనికి తెలుసు. అక్కడికి వెళ్ళి వచ్చాక రెండు రోజులు ఇంటి వాతావరణమే మారిపోతుంది. ఇమడ లేనంత సఫోకేషన్. ఊపిరాడదు. టివి దాని పాటికి అది వాగుతూనే ఉంటుంది. గదిలో రేడియో పాడుతుంది. ఎవరికేం మాట్లాడాలనిపించదు.

అక్కడితో జరగరాని ఘోరం జరిగిపోయినట్లూ స్వరపేటికలో ఏదో అడ్డుపడి మూగబోయినట్లూ ఉంటుంది. 'నాన్నగారూ!' మహేంద్ర కూతురు జిక్కీ పలకరించింది.

అతను మాట్లాడలేదు. మాట్లాడడని కూడా ఆ పిల్లకి తెలుసు. తండ్రి చేతిని తన చేతుల్లో బంధించింది. ఆప్యాయంగా ప్రేమగా నొక్కింది. మహేంద్ర తలెత్తి కూతురి మొహంలోకి చూశాడు.

"అమ్మా! నువ్వు అక్కమ్మతో కాఫీ పెట్టమని చెప్పు" అంది. భువనేశ్వరి తెల్లబోయింది. మహేంద్రని పలకరించాలంటే అతని పెంపుడు కుక్క కూడా భయపడుతుంది. మామూలు రోజుల్లో అయితే గట్టిగా భయపడకుండా అరుస్తూ, ఇటు, అటూ పరిగెత్తుతూ తోకాడిస్తూ, గారాలు పోయే లిల్లీ జాన్ ఇదిగో ఇవాళ ఉన్నట్టే ప్రతిసారీ గుమ్మం దగ్గర కాళ్ల మధ్యలో మొహం దాచుకుని బెంగగా చూస్తూంటుంది.

"లిల్లీ జాన్... కమ్... కమ్" జిక్కీ తండ్రిని సోఫాలో కూర్చోబెట్టి చిటికె వేసి పిలిచింది. తోకాడిస్తూ వచ్చేసి మహేంద్ర దగ్గర కూర్చుంది.

మహేంద్ర విసుగ్గా "నన్ను వదిలేయ్ జిక్కీ" అన్నాడు.

"నాన్నా! మీకు తెలియని విషయాలు నేను చెప్పడం లేదు. మీరు ప్రతిసారీ కొండంత భారాన్ని గుండెల్లో నింపుకుని వస్తారు. ఇన్నాళ్ళూ సరిపెట్టుకున్నాను. ఈ రోజేమైందో తెలుసా? "

"ఏమైంది? " అతని స్వరంలో నీరసం.

"పేపర్లో ఓ ఆర్టికల్ ఇచ్చారు. చాలా మంది సిగ్గు వల్లో, అభిమానం చేతో మనసులో జరిగే ఏ కదలికల్నీ చెప్పేందుకు ఇష్టపడరు. భేషజం, అర్థం లేని బింకం... దీని వల్ల గుండెమీద స్ట్రెస్... వత్తిడి... వత్తిడి ఏర్పడి తట్టుకోలేని పరిస్థితుల్లో రక్తప్రసరణ ఆగిపోతుంది. ఎందుకు నాన్నా? కోరి మృత్యువుని కొనితెచ్చుకోవడం? "

మహేంద్ర రెప్పవేయకుండా కూతుర్ని చూస్తూ ఆ పిల్ల చెప్పే మాటల్ని శ్రద్ధగా వింటున్నాడు. అంతవరకూ నిశ్శబ్దంగా గమనిస్తున్న మనోహరం తండ్రి పక్కకి వచ్చి కూర్చున్నాడు. మహేంద్ర కొడుకుని చూసి సన్నగా నవ్వే ప్రయత్నం చేశాడు. భువనేశ్వరి, ఆమె వెనకాల ట్రేలో కాఫీ కప్పులతో అక్కమ్మా, ఆ వెనుక సింహాద్రీ వచ్చేశారు. వాళ్ళా ఇంట్లో పనిచేస్తారు.

సింహాద్రి దూరంగా తలుపు దగ్గర గొంతుక్కూర్చుని "బాబు గారూ! పెదబాబు గారెలా ఉన్నారేటండి" అని అడిగాడు.

"అంతా బావున్నార్రా" చెప్పాడు మహేంద్ర.

"ఓ పాలి నన్నూ, అక్కమ్మనీ తీసికెళ్తారేటండి" ఉత్సాహంగా అడుగుతున్నాడు.

మహేంద్ర దీర్ఘంగా నిట్టూర్చాడు. కాఫీ తీసుకుని చిన్నగా నవ్వాడు. ఇంట్లో సందడి తలెత్తింది. ఏళ్ళ తరబడి మాంత్రికుడి గుహ మూసుకున్నట్లు, స్తబ్దుగా ఉండిపోయిన అతని గుండె తలుపులు ఇప్పుడు తెరుచుకున్నాయి.

అక్కమ్మ వంట సిద్ధం చేసింది.

సింహాద్రి అక్కడి నుంచి వాచ్‌మెన్ దగ్గరికి వెళ్ళాడు. గేటు దగ్గరున్న వాచ్‌మెన్ 'డింగూ', లోపలికి రాలేదు. ఆ ఇంటి మూల స్తంభాలు తాత గారూ, బామ్మగారూ. మరి వాళ్ళ గురించి డింగూకి వినిపించాలిగా. అందుకే అతని దగ్గరికి వెళ్ళి విషయాలన్నీ చెబుతున్నాడు.

★ ★ ★

రాత్రి మంచం మీద వాలిపోయిన భువ

నేశ్వరి భర్త వైపు చూస్తూ "నేనో మాట అడగనా? " అని అడిగింది.

మహేంద్ర బెడ్‌లైట్ కాంతిలో భార్య అడగబోయేదేమిటో గ్రహించాడు. "చెప్పు" అన్నాడు.

"కొంత మంది పుట్టుకతోనే అదృష్టాన్ని గుప్పిట్లో పెట్టుకుని వస్తారు. కరుణాకరం బావగారు చూడండి. చప్పున అమెరికా వెళ్ళిపోయారు. అప్పడే వెళ్ళి పదేళ్ళు అయిపోయాయి. మొక్కుబడిగా ఇలా వచ్చి అలా వెళ్ళిపోతారు. అప్పట్లో ఆయన ఇంటి ధరే కోటిరూపాయలు దాటిపోయిందట. ఫామ్ హౌస్... ఫోటోల్లో చూడండి. పిల్లలూ అర విరిసిన మందారాల్లా ఎంత బావుంటారో... చీకూ చింతా లేని జీవితం. మనం కూడా వెళ్ళిపోదాం అని చెబితే మీరేమన్నారు? "

"నాకు గుర్తు లేదు భువనా! అదీ నువ్వే చెప్పు"

"అందరూ వెళ్ళిపోతే అమ్మానాన్నలని ఎవరు చూస్తారు? అని అడిగారు. మీ అక్కయ్య గిరిజ ఆర్థిక పరిస్థితి అంత బాగో లేదు కదా! తన నలుగురు పిల్లల్నీ, అత్తయ్య గారినీ మావయ్య గారినీ వాళ్ళ పేరెంట్స్‌నీ, భర్తనీ, తాత గార్నీ, బామ్మ గార్నీ ఈ యింట్లోనే ఉంచేసి తను చూసు కుంటూ ఉంటే ఎంత బావుండేది?

"నిజం నిజం... నాకు తోచనే లేదు"

"వ్యంగ్యాన్ని గ్రహించలేనంత అమాయకు రాలినేం కాదు."

"చూడు భువనా! మా అన్నయ్యకి చిన్నప్పటినుంచీ ఇంగ్లీషు పైత్యం ఎక్కువ. సారీ అది వాడి ఇష్టం. వాడు ఇక్కడ ఉన్నన్ని రోజులూ ఎంత నరకం అనుభవించాడో నీకేం తెలుసు? ఒక్కో రోజు మేడ మీద రాత్రంతా పచార్లు చేసేవాడు. ఎప్పుడు చూసినా దిక్కుమాలిన మనుషులూ, దిక్కుమాలిన దేశం అని ఆడిపోసుకునేవాడు. వాడి బాధ భరించలేక మా నాన్నగారు వాడికి పెళ్ళి చేసి పంపించేసి ఊపిరి పీల్చుకున్నారు"

"సంతోషం! ఆ పని మీరెందుకు చేయ లేదో? "

"ఛ" మహేంద్రకి కోపం వచ్చింది. "నాకు ఇష్టం లేదు. ఇప్పుడు మనకేం తక్కువైంది? వాడు అందరిలాంటివాడు కాదు. ఈ కుటుంబాన్నీ అక్కయ్యనీ చూసుకునేటం దుకు అన్నీ వదులుకున్నాడు. వాడి వాటా ఆస్తీ ఈ ఇల్లూ, ఊళ్ళో పొలాలూ అన్నీ ఇచ్చేసి సంతోషంగా వెళ్ళిపోయాడు."

"పొలాలు"... ఉక్రోషంగా అంది భువనేశ్వరి.

"ఆఁ ఆఁ పొలాలే. మా నాన్నకంటే, మా అమ్మకంటే నాకు అవేవీ ముఖ్యం కావు. తెలిసిందా అయినా గతం తవ్వుకోవడం దేనికీ? "

"అచ్చా! మీరింత ఘనంగా చెబుతూంటే తెలియక పోవడం ఏవిఁటి? చెప్పండి"

"భువనా! కొద్దిసేపు కళ్ళు మూసుకుని ఆలోచించు. ఇప్పుడు మన చుట్టూ తిరుగుతూ మనల్ని నవ్వించాలనీ, సుఖపెట్టాలనీ తెగ తాపత్రయ పడిపోతున్నారు మన పిల్లలు. వీళ్ళే రేప్పొద్దున తమ తమ సంసార చక్రబంధంలో ఇరుక్కుపోతే మనల్ని భరించలేరు. ఏదోవిధంగా తప్పించుకోవాలని చూస్తారు. కాదూ కూడదూ అనుకుంటే డబ్బుని లెక్కజేయరు. మంచి నీళ్ళ ప్రాయంగా ఖర్చు పెడతారు. మన బాధ్యతల్ని నెత్తిన వేసుకోరు. తప్పించుకుంటారు."

"అలా ఎన్నటికీ జరగదు"

"మా బామ్మా తాతగారూ కూడా అలాగే అనుకుని వుంటారు. చివరికి ఏమైంది? "

"మీరీ విషయాన్ని పదే పదే చెబుతూంటే నాకు పిచ్చెక్కుతుంది. చివరికి నన్ను పిచ్చా

**ఓర్పు అనునది స్త్రీలకు గానీ పురుషులకు గానీ భూషణము**

**– రామాయణము**

సుపత్రిలో చేర్చేసేట్లున్నారు."

మహేంద్ర నిశ్శబ్దంగా ఉండి పోయాడు. కొంతమంది తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళంటారు. వాళ్ళని మార్చలేం. కాలమే దీనికి జవాబుదారి. అతను చప్పున దుప్పటి మొహం మీదకి లాక్కున్నాడు. భువనేశ్వరి అటుతిరిగి పడుకుంది. ఈ మనస్తాపం ఇంకా ఎన్నాళ్ళో అర్థం కాలేదు.

తనూ ఆలోచించగలదు. కానీ ఆలోచిం చదు.

తనకి తన పిల్లలూ, భర్తా, సంసారం ముఖ్యం. ఎన్నాళ్ళీ కంచి గరుడ సేవ చేస్తూ బతకడం? కన్న కొడుకులూ కోడళ్ళే కొట్టు కుపోయారు. ఎక్కడో మనవడూ ఆయన భార్యా. పక్కకీ, పొట్టకీ బోల్డు దూరం.

ఇప్పుడు వాళ్ళకేం తక్కువైందనీ?

డాక్టరు అందుబాటులో ఉంటాడు.

వేళకి తిండీతీర్థం సిద్ధంగా వుంటాయి.

కాలక్షేపానికి తోటివాళ్ళూ, తమ వయసు వాళ్ళూ వుండనే వున్నారు. ఓ పెద్ద కుటుం బంలో సభ్యుల్లా కబుర్లు చెప్పుకుంటూ భోజ నాలూ, ఫలహారాలూ చేసుకోవచ్చు. ఎవరి గదుల్లో వాళ్ళు మంచీ చెడూ, కష్టం సుఖం చెప్పుకోవచ్చు. స్వంత ఇంట్లో కూడా అన్ని రాజభోగాలు వుండవు.

పైగా ప్రతీ గదిలో టీవీ, టూఇన్‌వన్, చదరంగం, పేకా, పచ్చీసు ఉన్నాయి. వాటితో టైము తెలీదు. సెంట్రల్ హాలు పక్కన లైబ్రరీ వుంది. చిన్న పిల్లల పుస్త కాలు బాలమిత్రా, పాపాయీ, చందమామ దగ్గర్నుంచి పోతన భాగవతం, వాల్మీకి రామాయణం, వ్యాసభారతం వరకూ ఎన్ని లేవు?

అయినా మనిషి ఆశకు అంతు వుండాలి. ఇన్ని సదుపాయాల మధ్య స్వర్గ సుఖాలు అనుభవించకుండా ఎందుకిలా చంపుకు తింటారో అర్థం కాలేదు భువనకి.

ఆ వాతావరణంలోంచి బయటికి రాలేని దానిలా కుతకుతా ఉడికి పోతోంది. అసహ నంగా కదులుతుంటే మంచం కర్రూ కర్రూ మంటూ శబ్దం చేస్తోంది.

మహేంద్రకి నిద్ర పట్టలేదు. తండ్రీ తల్లీ గుర్తువచ్చారు. ఈ ఇల్లు ఎంత బావుండేది? తండ్రి నడుస్తూంటే రాచఠీవీ కనిపించేది. తన తండ్రి దాచిన రూపాయిని వంద చేశాడు ఆయన.

ఆ ఇంట్లో మనుషుల్ని హఠాత్తుగా చూసి నవాళ్ళు ఆశ్చర్యంతో అవాక్కయేవాళ్ళు. అత్తాకోడళ్ళు తల్లీపిల్లల్లా ఉండేవారు. ఈ ప్రపంచం ఎటువైపు వెళ్ళిపోతోందో మహేం ద్రకి అంతు చిక్కలేదు. మానవ సంబంధాలూ, నైతిక విలువలూ ఏ ప్రవా హంలో కొట్టుకుపోతున్నాయో కూడా అర్థం కావడం లేదు.

"మమ్మల్నీ తీసుకువెళ్ళండిరా. ప్లీజ్"

మహేంద్ర తట్టుకోలేక పోయాడు. తిర ణాల్లో తప్పిపోయిన పిల్లలు కనిపించిన ప్రతివాళ్ళ మొహాల్లోకి చూస్తూ ఏడుస్తారే అలా కనిపించారు బామ్మా, తాత గారూ. అంత పెద్ద వాళ్ళయిపోవడం వాళ్ళు చేసు కున్న పాపమో లేదా తను మూటకట్టుకుం టున్న శాపఫలితమో తెలియడం లేదు. గుండె చప్పుడు చెవుల్లోకి వినిపిస్తోంది.

బామ్మ నోట్లో 'రాముడు' తప్ప మరెవరూ ఉండరు. ఆ రాముడే వాళ్ళనీ, తననీ పరి వారాన్నీ కాపాడాలి అనుకున్నాడు. దూరంగా ఠాణాలో పన్నెండు గంటలు కొట్టడం అతనికి నిద్రమత్తులో తెలియలేదు.

★ ★ ★

పరుగో... పరుగు...

సుమారు డెబ్బై అయిదూ ఎనభైఏళ్ళ ఆపెద్దాయన చీకట్లో పరిగెడుతున్నాడు. వెనక్కి తిరిగి చూస్తే ముందు అసలు కని పించదు. ఇటూ, అటూ, వెనక్కి చూడడం లేదాయన.

పిడికిళ్ళు బిగించి, పళ్ళు గిట్టగరచి శరీ రంలో ఉన్న శక్తినంతా తలనుంచి పాదం వరకూ సర్దేసి పరిగెడుతున్నాడు. ఆయన

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ జగమెరిగిన విద్వత్కవి. నిత్య సాహితీ కృషీవలుడు. తెలుగులో తొలి జ్ఞానపీఠ అవార్డు గ్రహీత. సాహిత్యానికి సంబంధించి ఆయన అన్ని ప్రక్రియలలోనూ ఆరితేరిన ఉద్దండుడు. మాటకొంచెం పెళుసైనా మహాచమత్కారి. అనేక సందర్భాలలో ఆయన వెల్లిన చతురోక్తులలో ఇవి కొన్ని..



ఉఛ్వాసనిశ్వాసాలు ఆ చీకటి రాత్రిలో కాడెద్దులు బుసలు కొడుతున్నట్లు వినిపిస్తోంది.

వెనక నుంచి తరుముకు వస్తున్నారు. ఒకరో, ఇద్దరో, ముగ్గురో ఇదమిత్థంగా తెలియడం లేదు. పరిగెడుతుంటే బూట్లూ చెప్పులూ కలిసినట్లుంది. ఎండుటాకులు పాదాల కిందపడి పరపరమంటున్నాయి. పరిగెత్తుతున్న పెద్దాయన చీకట్లోకి బలవంతంగా చూస్తున్నాడు. అక్కడేమీ కనిపించడం లేదు. ఆ దారి పగటిపూట సందడిగా, జనసంచారంతో కళకళలాడుతూంటుంది. తెలిసిన దారే అయినా ఏమాత్రం పొరబాటు జరిగినా దిగుడుబావిలో పడిపోవలసిందే. ఆయాసాన్నీ వయసునీ లెక్కచేయని ఆయన కొద్దిగా పక్కకి జరిగాడు. అడుగుల చప్పుడు ఆగిపోయింది.

తన అడుగుల్లో అడుగులు వేసుకుని వస్తున్నారు. తను ఆగిపోతే వాళ్ళూ ఆగిపోతున్నారు. ఇలా పదిహేను నిమిషాలు పరిగెత్తగలిగితే స్టేషన్ వస్తుంది. ఏదో ఓ రైల్లో ఎక్కేస్తే బతికిపోయినట్లే...

అరగంట నుంచీ పరిగెడుతూనే ఉన్నాడు.

## పక్షులు.. వేటగాడు



ఒకానొక సారస్వత గోష్ఠిలో దువ్వూరి రామిరెడ్డి, గుర్రం జాషువా ఓ పక్కగా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. అదేసమయంలో అటుగా వచ్చిన విశ్వనాథ 'పక్షులు రెండూ ఒకచోట చేరినట్లున్నాయే..' అన్నారు తనదైన శైలిలో.

రామిరెడ్డి, జాషువాలిద్దరికీ 'కవికోకిల' బిరుదులు ఉండడమే విశ్వనాథ వారిని పక్షులనడానికి కారణం. వెంటనే జాషువా తడుముకోకుండా 'ఈ వేటగాడి కన్ను మామీద పడిందేమిటో ఖర్మ' అన్నారు మాటకు మాట బదులిస్తూ.

రామాయణం రాసినకవి వాల్మీకి.. ఆయన ఒకప్పుడు వేటగాడు. విశ్వనాథ కూడా శ్రీమద్రామాయణ కల్పవృక్షం రాశారు గనుక ఆయనను వాల్మీకితో పోల్చినట్లే పోల్చి వేటగాడని ఎత్తిపొడవడం జాషువా చమత్కారం.

నిజమే మీలాంటి పక్షులకు నేను బోయవాడినే అంటూ విశ్వనాథ ముసిముసిగా నవ్వుతూ అక్కడి నుంచి నిష్క్రమించారు.

గ్లాస్కోపంచా, ఆపారం (పొట్టీ, పొడుగూ కాని షర్టు. షర్టు చేతులు దాదాపు మోచేతి వరకు ఉంటాయి.) వేసుకుని పరుగుపెట్టడం వల్ల ధారాపాతంగా చెమట్లు పడుతున్నాయి. ఆయన వేసుకున్న బట్టలు తడిసి ముద్దైపోయాయి. ఈ అరగంటలో రెండు మూడు చోట్ల 'ఔటుకి' వెళ్ళాలని ప్రయత్నం చేశాడు. అవతల తరుముకు వచ్చేవాళ్ళ చేతుల్లో టార్చ్‌లైటు వెలుగుతోంది. ఓ క్షణాన అయితే పట్టుకునేంత దగ్గరల్లోకి వచ్చేశారు.

హడలి పోయాడాయన. రెండు చేతుల్తో మట్టి తీసుకుని బలంగా విసిరేశాడు. ఎంత మంది ఉన్నారోగానీ గట్టిగా కేకలు పెడుతూ బూతులు తిడుతున్నారు.

"ఒకటి రామ్ రెండూ రాం, మూడూ రాం... భాగో", తనకితనే కవాతు చెప్పుకుని పరిగెత్తాడు.

గాలి దుమారంలా, సుడిగాలిలా, పంచకళ్యాణి గుర్రంలా దూసుకుపోతున్న తూటాలా పరిగెత్తాడు. అడుగుల చప్పుడు దూరం అవుతోంది. ఇటూ అటూ చూడలేదు. మరో ఆలోచనే లేనట్లు పరిగెడుతున్నరైల్లోకి ఎక్కేశాడు. ప్లాట్‌ఫామ్ వదిలిన రైలు ముందు వయ్యారాలు పోయింది. స్టేషన్ చివరికి రాగానే గొంతు సవరించుకున్న యోధుడిలా గట్టిగా అరిచింది. ఆపైన వేగం పుంజుకుంది.

ఒక్కసారి దబ్బున పడ్డ శబ్దానికి కంపార్ట్‌మెంట్‌లో వాళ్ళు ఉలిక్కిపడ్డారు. ఏదో మూట అనుకున్న వాళ్లంతా మరోసారి కుతూహలంగా చూసే సరికి కదులుతున్న పెద్దాయన కనిపించాడు.

అందరూ కట్టకట్టుకుని ఈ ప్రపంచంలోకి వచ్చినట్లు ఒకరి తరవాత మరొకరు ఆయన్ని తూర్పారపట్టడం మొదలు పెట్టారు. "అసలు బతుకు మీద ఆశ ఉండే ఈ పని చేశావుటయ్యా"

"ఇంత చీకట్లో ఈ వయసులో పరిగెత్తి ఎక్కేయడమేనా"

"కొంచెం జారిపడితే పట్టాలకీ రైలు చక్రాలకీ మధ్య పడి పచ్చడైపోయేవాడివి"

"బుద్ధుందయ్యా నీకు, ఇంట్లో వాళ్ళకైనా జ్ఞానం ఉండొద్దూ, రైలు వేళ అయిపోయే వరకూ ఇంట్లోనే ఉండకపోతే ముందొచ్చి ఏడవచ్చుగా"

"ఇంతకీ టికెట్ ఉందా"

"పెద్దాయనకి టికెట్ అఖ్ఖర్లేదనుకుంటా"

"మీరిలా కూర్చోండి తాతగారూ"

తీయని ఆ గొంతు వినిపించిన వైపుకి అందరూ తిరిగారు. పెద్దాయన చప్పునలేచి ఆ పిల్లదగ్గరికి వచ్చేసి రెండు చేతుల్నీ గట్టిగా పట్టుకున్నాడు.

"ఇపుడూ... ఇప్పుడు హాయిగా ఉందమ్మా. ఎంత బావుందో? "

తిట్టేవాళ్ళు తిడుతూనే ఉన్నారు. ఇంతకు ముందు ఆ తిట్లు వినలేక తలదించుకున్నాడాయన. ఇప్పుడసలు లెక్కచేయడం లేదు. ఆ అమ్మాయి ఆయన్నీ కిటికీకి దగ్గరగా కూర్చోబెట్టింది. క్రమంగా ఎవరిసీట్లోకి వాళ్ళు సర్దుకున్నారు.

ఆ అమ్మాయి కొంచెం ముందుకు జరిగి బెర్త్‌కి పక్కగా పైన వేలాడుతున్న బాగ్ తీసుకుంది. తనూ ఆయన ఎదురుగా ఉన్న సీట్లో కిటికీపక్కనే కూర్చుంది. చల్లనిగాలి మెల్లగా వీస్తోంది.

"నా పేరు మిత్రవింద, మీరు..." అని కొంచెం ఆగి చేతిని ఆయన వైపు తిప్పి "ఇంతక్రితం మీరు మిలట్రీలో పనిచేశారా? " అని అడిగింది.

ఆయన బుర్రవూపి "సరిగ్గా ఊహించావమ్మా. నేను ఎక్స్‌సర్వీస్‌మన్‌ని, ఇంతకీ ఈ రైలు ఎటు వెళ్తుందమ్మా? " అని అడిగారు.

మిత్రవింద నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావు? "

"సారీ! మన తెలుగు ఎన్ని అర్థాలిస్తుందో ఆలోచిస్తే నవ్వు వచ్చింది సర్"

"ఓ! " నవ్వి "రైలు ఎటు వెళ్ళదు. ఈ

రైలు ఎక్కితే ఎక్కడికి వెళ్ళొచ్చు? "అంతేనా? " అని అడిగారు.

"ఎగ్జాక్ట్లీ. ఇంతకీ మీరెటు వెళ్ళాలి? "

ఆయన గంభీరంగా ఉండిపోయారు.

మిత్రవింద ప్లేటు తీసుకుని అందులో నాలుగు ఇడ్లీలు, చట్నీ వేసి "ఇందండి" అంది ఆయన చేతికి అందిస్తూ.

ఆయనేమీ మొహమాట పడలేదు. ఆకలికి గబగబా తినేస్తున్నాడు.

"మీ పేరు చెప్పలేదు? "

ఆపకుండా తింటున్న ఆయన్ని చూస్తే చాలారోజుల్నుంచి తిండికి మొహం వాచిన వాడిలా కనిపిస్తున్నారు. మిత్రవింద మరోనాలుగు ఇడ్లీలూ, చట్నీ ఆయన ప్లేటులో వేసింది. ఆయన నిశ్శబ్దంగా తిని ఆమె అందించిన వాటర్ బాటిల్ తీసుకుని తాగేసి కిందపెట్టి తృప్తిగా తేన్చి "మా అమ్మవిగా" అన్నాడు కృతజ్ఞతగా.

అందుకు చిన్నగా నవ్వి "పడుకుంటారా సర్" అని అడిగింది.

ఆయన బుర్ర అడ్డంగా తిప్పి "అప్పుడేనా" అని సర్దుకుని కూర్చున్నారు. మిత్రవింద మిగిలిన ఇడ్లీలవైపు చూసింది. నాలుగే వున్నాయి. వాటిని తినేసి మంచినీళ్ళు తాగి సరిగా కూర్చుంది.

"ఇంతకీ ఎక్కణ్ణించి పారిపోయి వస్తున్నారు? "

హఠాత్తుగా విసిరిన రాయి మొహానికి తగిలినట్లు ఉలిక్కిపడ్డారు. కోలుకోవడానికి కొంచెం టైమ్ పట్టింది. కిటికీలోంచి బయటికి చూస్తూంటే ఎంతో ఆనందంగా వుంది. రాత్రి భోజనాలు చేసి ఎవరిదారిన వాళ్ళు పడుకున్నారు. లైట్లన్నీ ఆఫ్‌చేసి బెడ్‌లైట్లు వేశారు. అలాంటి మసకచీకట్లో ఈ పిల్ల ఎలా కనిపెట్టేసిందో? అర్థం కాలేదాయనకి.

"మిమ్మల్నే" రెట్టించింది.

"వేళాకోళం చేస్తున్నావామ్మా. అవును నేను పారిపోయి వచ్చేశాను. గేటుదాటి వాచ్‌మన్ కళ్ళుకప్పి పరిగెత్తి వచ్చాను"

"జైలేతే కాదుగదా!"

"ఇవన్నీ నీకు అవసరమా? "

"అవునండి, మనిషి జన్మ ఎత్తినందుకు ప్రజలకి ఉపయోగపడే పనులు చేస్తే మంచిదని? "

"నువ్వేం చేయగలవు? "

"నా మనసుకి నచ్చిన పనిచేయగలను"

"నన్నుచూసి అసహ్యించుకోవద్దు"

"మిమ్మల్ని చూసినప్పుడే నాకు అర్థం అయిపోయింది"

ఆయన నిశ్శబ్దంగా ఉండిపోయారు.

మిత్రవింద లేచి సూట్‌కేస్ తెరిచి అందులోంచి శాలువ తీసి ఆయన భుజాల మీద వేసి "చలేస్తోంది. కప్పుకోండి. మీకు నిద్ర వచ్చినప్పుడే పడుకుందురుగాని. మీ పేరు చెబితే ఆనక టికెట్ కలెక్టరు వస్తే ఎందుకైనా పనికి వస్తుంది" నెమ్మదిగా అంది.

"ఇన్ని విషయాలు నీ ఒక్కదానికే అవసరం అయ్యాయామ్మా... నన్ను చూసి తిట్టినవాళ్ళంతా ఎవరి దుప్పట్లలో వాళ్ళు వొదిగిపోయారు. అసలు నువ్వు ఎవరూ? నేను ఎవరూ? ఇక్కడ ఇలా చిక్కుకుపోయామేమిటి? నా పేరా అంత గొప్ప పేరేమీ కాదు. నిన్ను ఇబ్బంది పెట్టడం దేనికి గానీ నాపేరు అవధాని."

"మీకు డబ్బు గురించి బెంగలేదు. మీ మొహంలో చెప్పలేని ఆందోళన కనిపిస్తోంది. మిలట్రీలో మీరు పెద్దపోస్ట్‌లోనే ఉండేవారు. అసంతృప్తి, నిస్సహాయతా వీటి వల్ల మీరు డిప్రెషన్‌లో ఉన్నారు. మీరున్న పరిస్థితి చెప్పనా"

తలతిప్పి ఆ మసక వెలుతురులో ఆశ్చర్యంగా ఆ అమ్మాయి కళ్ళల్లోకి చూశారు.

మిత్రవింద నవ్వి "నా కళ్ళల్లో ఏమీలేదు. మీ కదలికల్లోనే అన్నీ కనిపిస్తున్నాయి.

**ప్రపంచంలో మార్పు తప్ప సుస్థిరమయినది ఏదీలేదు**

**– ఒక సామెత**

ఫేస్ రీడింగ్ వచ్చు నాకు. నేను సైకాలజీలో పి. హెచ్. డీ చేశాను. ఊళ్ళు తిరగడం నా హాబీ. మనుషుల్ని చదవడం ఇష్టం. పెద్దవాళ్ళకి ఏది ఇష్టమో అది చేయాలన్న ఆరాటం నాది. ఏదో... ఏదో చేసేయాలని తపన" అంది.

అవధాని గారి మొహం నిండా వెన్నెల పరుచుకోవడం స్పష్టంగా కనిపిస్తోంది. "ఇలా కూడా ఉంటారా? " అన్నారాయన.

"ఉంటారు. మన అనుభవాలే మనకి పాఠాలు నేర్పుతాయి. పట్టించుకోని వాళ్ళు సమస్యల్ని సృష్టించుకోరు. ప్రతి విషయాన్నీ తార్కికంగా ఆలోచిస్తున్న వాళ్ళకి ఇదో సవాలే".

"ఏమ్మా మీ వాళ్ళు వొప్పుకుంటారా? "

"ఏటికి ఎదురీదడానికి ఎవరూ సపోర్టు యివ్వరు సర్! కొంత వయసు వచ్చాక మన వ్యక్తిత్వాన్ని మనమే కాపాడుకోవాలి."

మీరు భయపడుతున్నారంటే మీరేదో తప్పు చేస్తున్నారని మీక్కూడా తెలుసన్న మాట. అవునా"

చప్పున ముసుగు తీసేశారు. "నో నేను తప్పుచేయలేదు. నన్ను కాపాడు దేవుడా" అన్నాడాయన.

స్టేషన్ వచ్చేసింది.

అవధాని గారు కిటికీలోంచి బయటికి చూశారు. కాఫీ, టీలు, ఇడ్లీ, వడలూ, పుస్త కాలూ, పళ్ళూ కనిపించాయి. కూలీకూలీ అరుపులు. హిందీ, తెలుగూ, ఇంగ్లీషు భాషల్లో అనౌన్స్‌మెంట్లు వినిపించాయి. కాఫీ, టీ అలవాటున్నవాళ్ళు గాఢనిద్రలోంచి ఎవరో కుదిపి లేపినట్లు లేచి కూర్చుని వేడి వేడి టీ, కాఫీల మీద దాడి చేస్తున్నారు. అవధాని గారి ఆలోచనల వెంట పరిగెడు తున్న మిత్రవింద రెండు 'టీ'లు తీసుకుంది.

"తీసుకోండి"

ఆయన ఫార్మాలిటీస్‌ని పాటించడం లేదు.

"ఇంకో టీ తీసుకోనా"

"నీ ఇష్టం"

"నాకు చాలు"

"నాకు కావాలి"

మరో టీ అందించింది మిత్రవింద

డబ్బు ఖర్చు పెట్టేస్తే బావుండదేమో! బొత్తిగా ఆధారం కనిపించని బతుకైపో యింది. తరువాత ఎలా? తొందరపడ్డాడా? తన డబ్బు విచ్చలవిడిగా ఖర్చు పెట్టాలి. హాయిగా, సుఖంగా ఆనందంగా బతకాలి. దేశదేశాలన్నీ తిరగాలి.

తను పారిపోయి వచ్చేశాడు. అంతేగానీ ఎవరికీ అన్యాయం చేయలేదు. అపకారం తలపెట్టలేదు. కొండమీద కోతిని తీసుకువ చ్చేంత సామర్థ్యం ఉన్నా తనెందుకు అశ క్తుడై పోయాడు?



ఏడుపు వస్తోంది. ఇంత పెద్ద వయ సులో కళ్ళల్లో నీళ్ళు పెట్టుకోవడం ఏం బావుంటుంది? అసహ్యం కాదూ.

రైలు పెద్దగా కేకపెట్టింది.

"తాతగారూ! తెల్లవారుతూనే నేను నా స్టేషన్‌లో దిగిపోతాను. మరి మీ మాటే మిటి? " ఉన్నట్లుండి అడిగింది మిత్రవింద.

సమాధానం చెప్పలేదు ఆయన. తాత గారూ... దగ్గరతనం. తన బంధువా?

"రేపటి సంగతేమిటి? " రెట్టించింది.

తలతిప్పి ఆ పిల్లవైపు చూశారు. "తెలీదు"

"ఎక్కడికి వెళ్తారు? "

"తెలియదని చెప్పాను కదమ్మా"

"మీ ఇష్టం చెబితే చెప్పండి. లేకపోతే"

ఆయన మాట్లాడలేదు.

మిత్రవింద లేచి "నేను పై బెర్తు మీద పడుకుంటాను. మంచి నీళ్ళు ఆ బాటిల్‌లో ఉన్నాయి. కొంచెంసేపు నిద్రపోండి. సో గుడ్‌నైట్" అని చప్పున ఎక్కేసింది.

రైలు దూసుకుపోతోంది. మధ్యమధ్య పిల్లవాగుల పైన వంతెన మీంచి వెడు తూంటే శబ్దం విచిత్రంగా వినిపిస్తోంది. నిరంతరం విసుగూ విరామం లేకుండా ఇలా ఎందుకు వెళ్ళాలో?

అవధాని గారికి రైలు ప్రయాణం అంటే చాలా ఇష్టం. కదిలే రైల్లోంచి ప్రకృతిని చూస్తుంటే టీవీలూ, సినిమాలూ పుస్తకాలూ ఏవీ అవసరం అనిపించవు. దేవుడు ఎంత అద్భుతమైన డైరెక్టర్, ఎంత గొప్ప ఫోటోగ్రా ఫర్! ఎంత చిత్రమైన కథకుడు! అనుకు న్నారు.

ఎంతోమంది కలుస్తూ విడిపోతూ...

విడిపోతూ కలుస్తూ...

అంతుచిక్కని ఈ రహస్యాన్ని ఏ శాస్త్ర వేత్తా కనుక్కోడెందుకో?

విశాలమైన మైదానమో, బీడు భూమో తెలియడం లేదు. అంత పెద్ద చంద్రుడూ వెలుగుని ఇవ్వలేక వెలాతెలా పోతున్నాడు.

తన గురించి తనకి బాగా తెలుసు. రేపటి గురించి ఆలోచించడు. కానున్నది

కాక మానదు. తను ఇప్పుడు పంజరంలో చిలక కాదు.

హాయిగా ఆకాశంలో రెక్కలు టపటపలాడించుకుంటూ వెళ్లిపోయే స్వేచ్ఛాపక్షి.

'నిజమా!' అంతరాత్మ మూలుగుతోంది. అవధానిగారు బరువెక్కిన కనురెప్పల్ని విడదీయలేక పోయారు. కొంచెం సేపటికే గురక శబ్దం వినిపిస్తోంది. ఆ శబ్దానికి మిత్రవింద లేచి ఓసారి తొంగి చూసింది.

అవధానిగారు కిటికీకి తలని ఆన్చి విశ్రాంతిగా కాళ్లు చాపుకుని పడుకున్నాడంతే. నిద్ర సుఖం ఎరగదన్నట్లు ఆయన్ని చూస్తేనే తెలుస్తోంది.

అరగంట గడిచిందో లేదో కంపార్ట్‌మెంట్‌లో గొడవ ప్రారంభం అయింది. అంతకంతకు ఎక్కువౌతున్న ఆ గోల ఏమిటో అర్థం కాక లైట్లు వేయబోయారు.

"లైట్లు వేయద్దు. ఎక్కడి వాళ్లక్కడ నిశ్శబ్దంగా కూర్చోకపోతే ప్రాణాలుండవు."

ఎవరో లైటు వేయబోయారు.

ఠప్పుమన్న శబ్దం వినిపించింది.

ఆ చిన్న కాంతిలో రైఫిల్ తిరగేసి లైటు మీద చేయి వేయబోతున్న వ్యక్తి నెత్తిన వేయగానే వినిపించిన శబ్దం అది.

గుండు చిల్లు పడిందేమో అని తడిమి చూసుకున్నాడు దెబ్బ తిన్న వ్యక్తి.

"ఎవరి స్థలాల్లో వాళ్లు ఉండండి, అతి తెలివి చూపించారంటే బావుండదు. మీ దగ్గరున్న కాష్, బంగారం... అన్నీ అదిగో ఆ గుడ్డమీద వేయండి" కఠినంగా ఉందా స్వరం.

ఆ చీకట్లో ఎంత మంది వచ్చారో తెలుసుకోవాలని కాబోలు తలెత్తి చూడబోయాడు మరో ప్రయాణికుడు.

"ష్! మేము అన్నీ చూడగలం మాతో పెట్టుకోవద్దు. ప్రాణం తీయడం మాకు కొత్తా కాదు భయమూ కాదు. అనవసరంగా చంపడం ఇష్టం లేక"

"అయ్యో! ఇదేమిటండీ బాబూ! ఒద్దండీ అంటే విన్నారా? పౌర్ణమినాడు పులి కూడా బయటికి రాదని మీ అమ్మ చెబుతూంటే వూహూ ససేమిరా అన్నారు. భయంతో నా ప్రాణాలు పోతున్నాయి. వాళ్లు చంపేస్తున్నారేమోనండి".

"ఛ! అరవకు. నోరెత్తకు. వాళ్లు చంపినా చంపేస్తారు. వాళ్లవైపు చూడకు. గుర్తుపట్టానని తెలుస్తే తలుపు తీసి విసిరేసినా విసిరేస్తారు."

"మూణ్ణెల్ల బాలింతనని ఐదోనెల్లో వస్తానండీ అంటే వెధవ డైలాగులు కొట్టారు నీవు లేక వీణా అంటూ. ప్రేమ ప్రాణం పోయదండీ. ఇప్పుడు చూడండి. ఒక్కళ్లైనా వాళ్లని వెళ్లగొట్టాలని ప్రయత్నం చేస్తున్నారా? ఎవరికి వాళ్ళే గడగడలాడి పోతున్నారు. నా గద్వాల చీర తడిసి పోయిందండీ".

"ఛీ! నోరుముయ్యి... కాస్సేపు కళ్ళు మూసుకుని దేవుణ్ణి తలంచుకోలేవూ?"

"ఒన్ టూ, త్రీ... వేసేయండి. వన్ బై వన్ ఏక్ కే బాద్ ఏక్ జల్దీకరో. త్వరగా ఆలస్యం చేసి వెధవ్వేషాలు వేస్తే కాకుల్నీ గద్దల్నీ కాల్చేసినట్లు కాల్చేస్తాం".

"అయ్యో! భగవంతుడా".

"అయ్యో! అనకు. నోరు మూసుకోమని చెప్పానా?"

"ఊరికే విసుక్కుంటారెందుకు?"

"ఇదేమైనా టాంక్‌బండ్ మీద కబుర్లాడుకునే ప్లేస్ అనుకుంటున్నావా రుక్కూ. భయంతో నా శరీరం కూడా చల్లబడిపోతోంది. అందరూ నోటిమీద చేతులు వేసుకున్నారు. నాకు నీమీద కోపం కాదు భయం అర్థం అయిందా"

కెవ్వుమంది చంటిపాప.

ఆ కేకకి రుక్మిణి కూడా కేక పెట్టింది.

"ఇందాకటినుంచీ చూస్తున్నాం. పాపం నీకేనమ్మా ప్రాణ భయం మాకు లేదు అవునా? తియ్ నగలు"

రుక్మిణి బిక్కు బిక్కుమంటూ గాజులు

తీసి అక్కడ పరిచిన గుడ్డలో వేసింది. ఒక్కో నగే వొలిచి అందులో వేస్తూ "సాయిరాం, సాయిరాం" అంటోంది. పాప ఆగంతకుడి గుప్పెట్లో ఉంది.

ఎవరు ఏమాత్రం ఎదురు తిరిగినా ఠపీ మని కొబ్బరికాయని విసిరేసినట్లు విసిరేసే పోజులో నిలబడ్డాడతను. గొడవ మొదలైన ప్పటి నుంచీ మెలుకువ వచ్చేసింది అంద రికీ.

మొత్తం అక్కడ ఐదారుగురు యువకులు ఉన్నారు. బనీన్లూ నిక్కర్లూ వేసుకున్నారు. చాలాకాలం నుంచీ కసరత్తు చేస్తున్న వాళ్లని వాళ్ల శరీర కండరాలు చెబుతు న్నాయి.

ఆ బెడ్ లైట్ కాంతిలో వాళ్లెంత కఠినంగా ఉంటారో వాళ్ళ కళ్ళే చెబుతున్నాయి.

"సాయిరాం, సాయిరాం" రుక్మిణి ఏడు స్తోంది. శబ్దం మింగేస్తోంది. నిన్న సాయంత్రం అమ్మ తొంభై సార్లు చెప్పింది. తొలిచూలు... నీళ్ళాడి అత్తారింటికి పౌర్ణమి నాడు వెళ్లడం ఏవిటి రుక్కూ" అని.

"ఆయన వొంటరిగా ఉండలేక పోతున్నా రమ్మా... ఇంకా నయం యిరవై ఒకటినో, నెల వెళ్లగానో వెళ్ళిపోదాం అనలేదు. ఈ అమావాస్యలూ, పూర్ణిమలూ అంతా మనం పెట్టుకున్న చాదస్తం".

"పోనీ నువ్వు ఐదో నెల వరకూ ఇక్కడ ఉండాల్సింది. మీ అత్తగారూ, మామగారూ వెళ్ళి కొడుకు దగ్గర ఉంటే బావుండేదేమో".

రుక్మిణి విసుక్కుంది. "ఈ వయసులో ఆవిడేం చేయగలరు? వాళ్లకి కూడా ఈయనే చేసి పెట్టాలి".

"మరీ విచిత్రంగా మాట్లాడుతున్నావే రుక్కూ! మీ అత్తగారూ మామగారూ మా వయసు వాళ్లేకదా..."

"మీ పనీ పాటా వేరు, వాళ్ల అలవాట్లు వేరు, నీలా ఆవిడ చేయలేరమ్మా".

రుక్మిణి తల్లి తెల్లబోయింది. "ఈ మాట మీ వదిన కూడా వాళ్లమ్మతో అని ఉంటుంది."

రుక్మిణి సర్దేసుకుంది. "నేను తప్పు మాటేం అనలేదమ్మా, మా అత్తగారికి కీళ్ల వాతం. చేసుకోలేరని చెప్పానంతే".

ఆవిడ అక్కడినుంచి వెళ్లిపోయింది. బహుశా మనసు దెబ్బ తిన్నట్లుంది. రుక్మిణి తలెత్తుకోలేక పోయింది. అమ్మని బాధ పెట్టినందుకు ఇలా జరుగుతుందేమో! పెద్ద వాళ్ల పట్ల నిర్లక్ష్యంగా ప్రవర్తించడం కూడా పాపమే. తన పాప. భగవంతుడా!

కొద్ది నిమిషాల్లో నగలతో, రొక్కంతో ఆ బట్ట నిండిపోయింది. పసిపిల్లని రుక్మిణి వొళ్ళోకి జారవిడిచాడు అంతవరకూ గుప్పిట్లో పట్టుకున్నతను.

పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్లయింది రుక్మిణికి. పక్కనే కూర్చున్న నందగోపాల్ భార్య భుజం మీద మెల్లగా తట్టాడు ఓదా రుస్తున్నట్లు.

అక్కడ నిశ్శబ్దం పరుచుకుంది. రైలు వేగం తగ్గింది. స్టేషన్ వస్తే బాగుండు దేవుడా అని మొక్కుకుంటున్నారు. పై బెర్త్ మీద కూర్చున్న మిత్రవిందకి మెడ నెప్పెడు తోంది. తల తిప్పుకోలేక పోవడం వల్ల చాలా సేపటినుంచి ఒకే డైరెక్షన్‌లో కూర్చుంది.

తన దగ్గరున్న నగలు కూడా గుడ్డ మీద పడేస్తూ మిత్రవింద తిట్టుకుంది. ఆదర్శాలు ఆకాశం మీదా, చేతలు పాతాళంలోకీ ఛ! ఏం బ్రతుకు?

వాళ్ల చేతుల్లో ఆయుధాలున్నాయి. కరు కుతనం ఉంది. జీవితం మీద ప్రేమా, మమకారం లాంటివేవీ కనిపించడం లేదు. ఏమాత్రం ఎదురు తిరిగినా నిర్దాక్షిణ్యంగా కాల్చి పడేస్తారని స్పష్టం అవుతోంది.

అప్పుడు చూశాడు రైఫిల్‌తో గందరగో

ఏ మతవర్గము వారయినను సరే ధనవంతులను పూజింపనారంభింతురేని వారి పతనము ఆనాడు ఆరంభమయినట్లే. – స్వామి వివేకానంద

శాన్ని అదుపులో పెట్టిన లీడర్ లాంటి వ్యక్తి. రెప్పపాటులో ఎగిరి మిత్రవింద పక్కనే కూర్చుని ఆమె వేసుకున్న చుడీదార్‌ని పర్రుమని లాగేశాడు. మధ్యకి నిలువునా చిరిగిపోయిన భాగంలో బ్రా కనిపిస్తోంది. మిత్రవింద రెండు చేతుల్నీ ఛాతీకి అడ్డు పెట్టుకుంది.

సిగ్గూ, లజ్జా, ఉక్రోషం, నిస్సహాయత యిన్ని భావాలు మిత్రవిందని మొహం ఎత్తుకోలేకుండా చేశాయి. నల్లని దృఢకాయుడు అతను. అతని కళ్ళు ఎర్రగా చింత నిప్పుల్లా ఉన్నాయి. ఆకలితో ఉన్న క్రూర మృగంలా ఉన్నాడు. రైలు మళ్ళీ వేగాన్ని పుంజుకుంది. అసలు కనుచూపు మేరలో ఎక్కడా స్టేషన్ దాఖలాలు లేవు. ఆ ఏరియాలో ఎటువంటి అవకాశాలు ఉంటాయో వాళ్ళకి తెలిసినట్లుంది. అందుకే అంత తీరికగా, సావకాశంతో దోచుకునేందుకు సిద్ధం అయ్యారు.

ప్రయాణికులు తల దించుకున్నారు.

డబ్బు పోతే సంపాదించుకోవచ్చు.

భయంకరం అయిన మనిషి చేతిలో ఆ పిల్ల అన్యాయం అయిపోతోంది. తమలో ఎవరూ ఎదుర్కోలేరు. పిరికివాళ్ళు. ప్రాణం మీదతీపితో అంగుళం కూడా కదల్లేదు. ఏం జరుగుతోందో మెల్లగా తలెత్తి చూడాలన్న కుతూహలం. ఎక్కడో మనసులోపలి పొరల్లో ఏదో అయిపోతే బావుంటుందేమో అన్న శాడిజం.

దొంగచూపులు.

దేవుణ్ణి నమ్మినవారి గుండెల్లో భయం.

కొందరు కళ్ళు గట్టిగా మూసుకున్నారు.

ప్రయాణికులు ఊపిరి బిగపట్టుకుని శ్వాస కూడా గట్టిగా రానీయడం లేదు.

మిత్రవింద పెనుగులాడుతోంది.

మిగిలిన యువకులు బంగారాన్నీ, డబ్బునీ లెక్క పెట్టుకుంటున్నారు. అక్కడ కూడా చివరి క్షణం వరకూ పోరాడే మన స్తత్వం... పైనున్న వ్యక్తి గురించి అంతగా ఆలోచించనీయడం లేదు.

ఆ వ్యక్తి మిత్రవింద మొహాన్ని రెండు చేతుల్తో దగ్గరకు తీసుకుని ఆమె పెదాల్ని బలంగా కొరికాడు. ఆ పిల్ల కెవ్వుమంది. నీరసంతో అతని చేతుల్లో నలిగిపోతోంది.

అవధాని గారు ఆ పిల్ల కేకకి స్ప్రింగ్‌లా లేచి నిటారుగా అయారు. దెబ్బతిన్న పులిలా ఆ మనిషి మీద పడీపడడంతో బాటు రైఫిల్‌ని చేతిలోకి తీసుకున్నాడు.

అతను ఎక్స్ సర్వీస్‌మెన్.

మేరా భారత్ మహాన్.

ఆ వ్యక్తిని చిత్తుగా తన్నుతున్నారు.

చాకచక్యంతో తనని తాను కాపాడుకుంటూ శత్రువుని కాలి కింద నల్లిలా నలిపేసే సత్తా వున్న మనిషి. దేశం కోసమే ప్రాణాలు పణంగా పెట్టిన ఈ మహోన్నత వ్యక్తి ముందు కరడు కట్టిన కాఠిన్యం కూడా నీరుకారిపోతోంది.

"మగాళ్ళు లేవండి. తన్నండి, చంపండి. మన ఆడపిల్లని రక్షించండి. కాపాడండి. మన తల్లిని బతికి వుండగానే తలదించుకునేట్లు చేయకండి" అని అరిచాడు.

ఒకళ్ళూ ముందుకు రాలేదు.

వయసు నిండిన ఆయన పిచ్చిబలంతో పోట్లాడుతున్నాడు. 'సిగ్గుల్లేవురా?' అని తిట్టేశాడు.

ఉవ్వెత్తున ఎగిసిన కెరటంలా లేచారు. ప్రవాహంలా వాళ్ళమీద పడిపోయారు. ఒకళ్ళ మీద ఒకళ్ళు కింద వున్నవాళ్ళని మట్టికరిపిస్తున్నారు. కంపార్ట్‌మెంట్ మొత్తం కదిలివచ్చింది.

స్టేషనూ వచ్చేసింది.

అవధాని గారు పేల్చిన తూటా కామాంధుడి పిక్కలోంచి వెళ్ళిపోయింది. కింద పడిన వాళ్ళకి ఊపిరాడడం లేదు.

అందిన చోట దొరకపుచ్చుకుని చితకబాదుతున్నారు. రైలు వేగం తగ్గింది. ఎవరో చెయిన్ లాగేశారు.

అవధాని గారు మిత్రవిందతో కలిసి ఆ



## రంభతో క్రీడ



ఓ రోజున పొరుగూర్లో ఉన్న తెలిసిన మిత్రుడింటికి వెళ్లారు విశ్వనాథ. అదే సమయంలో ఆ మిత్రుడి కొడుకు వాకిట్లో ఉన్న అరటి చెట్టుతో ఆడుకుంటూ కన్పించాడు.

వెంటనే ఆయన లోనికి వెళ్లి తనమిత్రుడితో, 'ఏమిటోయ్ మీవాడు రంభతో క్రీడిస్తున్నాడు?' అన్నారు సరదాగా.

క్రీడించడం అంటే సరససల్లాపాలు అని అర్థం.. అదీ రంభతో. దాంతో తెల్లబోతున్న మిత్రుడిని బయటకు తీసుకువచ్చి 'నిజమో కాదో కావాలంటే నువ్వేచూడు' అంటూ ఆ పసివాడిని అతనికి చూపారు కొంటెగా.

అరటి చెట్టును రంభ అనడాన్ని దృష్టిలో పెట్టుకుని ఆయన ఇలా చమత్కరించారని గ్రహించి మిత్రుడు పగలబడినవ్వాడు.

కంపార్ట్‌మెంటులో నుండి బయటికి దిగేశారు.

అందరూ ఏకమై దుండగుల్ని పోలీసులకి అప్పగించారు. మిత్రవింద కోసం చూశారు. ఆ అమ్మాయి తాలూకు వస్తువులుగానీ, జాడగానీ తెలియలేదు.

అప్పుడే తెలతెలవారుతోంది.

రైల్వే పోలీసులు దోపిడీ ముఠాని పట్టుకున్నారు.

దుప్పటిలో దాచిన బంగారం, డబ్బూ పోలీసులు భద్రపరిచారు. అప్పటికప్పుడు పంపకాలు చేయడం మాటలు కాదు.

ఇంటికి వెళ్ళి పోవాలన్న తొందరలో కొంతమందీ, ప్రాప్తం ఉంటే వస్తుందీ, లేకపోతే లేదని మరి కొందరూ, అసలీ వాతావరణానికే దూరంగా పారిపోవాలనే ప్రయత్నంలో ఉన్న వాళ్ళూ తమతమ అడ్రసులూ, పోగొట్టుకున్న వస్తువులూ, వాటి వివరాలు రాసి రైల్వే పోలీస్‌లకి ఇచ్చేసి ఇంటి దారి పట్టారు.

★ ★ ★

బాత్‌రూమ్‌లోకి . వెళ్ళాలని బయలుదేరిన రాజ్యలక్ష్మి గారికి కాళ్ళూ చేతులూ ఆడడం లేదు. అడుగు ముందుకు పడలేదు. అసలు బాత్‌రూంలోకి వెళ్ళాల్సిన దారి ఇటేనా? ఉన్నట్లుండి పవర్ సప్లై పోయింది. ముందుకు వెళ్ళలేకా, వెనక్కి రాలేకా ఇలా చీకట్లో చిక్కుకుపోయిందేమిటి?

"ఏమండీ... ఏవండీ... యిలా వస్తారా?"

'....'

"పలకరేవిటండీ. నిద్రపోతున్నారా? దొంగ నిద్ర నటిస్తున్నారా? అయ్యబాబోయ్ కాలు మీంచి ఏదో పాకుతోంది. దేవుడా... ఇలా రండీ..."

"అమ్మాయ్ గీతా! ఓసారి అగ్గిపెట్టే, కొవ్వొత్తీ తీసుకురా ఒక్కళ్ళూ వినిపించుకోరేమిటండీ. నా గొంతు తడారిపోతోంది.

ఒరేయ్ భాస్కరం ఎక్కడున్నావు? బాత్‌రూమ్‌లోకి అర్జంటుగా వెళ్లాలి. చీకట్లో ఏమీ కనిపించడంలేదంటే ఎవరూ వినిపించుకోరేం? భయం వేస్తోందిరా!"

"ఏమండీ మీరైనా రండీ" ఆవిడ గుండె

కొట్టుకుంటూ భయంతో వెర్రికేకలు పెడు తోంది. ఆవిడ గదిలోకి ఇద్దరు నర్సులు పరి గెత్తుకుంటూ వెళ్లారు.

"అమ్మా! ఏమైందమ్మా కలగన్నట్లున్నావు. లేమ్మా! నిద్రలోంచిలే. మేమంతా నీ పక్కనే వున్నాం. భయంలేదు ఏడవకూడదు. అరవ కూడదు. చూడమ్మా ఈ గదిలో ఎంత పెద్ద ట్యూబ్‌లైట్ వెలుగుతోందో! వెలుతురు పట్ట పగల్లా లేదూ... మంచినీళ్లు కావాలామ్మా" సిస్టర్ దేవమ్మ అడిగింది.

రాజ్యలక్ష్మి చుట్టూ చూసింది. తను ఇంకా ఏడుస్తోంది... కలగన్నట్టుంది. తలు చుకుంటేనే గుండె ఆగిపోయేట్లుంది. ఒళ్లంతా చెమట్లు పట్టాయి. తను చీకట్లోనే ఉంది ఇప్పటివరకూ. ఒకళ్లూ రాలేదు. ఎంత భయపడుతోంది?



ఒక్కోసారి ఈ కలలు తుదీ మొదలూ లేనట్లు కథలు కథల్లా రాత్రంతా వస్తూనే ఉంటాయి. తను కూడా వాటిని చూసేసి భయపడిపోతోంది.

'ష్', దీర్ఘంగా నిట్టూర్చి చీరకొంగుతో మొహం, చేతులూ, మెడా తుడుచు కుంది. ఈమధ్య ఎక్కువగా ఇలాంటి కలలే కంటోంది. బాత్‌రూమ్‌లోకి వెళ్లినట్లు కల రాగానే మంచం తడిపేస్తోంది.

"అమ్మా! కొంచెం పాలు తాగుతారా" అని అడిగింది దేవమ్మ. ఆమె సీనియర్ నర్స్. శ్రద్ధా, ఓర్పూ ఎక్కువ.

"ఏం తాగినా రాత్రంతా బాత్‌రూమ్‌కి వెళ్లాల్సి వస్తోంది. ఖర్మ, ఖర్మ" నుదురు కొట్టుకుంది.

దేవమ్మ ఆవిడ చేతులు పట్టుకుంది. "తప్పు అలా నెత్తి కొట్టుకోకూడదు. మీకు మేమంతా లేమూ. పడుకుంటే నిద్రవ స్తుంది. పడుకోమ్మా!"

"నిద్రరాదు. వస్తే కలలు కలవరపెడ తాయి. వీళ్లంతా ఏరీ? "

"ఎవరమ్మా" దేవమ్మకి తెలుసు. అయినా అడుగుతుంది. ఇది రొటీన్ కార్యక్రమం. ఆవిడతో పది నిమిషాలు మాట్లాడితే విశ్రాం తిగా పడుకుంటుంది.

రాజ్యలక్ష్మి చుట్టూచూసింది. "ఎక్కడికి వెళ్లారమ్మా వీళ్లు" నుదురు చిట్లించి, కళ్లు పెద్దవిచేసి గదంతా కలియజూస్తూ "పిల్లలు" అంది.

"నిద్రపోతున్నారమ్మా" దేవమ్మ ఆవిడ భుజంమీద జాగ్రత్తగా కొట్టింది. అచ్చం చిన్నపాపని "జో" కొట్టినట్లు... ఎంత మందీ... తన ఎక్స్‌పీరియన్స్‌లో ఓ యాభై మందిని చూసి ఉంటుంది. వాళ్లకి సేవచేసే భాగ్యాన్ని 'ఏసుప్రభువు' తనకి ఇచ్చాడు. ప్రభువు కృప వల్ల తనూ పిల్లలూ భర్తా సంతోషంగానే ఉన్నారు.

తన లాంటి సిస్టర్స్‌ని ఒక విధంగా ఈ ట్రస్ట్ పోషిస్తోంది.

మంచంమీద కూర్చున్న రాజ్యలక్ష్మి ఆమె చేతిని గట్టిగా పట్టుకుంది. కళ్లు మూసుకుంటే వెళ్లిపోతుం దేమో అని భయం. తన పక్కనే తనతోనే వుండాలి. ఒకళ్లా ఇద్దరా ఇంట్లో అంతా కలిసి ఇరవైమంది ఉన్నారు. ఆఫీసులకీ, స్కూళ్లకీ, కాలేజీలకీ వెళ్లేవాళ్లు వెళ్లినా ఇంట్లో ఉండేవాళ్లతో ఎంత సందడి. క్షణం తీరిక లేని పని. గొడ్లూ, గోదా, పంటలు ఎంత హాయి? అంత గొడవలోనూ ఆయన కొంగు పట్టుకు తిరిగే పిల్లాడిలా 'రాజ్యం', 'రాజ్యం' అని ఒకటే పిలుపులు.

తను ఆయనకి నీడో, ఆయన తనకు నీడో తెలిసేది కాదు. క్షణం విడవని ఆయన ఈ మధ్య ఎక్కడికి వెడుతున్నారో? రోజులకి

రోజులు కనిపించడంలేదు. పెద్దాడు భాస్కరం తనకి నెమ్మదిగా చెప్పాడు. "నాన్నగారికి కాకినాడ ట్రాన్స్‌ఫర్ అయిందని". రోజూ వచ్చేంత దూరంలో ఉంటే రెక్కలెగరేసుకుంటూ వాలేవారు కాదూ... పాపం వేళకి తింటున్నారో లేదో, ఫిల్టర్ కాఫీ ఎవరు యిస్తున్నారో?

'ఈ దేవమ్మ ఎవరో'... భాస్కరం వచ్చినప్పుడు అడిగితే 'కేర్‌టేకర్' అనీ ఏదో చెప్పాడు. ఏమిటో బంధువుల్లో ఎవరూ ఈ పేరుగల వాళ్లు లేరు. ఆమాటే అంటే అనసూయకి మరదలు వరుస అవుతుంది అని చెప్పాడు. అయితే తనకి కూతురు వరసే...

"అమ్మా పడుకోమ్మా! నేను ఇక్కడే ఉంటాను" అంది దేవమ్మ.

ఒక్కసారి పైనుంచి ఎవరో తోసేసినట్లు, తను కిందపడి పోయినట్లూ ఈ లోకంలోకి వచ్చింది. రాత్రి బాగా పొద్దు పోయింది. ఎప్పుడు తెల్లవారుతుందో. పగలైతే బయటికి వెళ్లచ్చు. రాత్రిళ్ళే ఎంతకీ జరగవు. చీకటి భయం. నల్లగా కాటుకలా, భూతంలా కనిపిస్తుంది.

సాయంత్రం అవగానే కిటికీలకి కర్టెన్లు వేసేయమని చెబుతుంది.

"పడుకోమ్మా ప్లీజ్" దేవమ్మ బతిమాలింది.

కాళ్ళు చాపుకుని తలగడ సరిచేసుకుని కళ్ళు మూసుకుంది. దేవమ్మ ఆమెవైపే చూస్తూ అక్కడున్న కుర్చీ దగ్గరకు తెచ్చుకుని ఆమె పక్కనే కూర్చుంది. ఆవిడ చేతిని ఈసారి దేవమ్మ పట్టుకుంది. అరగంటలో ఆవిడ గురక పెట్టింది. దేవమ్మ అక్కణ్నించి వెళ్ళిపోయింది.

దేవమ్మని చూస్తూనే డ్యూటీ డాక్టర్ అడిగాడు "దేవమ్మా మీ అమ్మగారెలా ఉన్నారు? "

దేవమ్మ చిన్నగా నవ్వి "అర్ధరాత్రి నిద్రలో అరిచేస్తుంది. ఆ అరుపుకి మన గుండె ఆగిపోతుందేమో అనిపిస్తుంది. అరిచిన వెంటనే తనే ఉలిక్కిపడి లేస్తుంది. ఒళ్లంతా చెమటలతో స్నానం చేసినట్లు తడిసి ముద్దైపోతుంది. పగలు కూడా ఇలాగే జరుగుతూంటుంది" అంది.

డాక్టర్ టేబిల్ దగ్గరకి వచ్చి రివాల్వింగ్ చెయిర్‌లో కూర్చుని దీర్ఘంగా నిట్టూర్చాడు. ఆ పెద్ద ఇంట్లో ఏదో ఓ శబ్దం, గోల వినిపిస్తూనే ఉంటాయి. డాక్టర్‌కి ఈ వాతావరణం కొత్తేమీ కాదు. నీడని చూసి రోగికి మందిస్తాడు డాక్టర్ పురోహిత్. అంత మంచి పేరుంది ఆయనకి.

మనసు. అది ఎలా ఉంటుందో తెలీదు కానీ అది చేసే అలజడి మాత్రం అతనికి తెలుసు.

ప్రేమా, పగా, కోపం, శాంతం, ఉద్రేకం... ఇలా నవరసాలూ పండించే మనసు లయబద్ధంగా సాగిపోగలదు. అంతే స్థాయిలో ఎదురు తిరగగలదు. టైమ్ చూసుకున్నాడాయన. రెండుగంటలు దాటింది.

చటుక్కున నవ్వు కూడా వచ్చింది. ఈ గడియారం వెనక్కి నడిస్తే...

అలా జరగకూడదు. అలా జరుగుతున్నది రాజ్యలక్ష్మి గారి లాంటి వాళ్ల విషయంలోనే. వాళ్లని బాగుచేయాలంటే పాడైపోయిన గడియారాన్ని బాగుచేయడం లాంటిదే.

"డాక్టర్" దేవమ్మ పిలిచింది.

డాక్టర్ తలెత్తి "ఓ! ఆలోచనల్లో మునిగిపోయాను. నువ్వు వెళ్ళచ్చు" అన్నాడు. దేవమ్మ సిస్టర్స్ రూమ్‌లోకి వెళ్ళింది. రాత్రీ పగలూ తేడా లేదు. డ్యూటీలో ఉన్న సిస్టర్స్ అక్కడున్న వాళ్లని కంటికి రెప్పలా చూసుకుంటారు. ఆవైపు మానసికంగా దెబ్బతిన్న వాళ్ళే ఉంటారు. అలాగని వాళ్లు పిచ్చివాళ్లు కారు. ఆ వాతావరణంలో కాబట్టి ఉండగల్గు

**నేను ఎప్పుడు భవిష్యత్తును గురించే ఆలోచిస్తాను. నా శేషజీవితాన్ని గడపవలసింది అక్కడే కదా!** – కెట్టరింగ్

తున్నారు. అదే ఏ హాస్పిటల్‌లో అయినా ఉన్నట్లయితే ఈ ప్రపంచంతో భౌతికంగా, మానసికంగా సంబంధం లేకుండా పోయే వాళ్లు.

తెల్లవారుతూనే మొహాలు కడుక్కుని తమ తమ గదుల్లోకి వెళ్లిపోతారు. పక్కబట్టలు మడతలు పెట్టి శుభ్రం చేసి పెరట్లోకి వస్తారు. అక్కడంతా పల్లెటూరు వాతావరణం కనిపిస్తుంది. ఓవైపు గేదెలూ, ఆవులూ కట్టేసి ఉంటాయి. మరోవైపు కట్టెల పొయ్యి మీద వేణ్ణీళ్లు కాగుతూంటాయి. అరటి చెట్లు పళ్లతో బాగా ఒంగిపోయి ఉంటాయి. మామిడి కాయల సీజన్‌లో ఆకుకో'కాయో' కాయకో 'ఆకో' తెలుసుకోవడం కష్టం.

సపోటా, జామ, పనస చెట్లు పచ్చని ఆకులతో చూస్తుంటే చందనపు బొమ్మకి చీర కట్టినట్లు కనిపిస్తుంది.

రాజ్యలక్ష్మి అక్కడున్న కేన్ కుర్చీలో కూర్చుంది. ఆవిడ జ్ఞాపకాల పొరల్ని చీల్చుకుంటూ గతంలోకి వెళ్లిపోయింది ఆవిడ. పక్కనే భానుమతి కూర్చుంది. ఆమె వెనుక భవానీ శంకరంగారు పేపర్ చదువుతున్నారు.

అక్కడ దాదాపు పది పదిహేను మంది ఉండి ఉంటారు. గుంపులు గుంపులుగా చేరి మాట్లాడుకుంటున్న వాళ్లకి దగ్గరగా వెళ్తే వాళ్ళు ఎవరితోనూ మాట్లాడటంలేదనీ, ఎవరికి వాళ్ళే స్వగతంలో మునిగిపోయారనీ తెలుస్తుంది.

"అన్నపూర్ణా!"

ఆ పిలుపు విన్న అన్నపూర్ణ పరిగెత్తి వచ్చేసింది. ఎవరో ఒకళ్ళు పిలవలేదు. అందరూ ఏకం అయి ఒకే గొంతుతో ఆవిడని పలకరించారు. అన్నపూర్ణా అంటే 'అమ్మా' అన్నట్లే. ఆవిడ వెనకాల స్టీలు బకెట్ పట్టుకుని శాంతారాం హడావుడిగా వస్తున్నాడు. ఆ స్టీల్ బకెట్‌లో ఇడ్లీలున్నాయి. గిన్నెల గుత్తిలో సాంబారు, చట్నీ, కూరా ఉన్నాయి. శాంతారాం పక్కనే మరో స్టీల్ బకెట్‌తో చంటి వస్తోంది. ఓ చేతిలో కాగితం ప్లేట్లూ, బకెట్‌లో పూరీలూ కనిపిస్తున్నాయి.

అందరూ వరసగా ఉన్న కేన్ కుర్చీల్లో కూర్చున్నారు. ఒక్కో ప్లేట్‌లో రెండు ఇడ్లీలూ, రెండు పూరీలు, చట్నీ, సాంబారు వేసి వాళ్ళకి అందిస్తున్నారు.

అన్నపూర్ణ కాశీ విశాలాక్షిలా కనిపిస్తుంది. గుండ్రటి మొహం మీద నయాపైసంత ఎర్ర కుంకుమ ఆకాశంలో సూర్య బింబంలా కనిపిస్తుంది. ఎప్పుడూ నవ్వుతూంటుంది ఆమె.

కొసరి కొసరి వడ్డిస్తుంటే గోరుముద్దలు పెట్టే అమ్మ గుర్తుకు వస్తుంది.

విసుగూ విరామం లేని ఆవిడ సహనంలో భూదేవిలాంటిది. ఆవిడ ఎప్పుడు తింటుందో, ఎప్పుడు విశ్రాంతి తీసుకుంటుందో ఎవరికీ తెలియదు. ఇలాంటి వారు ఈ ప్రపంచంలో చాలా మందిలో కొంతమందే ఉంటారు. తగిలిన గాయం సముద్రం అంత లోతైనదై ఉండచ్చు. తట్టుకోలేని బాధ ఎవరెస్ట్ శిఖరాన్నే దాటినంతదైనా కావచ్చు. గుండెలో అగ్నిపర్వతాలు అనుక్షణం బద్దలై కాల్చేస్తున్నా కనిపించకపోవచ్చు. అటువంటి వ్యక్తులు 'చిరునవ్వు' అనే ఆత్మస్థైర్యాన్ని జారవిడుచుకోరు.

చల్లని వెన్నెల అన్నపూర్ణ.

టిఫినైపోగానే స్నానాలకి నీళ్ళు సిద్ధం చేస్తుంది.

"శంకరంగారూ! టిఫిన్ ఎలా ఉంది?" అని అడిగింది.

"సాక్షాత్తూ అమ్మ అన్నపూర్ణమ్మ వండి పెట్టడం, మేము తినడం మా భాగ్యం కాదండీ" అన్నారాయన.

రాజ్యలక్ష్మి ఉన్నట్లుండి "భాస్కరం, భాస్కరం" అని పిలుస్తూ హాలువైపు దారి తీసింది. ఆవిడ గుమ్మం దాటకుండానే అన్నపూర్ణ పరిగెత్తి తీసుకువచ్చింది. "రాజ్యం

ఏం కావాలమ్మా నీకు. భాస్కరం ఆఫీసుకి వెళ్లాడు. రాగానే వస్తాడు. నువ్విలా ఎడా పెడా తిరిగేస్తే కాళ్ళు నొప్పి పెడతాయి. నువ్వు బాధపడితే భాస్కరానికి ఏడుపు వస్తుంది"

"నువ్వెవరు? " ఆవిడ తలతిప్పి అన్నపూర్ణ మొహంలోకి చూసింది.

"భాస్కరం కూతుర్ని... నా పేరే రాజ్యం" అంది ఆవిడ భుజం చుట్టూ చేతులు వేసి జాగ్రత్తగా నడిపించుకువస్తూ.

రాజ్యలక్ష్మి చిత్రంగా శబ్దం చేస్తూ నవ్వింది. "ఛీ... భాస్కరం కూతురు ఇంత ఉంటుంది. ఆగు! ఉయ్యాల్లో ఏడుపు విని పించడంలేదూ... అయ్యో పిల్ల కింద పడిపోతుందో ఏమో! ఎవర్రా అక్కడ? చంటిదాన్ని ఎత్తుకోండి"

"సరే! సరే!" అంది అన్నపూర్ణ

"నీ పేరేమిటి? "

"రాజ్యం బామ్మా!"

"మీ అమ్మ కనిపించడం లేదేమిటి రాజ్యం? అది కాపురానికి వచ్చినప్పుడు నేను లలితని కడుపుతో ఉన్నాను. నన్ను కంటికి రెప్పలా చూసుకునేది. నన్ను వది లిపెట్టి క్షణం కూడా ఉండేదికాదు. అటు వంటి అనసూయ ఈ మధ్య అసలే కనిపిం చడంలేదు"

"అమ్మ జాబ్ చేస్తోంది బామ్మా"

"ఏవిటో," ఆవిడ విచారంగా గొణు క్కుంది. అన్నపూర్ణ చేతిని మెల్లగా వదిలిం చుకుని, తన గదిలోకి వెళ్లిపోయింది. అక్క డున్న వాళ్లల్లో చాలామంది "ప్చ్" అని పెదవి విరిచారు. రాజ్యలక్ష్మి గదిలోంచి సన్నగా ఏడుస్తున్న శబ్దం విని అక్కడి నుంచి వెళ్లిపోయారు.

జీవితంలో ఒడుదుడుకుల్ని అవలీలగా తీసి పడేసిన పెద్దవాళ్ళే వీళ్ళంతా... అప్పుడు...

నిన్న...

నిన్నటికి నిన్న

అలా వెనక్కి వెనక్కి వెళ్ళిపోతే 'స్పర్శ' దగ్గర ఆగిపోతారు.

ఆ స్పర్శలో వెచ్చదనం ఎంత హాయిగా ఉంటుందని?

ఆ స్పర్శలో ఉన్న ప్రేమా, లాలనా, లాలి.. ఒకటేమిటి ఎన్నో రకాల భావాలని పంచిపెట్టే సంజీవని...

ఆ స్పర్శ ఎవరిది?

ఎవరిదో ఒకరిది కాదు

చుట్టూ ఉన్న తనవాళ్ళది

తన రక్తసంబంధీకులది

తన ప్రపంచానిది

జనం జనం...

జన సందోహంలో సంతోషం కలిసిపో యింది.

కష్టం, సుఖం సమంగా పంచుకుని ఓ భుజం వేసి దాటించే జనం.

మనుషుల్లేక పోతే

బాప్‌రే!

నిశ్శబ్దం.

ఆ నిశ్శబ్దంలో ఎంత భయం.

ఒంటరిగా చీకటి గుహలోకి అడుగుపెట్టి ముందుకు సాగి...

అటు వెళ్ళలేక యిటు రాలేకా

మహాసముద్రమే అట్టడుగుకు చేరుకుని

ఊపిరాడక దిక్కుతోచక

కీకారణ్యం లోకి దారితీస్తూ

ఎంత భయం... చావు భయం

బతుకు భయం

బతుక్కీ చావుకీ మధ్య నలిగి నలిగి...

ఆవిడ... రాజ్యలక్ష్మి

చప్పున లేచి కూర్చుంది.

తనిప్పుడు ఎందుకు ఏడ్చింది?

తన వాళ్ళమధ్య తనులేదు.

తన భర్త తనకి దూరంగా వెళ్ళాల్సిన అవసరం ఏమొచ్చింది? "భాస్కరం!", ఆవిడ లేచి బయటికి వచ్చింది. గుమ్మం దాటుతూ విచ్చుకుపోయిన వెంట్రుకల్ని గోళ్ళతో దువ్వుకుని పైకి ముడికట్టుకుంది.

పెరట్లోకి వస్తూ చుట్టూ చూసింది.
కొబ్బరిమట్టలు కాలుతున్న వాసన.
రాగి బిందె మసిబారి రూపాంతరం చెందింది.
ఇప్పుడా బిందె 'కాగు"
కాగులో నీళ్ళు తీసి బకెట్లలో తొలుపుతు న్నారు శాంతారాం, చంటీ.
"బామ్మా! స్నానానికి నీళ్ళు పెట్టాను" చంటి చెప్పింది. ఆవిడ బుర్ర ఊపి "అమ్మాయ్ దేవమ్మ? అని కేకేసింది.
అటు దేవమ్మా, ఇటు దీవెనా వచ్చారు.
వీళ్ళు ఆడవాళ్ళకి దగ్గరుండి స్నానం చేయిస్తారు.
దేవయ్యా, ఆంథోనీ, ఆంజనేయులూ మగ వాళ్ళని చూసుకుంటారు.
"ఈ విషయం చదివావా?" భవానీ శంకరం భార్యవైపు చూసి అడిగారు.
పేపరు వచ్చిన వెంటనే ఎవరికివాళ్ళే ముందు చూడాలని తాపత్రయపడతారు. పొద్దున్నుంచీ ఆవిడ నిర్లిప్తంగా ఉండటం ఆయన గమనించలేదు. ఆమె దగ్గర్నుంచి జవాబు రాకపోయేసరికి మరోసారి అడి గారు. "భానూ! వింటున్నావా? నువ్వు పేపర్ చదివావా అని అడిగాను. వినిపించ లేదా?."
ఆవిడ కళ్ళు శూన్యంలోకి చూస్తున్నాయి.
"నిన్నే" గొంతుపెంచి ఆయన మళ్ళీ అడి గేసరికి ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చి నట్లు "ఏమిటండీ," అంది.
"ఇదిగో ఇక్కడ చూడు" ఆయన వేలితో ఆ పేరా చూపించారు. ఆవిడ ఆవైపు చూసి "చదివాను" అంది.
"పాపం కదా" అన్నారాయన జాలిప డుతూ.
భానుమతి నిట్టూర్చింది, "కర్మకి ఎవరూ కర్తలు కారు. ఎవరి కర్మ వాళ్లనుభవించా ల్సిందే. ఇందులో పాపం ఎవరికీ? ఆయనే నయం 'స్వేచ్ఛ'ని వెతుక్కుంటూ పారిపో యారు. అంత ధైర్యం, తెగింపూలేని మన లాంటి వాళ్ళని పాపం అనాలి."
"పోలీసులు వెతుకుతూనే ఉన్నారు. ఎక్క డికి వెళ్ళిపోయాడో? ఎన్ని ఇబ్బందులు పడుతున్నాడో ఏవిటో. నీకు బాధేయడం లేదూ? ఎంత డబ్బున్నా ఏం లాభం? వేళకి అన్నీ అమర్చిపెట్టే అన్నపూర్ణమ్మని వదిలేందుకు ప్రాణం ఎలా ఒప్పిందో కదా"
"చెప్పానుగా కర్మ అని. బుద్ధికర్మా నుసారిణి అని ఊరికే అనలేదు... నాకిక్కడ అసలు బాగాలేదు. నేనుండలేను. మనం అమెరికా వెళ్ళిపోదాం" ఆవిడ సీరియస్‌గా అంది.
కమ్చీతో కొట్టినట్లయింది. ఆయనకి కళ్ళు భైర్లు కమ్మినట్లయ్యాయి. "ఇదేమైనా అమలా పురం, బందర్లంకా అనుకుంటున్నావా భానూ? ఇక్కడే ఇమడలేని మనం ఆ ఫారిన్ కంట్రీస్‌లో హవుస్ అరెస్టు బ్రతుకు బ్రతకగలమనే అనుకుంటున్నావా?"
ఆవిడ తలెత్తి ఆయన మొహంలోకి చూసింది. కంటినీరు కళ్లకి పరదా కట్టింది. భవానీశంకరం లేచి ఆమె దగ్గరకి వెళ్లి ఆప్యాయంగా ఆమె భుజం మీద తట్టి "పిచ్చి దానా! నేను లేనూ? నీకా పాట గుర్తుందా?" అని ఆగారు.
భానుమతి ఆయన చేతిని పట్టుకుని కళ్ల దగ్గర పెట్టుకుంది. "చెప్పండి! వేల పాటలు వచ్చును. ఏ పాటో మీరే చెబితే వింటాను..."
"నా హృదయంలో నిదురించే చెలీ"
ఆమె చప్పున దోసిళ్లల్లో సిగ్గుని కుమ్మరిం చింది.
"నేనున్నంతకాలం నువ్వు సుఖంగా బ్రత కగలవు. అసలు ఇక్కడ మనకేం తక్కువైం దని? రోజులు క్షణాల్లా గడిచిపోతున్నాయి. ఇంటినిండా మనుషులే. ఓ పెళ్లికి వారంరో జులు ముందు చేరుకున్న బంధువుల్లా కని పిస్తారు అందరూ. కష్టం. సుఖం అన్నీ పంచుకుంటాం. బాధపడతాం, ఓదార్చు కుంటాం. అమెరికాలో ఉన్నా, మహేంద్ర

దగ్గర వున్నా ఇంత సంతోషం మాత్రం ఉండదు."

ఆవిడ తల అడ్డంగా తిప్పింది: "మీరు నన్ను ఓదార్చాలని అలా అంటున్నారు. మన ఇంట్లో ఉన్న హాయి కాశీకి వెళ్లినా రాదని సామెత. ఇక్కడ వీళ్లందరినీ చూస్తూంటే జైల్లో ఉన్నట్లు అనిపిస్తుంది. ఊపిరాడదని ఎన్నిసార్లు చెప్పాను."

భవానీశంకరం ఏమీ మాట్లాడలేకపోయారు.

"స్నానానికి రండి తాతగారూ, నీళ్లు రెడీ" అంటూ వచ్చాడు ఆంజనేయులు.

భానుమతి అల్మైరాలోంచి లాల్చీ పైజామా, తువ్వాలు తెచ్చి అతని చేతికి ఇచ్చింది. "పదండి" అని ఆయన్ని తీసుకుని బాత్‌రూమ్ వైపు వెళ్లిపోయాడు.

అవధానిగారు వెళ్లిపోయి పదిహేను రోజులు దాటిపోయాయి. బాగా చదువుకునీ, మంచి పేరూ ప్రతిష్ఠా, ఆస్తీ, ఐశ్వర్యం 'ఫ్', ఆయన చిటికెనవేలితో శాసించగల సమర్థుడు. అటువంటి పెద్దమనిషి రాత్రికి రాత్రి గేటుదాటి పారిపోయాడు.

ఎందుకు?

భానుమతికి ఈనాటి బంధాలు అర్థం కావడం లేదు. ఉన్నట్లుండి దుఃఖం వచ్చేస్తోంది. పండగ రోజుల్లో ఇంట్లో పిల్లలు తిరుగుతుంటే పెళ్లికళ కనిపించేది.

ఎక్కువ మంది పిల్లల్ని కనడం అనాగరికం అనడం నేర్చుకుని, ఒకరో, ఇద్దరో ఎంతమంది అయితే బాగుంటుందో ఆలోచించి మరీ కంటున్నారు.

జనాభా పెరగడాన్ని అరికట్టడాన్ని నియంత్రణ అంటున్నారు. ఏం నియంత్రణో, ఏమిటో? కరువుకాటకాలకీ జనాభాకి ముడిపెట్టడం ఎందుకు? వేలాది ఎకరాలు బీడు భూమిగా మిగిలిపోతోంది. కష్టపడి పనిచేసే రైతుకి 'బీడు భూమి' కనిపించదు.

నేలతల్లిని బిడ్డలా చూసుకునే రైతులకి ఆర్థిక సహాయం చేస్తూ మరికొన్ని పంచవర్ష ప్రణాళికలు వేస్తే....

సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరం వందే...

"పొద్దున్నే రెహమాన్‌గార్ని తలుచుకుంటున్నావేమిటి భానూ..." తల ఒత్తుకుంటూ అడిగారాయన.

భర్త మొహంలోకి చూసి అక్కడినించి లేచి వెళ్లిపోయింది ఆవిడ.

పొద్దున్నే పేపరు చదివినప్పటి నుంచీ ఆవిడ ఉదాసీనంగా ఉంది. తనే కనిపెట్టలేకపోయాడు. ఈ 'చెర'లోంచి బయట పడే మార్గంలేదే వెర్రిదానా. పిదపకాలం, పిదప బుద్ధులు, ఏటికెదిరీదడం లాంటిది ఈతరం వాళ్ల వార్ధక్యజీవితం. మనం 'స్వేచ్ఛ' కోసం సాలెగూడులో ఈగల్లా పెనుగులాడుతున్నాం. అంతా వృథా ప్రయాస. ఆ విషయం నీతో నిర్భయంగా మాట్లాడలేను భానూ! ఆయన తువ్వాలుతో కళ్లొత్తుకున్నారు.

ఆవైపు చూశాడు భవానీశంకరం గారు.

క్షణక్షణానికీ గోల పెద్దదౌతోంది. అటు వెళుతూ 'మళ్లీ ఎవరైనా పారిపోయారో, ఏమో?' అనుకున్నారు. తీరా అక్కడికి వెళ్ళాక విషయం తెలిసి తలపట్టుకున్నారు.

అసలేం జరిగిందంటే....

దాదాపు పదిమంది మగవాళ్ళున్న ఇంట్లో ఒకటీ, రెండూ తేడాగా అందరూ ఒకే ఈడు వాళ్ళు. అన్ని సదుపాయాలున్నా ఏదో విషయంలో దెబ్బలాడుకోవడం కొంతమందికి హాబీ అయిపోయింది.

సర్దుబాటు చేసుకోవడం ఇష్టం వుండదు. ఉన్నంతసేపు ప్రశాంతంగా వుంటారు. పేపరు చదువుతారు. టీవీ చూస్తారు. ఓల్డ్ మెలొడీస్ వింటారు. వేళకి తింటారు. టిఫిన్ కాఫీలకి కొదవలేదు. టీ టైమ్‌ని ఎంజాయ్ చేస్తారు. మంచి బట్టలు వేసుకుంటారు. యిష్టం అయిన వాళ్ళు స్ప్రే చేసుకుంటారు. అద్దం ముందు నిలబడి అన్ని యాంగిల్స్‌లోనూ ఎలా ఉన్నదీ చూసుకుం

టారు. క్రాపుని రకరకాలుగా దువ్వుకుంటారు.

అద్దంలో ప్రతిబింబాన్ని ఒకటికి పది సార్లు నవ్వుతూ పలకరించుకుంటారు. నవ్వినప్పుడు బాగుండకపోతే 'ఛ!' అని చికాకుపడతారు.

అటువంటి వాళ్ళు 'హొద్దు', అని మనసు హెచ్చరిస్తున్నా వినకుండా చేయాలనుకున్న పనిని చప్పున చేసేసి గప్‌చిప్‌గా వచ్చి పడుకుంటారు. ఇలాంటి చిలిపి చేష్టలున్న నలుగురిలో పొద్దున్నే అంతర్యుద్ధం ప్రారంభం అయింది.

"నేనేమీ తీయలేదు. నాకేమీ తెలీదు. ఎవరిమీద వొట్టు పెట్టమన్నా పెడతాను. బోడి నీ 'పియర్స్ సబ్బు', నాకేం అఖ్ఖర్లేదు" గొంతు పెంచి అరిచారు కృపాకరం గారు.

అందుకు నేను మాత్రం తక్కువ తినలేదన్నట్లుగా రాఘవరావన్నారు. "ఇది కొత్తగా చేసిన పనికాదు కృపాకరం. చేసే పనులు మూడో కంటికి తెలీకుండా చేసేసి ఒట్లూ సత్యాలు అవలీలగా పెట్టేస్తావు. తప్పుడు పనిచేసి ఒట్టు పెట్టేందుకు భయం వేయదూ"

"నువ్వే చెబుతున్నావుగా తప్పుడు పనిచేస్తేనే భయం వుంటుందని. నాకా ఖర్మేం లేదు. నేను చేయని పనికి భయపడను".

"చూడు కృపాకరం! ఇలా చాలాసార్లు జరిగింది. నా కొడుకు నా కోసం కొండమీద కోతినైనా కొనిస్తాడు. నువ్వొక మాట అడిగి చూడు. నీక్కూడా ప్రతినెలా నేను తెప్పించుకునే సబ్బుని నీకూ తెప్పిస్తాను. సగం అరిగిపోయిన 'సబ్బు'ని వాడేసి ఏమీ ఎరగనట్లు పెట్టేయడం మన వయసు వాళ్ళకి తగదు".

ఛర్రుమంది కృపాకరానికి "మిష్టర్ రాఘవరావు! నువ్వు నాకోసం త్యాగం చేయక్కరలేదు. నా కొడుకులూ, కూతుళ్లూ కూడా మేము ఏది అడిగినా ఇస్తారు. మమ్మల్ని స్వంత బిడ్డల్లా చూస్తారు. ఇటువంటి 'కక్కుర్తి' పనులు చేయాల్సిన అవసరం నాకేమీ లేదు. నాకే బోలెడు బాంక్ బాలన్స్ వుంది. పోయి పోయి వాడేసిన సబ్బుకోసం దొంగ పనులు చేయడం మా ఇంటా వంటా లేదు".

రాఘవరావుకి కూడా ఒళ్ళు మండింది. "నాచేత అరిపించడం నీకంత ఇష్టమా? ఎదుటివాడు బాధపడుతూంటే వినోదం చిత్తగించడం మంచి పద్ధతి కాదు. పైనున్న దేవుడు 'ఉపేక్ష' చేయడు, ఎప్పటికప్పుడే చిట్టా రాసుకుంటాడు. నిన్నేడిపించడం నాకు పెద్ద విలువిద్యేమీ కాదు. నేనోమాట అన్నానంటే అన్నం, నీళ్లూ ముట్టకుండా అర్ధాంతరంగా గోవిందా అంటావు"

"నేను ముందు టీచర్ని, తర్వాత ప్రొఫెసర్ని. జీవితం అంతా పాఠాలు చెప్పడం, నేర్చుకోవడం, ఆచరించడంతోనే గడిపేశాను. అటువంటి ఉపాధ్యాయుడినైన నన్ను నోటికొచ్చినన్ని మాటలు అనేయకు. అది మంచిది కాదు. మంత్రాలకి చింతకాయలు రాలవు. నువ్వేదో ఆవేశంలో కుప్పిగంతులు వేస్తే నేను గుటుక్కుమంటాననుకోవడం నీ వెర్రి భ్రమ"

"షటప్"

"నేనూ అనగలను. నా సంస్కారం నన్ను పెదవి కదపనీయడంలేదు"

"బోలెడు బాంక్ బాలన్సా? ఏ బాంక్‌లో నమ్మా. స్విస్ బ్యాంక్‌లో పెడతామని మీ పిల్లలు నలుగురూ దోచుకున్న డబ్బేనా... స్వంత బిడ్డల్లా చూస్తారా... హూ" వ్యంగ్యంగా నవ్వాడు రాఘవరావు. "ఇల్లూ, స్థలం... షేర్స్ వీటిని కాష్ చేయించి నీకోసం నీ భార్యకోసం మొక్కుబడిగా కొంత డబ్బు ట్రస్ట్‌లో వేయించి ఉడాయించారు. ఆ ప్రబుద్ధుల్ని నువ్వు మెచ్చు కుంటూంటే నేను 'అబ్బా' అని ఆశ్చర్యపోవాలి. అంతేనా"

**చేయలవలసిన దానిని సమగ్రంగా చేయడం ధర్మం.**

**– ఒకసామెత**

అతని మాటలు యింకా పూర్తికానేలేదు.

"అమ్మా!" అని ఛాతీ పట్టుకుని నిలువునా కూలిపోయారు కృపాకరం గారు. ఆయన దగ్గరకి ఆయన భార్య చిట్టితల్లీ, రాఘవ రావు భార్య బంగారుతల్లీ పరుగున వచ్చే శారు. రాఘవరావు కంగారుగా ఐయామ్ సారీ, ఐయామ్ సో సారీ... రియల్లీ... నన్ను క్షమించు కృపా... ప్లీజ్... అంటూ ఇంచుమించు ఏడ్చేస్తున్నాడు.

భవానీశంకరం గారు అందర్నీ దూరం జరిపారు.

ఆయన వొంటిమీద దుస్తుల్ని కొంచెం వదులు చేసి శాంతారాంని పిలిచి డాక్టర్‌కి కబురు పెట్టారు.

"దిక్కుమాలిన సబ్బు ముక్క కోసం ఇంత దెబ్బలాడుకుంటారా? కొద్దోగొప్పో మీ కంటే వయసులో పెద్దాయన తీస్తే తీశారు. ఈ ఇంట్లో పరాయి వాళ్లెవరూ లేరే... అంతా ఒక గూటి క్రింద వుండేవాళ్ళం ఈ తగవు లాటలేమిటి? ఈ ప్రాణాల మీదికి తెచ్చుకో వడం ఏమిటి? మీరు అంతలేసి మాటలు అనకుండా ఉండాల్సింది." బంగారుతల్లి ఏడుస్తూంటే అక్కడున్న వాళ్ళ మొహాల్లోకి చూడలేనంత తప్పిదం చేశానని తెలిసింది రాఘవ రావుకి.

న్యూస్‌పేపర్‌తో విసురుతూ "సారీ! సారీ" అంటున్నాడు. 'రామ' మంత్రం లాగా.

డాక్టర్ వచ్చాక ట్రస్ట్ తాలూకు 'వతన్ విజయ్‌మేరీ' హాస్పటల్‌కి తీసుకువెళ్ళారు. అక్కడ క్షణం ఆలస్యం వుండదు. చకచకా జరిగిపోతాయి. అన్ని పనులూ - రాజ్యల క్ష్మిగారు ఏడుపు మొహం పెట్టేసింది. "ఏమైందే చిట్టితల్లీ" అంటూ

చిట్టితల్లి ఆవిడ చేతిని పట్టుకుని "మరేమీ కాలేదు. ఎండలెక్కువగా ఉన్నాయి. శోష వచ్చి పడిపోయారంతే" అంది. అసలే ఆవి డకి భయాలు, తనకేమైనా అయిపోతుం దేమో అని బిగుసుకుపోతుంది. లేదా గంట సేపు రకరకాల పేర్లతో పిలుస్తూ, పలక రిస్తూ శోకాలు పెడుతుంది.

"అంతే అంటావా?" నమ్మలేనట్లు అడి గింది రాజ్యలక్ష్మి

"అంతేనమ్మా" అంది ధైర్యం చెబుతు న్నట్లు.

"నువ్వు వెళ్ళలేదేమిటి?" రాజ్యలక్ష్మి సందేహంగా చూసింది. చిట్టితల్లి "ఇదిగో బయలుదేరుతున్నాను" అంది లేస్తూ.

ఇక ఆపూటకి అన్నం తినాలని అనిపించ లేదు ఎవరికీ. అందరి మొహాల్లో ఆందో ళన.

"ఈ విషయం పిల్లలకి చెప్పాలోవద్దో?"

"ఆయనకి హార్ట్ ఎటాక్ వచ్చినట్లయింది. ఈ జబ్బుని నమ్మలేం. ఓసారి పిల్లలకి తెలి యాలి"

"ముందు చిట్టితల్లిని అడిగితే సరి"

"ఏమో బాబూ! ఇలాంటి టైమ్‌లో మంచి చెప్పబోయినా మనకే ఎదురొస్తుంది"

"నూరు చెప్పు వెయ్యి చెప్పు. ఎవరేమను కున్నా మనం ధర్మాన్ని చేయాలి"

"బాలసుబ్రహ్మణ్యం సారు వస్తేగానీ ఎవరమూ ఏమీ చేయలేం"

"ఆయనకి కబురు వెళ్ళిందా?"

"అదిగో, మాటల్లోనే కారు వచ్చేసింది" అక్కడున్న ఆడా మగా తర్కించుకుంటు న్నారు.

బాలసుబ్రహ్మణ్యం పప్పు... ఆయన ట్రస్టీ చైర్మన్. అతని కొడుకు వేణుగోపాల్ పప్పు మెంబరేకాక సైకియాట్రిస్ట్. బాల సుబ్ర హ్మణ్యంతోబాటు ముఖ్యమైన సభ్యులు మరో నలుగురు కార్లోంచి దిగి హడావిడిగా లోపలికి వచ్చి విషయం కనుక్కొని చాలా బాధపడ్డారు.

"ఇంతకీ ఈ పెద్ద మనిషి ఏరీ" అని అడి గారు.

అందుకు అక్కడున్న సూర్యనారాయణ చెప్పారు "ఆయన పెద్దచెట్టు విరిగి పడ్డట్లు పడిపోయారు. అదిచూస్తూనే రాఘవరావు కుప్పకూలిపోయాడు. ఏడుస్తూనే వున్నాడు.

## నా అష్టావధానం అంటే..



ఓ కవిగారి అష్టావధానానికి వెళుతున్నారు విశ్వనాథ. వారి తనయుడు పావని శాస్త్రి అప్పుడు చిన్నవాడు. అతను 'నాన్నా.. నువ్వెప్పుడైనా అష్టావధానం చేశావా? ' అని అడిగారు.

వెంటనే విశ్వనాథ 'అది పసివారు చేసే పని. నా అష్టావధానం అలా ఉండదు. ఒకే సమయంలో ఎనిమిదిమందిని ఎదురుగా కూర్చోపెట్టుకునిఒకరికి నవల, ఒకరికి పద్య కావ్యం, ఒకరికి గేయం, ఒకరికి విమర్శ, ఒకరికి ఖండకావ్యం, ఒకరికి నాటకం మరో ఇద్దరికి వారు కోరిన అంశాలు ఏకబిగిన చెబుతాను..' అన్నారు. ఆయన పాండిత్యం, ఆత్మ విశ్వాసం అలాంటివి మరి.

ఎంతధైర్యం చెప్పినా వినడే. భవానీశంకరం గారు ఆయన్నీ భార్యనీ కూడా తీసుకువెళ్ళారు."

బాలసుబ్రహ్మణ్యంగారు చిన్నగా నవ్వుకున్నారు. వృత్తి విద్యలు మనిషితోపాటే వెన్నంటి ఉంటాయి. పాడే వ్యక్తి చేత్తో తాళం వేస్తూనో, సన్నగా హమ్ చేస్తూనో ఉంటాడు. టీచర్లూ, ప్రొఫెసర్లూ చేతులు తిప్పందే ఎక్స్‌ప్లెయిన్ చేయలేరు. అలాగే ఇక్కడ సూర్యనారాయణగారు 'హరికథ', చెబుతున్నట్లే చెబుతున్నారు. ముఖ్యంగా అది వినాలనిపించింది.

భుజం నిండా కొంగు కప్పుకుని అన్నపూర్ణ వచ్చి ఆయనకి నమస్కారం చేసి చెప్పింది: "ఎవరూ భోజనం చేయలేదు. అందరూ తింటారని సరిపోయేట్లు చేశాను. ఎంత బతిమాలినా వినిపించుకోవడంలేదు పెదనాన్నగారూ".

బాలసుబ్రహ్మణ్యంగారు అందరి వైపూ కోపంగా చూశారు. "మీరేమైనా స్కూలు పిల్లలా బెత్తంతో బెదిరించడానికి. వంటకాలు వృథా అయిపోతే మన డబ్బు మనం పారేసుకున్నట్లే. ఆ సంగతి మరిచిపోకండి. ఎంత కష్టపడితే 'డబ్బు' వస్తుంది? ఏది ఏమైనా భోజనం మానకూడదు. అన్నం పరబ్రహ్మం, సాక్షాత్తూ భగవత్ స్వరూపం. అన్నాన్ని తిని గౌరవించండి"

నాగస్వరాన్ని వినే నాగుల్లాగా వింటున్నారు. "మనం అంటే మన దేశంలో ప్రజలు అన్నమే తింటారు. ఆ వరిపంటకోసం ఎన్ని కష్టాలైనా పడతారు. రోజులో ఒక్కసారైనా తినకుండా ఉండలేరు. ఆసేతుహిమాచలం వరకూ అన్నం విలువ తెలిసిన వాళ్ళం మనమే"

'అన్న సారాన్ని వంటబట్టించుకోండి'

'ఏ ఇతర తిండి తీర్థాలూ కడుపు నింపవు'

కొంచెం భారీకాయమేమో నవ్వినా, విషయాన్ని వివరిస్తున్నా నిలువెల్లా కదలిపోతున్నారు.

"నాన్నగారూ! మీరు స్ట్రెయిన్ అవుతున్నారు" అన్నాడు డాక్టర్ వేణుగోపాలరావు పప్పు.

"వేణూ! నువ్వు మెంబర్‌లా వచ్చావు. నాకు డాక్టర్‌లా కాదు. నాకేమీ కాదురా. వీళ్ళచేత భోజనం చేయిస్తేగానీ వెళ్ళలేం అవునా"

'రాముడు మంచి బాలుడు' ఆ విషయం వేణుకి వర్తిస్తుంది. చేతిలో ఉన్న స్టెత

స్కోపు తండ్రికి ఇచ్చి "పదక్కా!" అన్నాడు అన్నపూర్ణ వైపు తిరిగి.

పిల్లలు అలిగితే పెద్దవాళ్ళు బుజ్జగించినట్లు, ఆ పెద్దవాళ్ళు కలత పడ్డారని చిన్నవాళ్ళు నిమిషాల్లో విస్తళ్ళు వేసి వడ్డించేశారు.

ట్రస్టీ మెంబర్స్ జయప్రకాష్, వేదాంతాచారి, ప్రభు, దశరథరామయ్యతోబాటు బాలసుబ్రహ్మణ్యం, వేణు కూడా భోజనానికి కూర్చున్నారు.

ప్రతి పదినిమిషాలకీ కృపాకరంగారి ఆరోగ్యం గురించి తెలుసుకుంటూనే ఉన్నారు.

అక్కడికి వెళ్ళిన వాళ్ళందర్నీ తిరిగి రమ్మని చెప్పారు. దాదాపు గంటా, గంటన్నర కూర్చుని పేరు పేరునా కుశలం అడిగారు.

చివరికి అన్నపూర్ణ వైపు చూస్తూ "ఏమ్మా! ఏమాలోచించావు? నా మాట విని నేను చెప్పినట్లు చేయమ్మా" అన్నారు.

అన్నపూర్ణ బలవంతంగా నవ్వింది. "థాంక్యూ... థాంక్యూ సోమచ్..."

"అంటే అర్థం తెలీలేదమ్మా"

ముప్పైకి అటూ ఇటూగా ఉన్న అన్నపూర్ణ తల దించేసుకుని చీర కొంగుని వేలికి చుట్టుకుంటూండిపోయింది.

బాలసుబ్రహ్మణ్యంగారు ఆమె తలమీద చేయివేసి ప్రేమగా నిమిరి "టైమ్... టైమ్ రావాలి. ఏదీ మన చేతిలో లేదు" అన్నారు.

హరిణిలాంటి కళ్ళు అన్నపూర్ణవి. అవి అసలే బరువుగా కదులుతాయి. ఇప్పుడవీ ఇంకా బరువెక్కాయి. తడిసిన కళ్ళు పైకెత్తలేక అలాగే తల వంచేసుకుని గుమ్మంవైపు చూస్తూంటే రెండు కన్నీటి బిందువులు ముక్కు దగ్గర ఏకం అయి కొంత దూరం సాగి ముక్కు చివర నిలబడలేక 'టప్పుమని' గుమ్మంమీద పడ్డాయి.

"నో" అన్నారు బాలసుబ్రహ్మణ్యంగారు.

ఆగనంటోంది కన్నీరు.

గుండె బరువెక్కి మరి మోయలేనంటోంది.

కాళ్ళూ చేతులూ మొత్తం శరీరం బలహీనం అయిపోయి గాలికి తట్టుకోలేక తేలిపోతున్నాయి.

ఎంత కష్టం! ఎంత కష్టం! మోయలేని కష్టం.

"ఎప్పుడు వస్తారు? " నూతిలోంచి వచ్చినట్లు గొంతు బావిలోంచి వినిపించీ వినిపించనట్లు.

"నీ మంచి కోరి చెబుతున్నవాణ్ణి. తెరపడిందనుకో మనవల్ల ఏదీకాదు. అయినప్పుడు దానంతటది అదే మనవల్లే అవుతుంది. నిమిత్త మాత్రులం. మనమీ సృష్టిని ఛేదించలేం"

"మళ్ళీ ఎప్పుడు వస్తారు"

"చాలా సమస్యలు. ఆయన కొడుకు ఇంటినుంచి పారిపోవలసింది. అవధానిగారు ఇంత పని చేస్తారనుకోలేదు. కొడుకు కంప్లైంట్ ఇచ్చాడు"

ఈసారి కళ్ళెత్తింది అన్నపూర్ణ.

ఆయన మాట్లాడుతూంటే 'చాలు ఈ సుఖం' అనిపిస్తుంది. టేబిల్ చుట్టూ కూర్చున్నారంతా.

"నాతో ఒక్కమాట చెబితే నేను పంపించేవాడిని. అయినా ఈ వయసులో అంత పెద్ద గేటు ఎక్కేసి గోడమీంచి పిల్లిలా దూకేసి పారిపోవడం కేవలం మన సినిమాల్లోనే చూస్తాం. కానీ ఈ మహానుభావుడు అవలీలగా దాటేసి పారిపోయాడు" అంతలోనే చెంపలేసుకుని పెద్దాయన్ని 'పారిపోయాడనడం', తప్పే... కానీ ఏంచేయను? చిక్కుల్లో పడేశాడే"

"ఆయనకోసం మేమూ ఎదురు చూస్తున్నాం సర్. మా మనసులు భయంతో వణికిపోతూంటే ధైర్యం చెప్పేవారు. అటువంటి మనిషి పిరికివారిలా పారిపోతే ఏమనాలి? "

"నో... నో... నో... ఆ మాట మళ్ళీ అన

కండి. వినలేం. ఓ మంచి మనిషి ఏ కారణంగానో యిలా చేయాల్సి వచ్చింది. అది ఆయన జీవితానికి మచ్చ తీసుకురాకూడదు".

ఆయన లేవగానే అందరూ గేటు వరకూ వచ్చారు.

కారులో కూర్చోబోతూ "భవానీశంకరం రాగానే నన్ను కలుసుకోమని చెప్పండి. ఎవరికి ఏం కావాలో ఆయనతో చెప్పండి. రాఘవరావు గారినీ, కృపాకరంగారినీ చూసి వెళతాం" అని జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయారు.

కారు కనుమరుగైపోయేవరకూ అందరూ అక్కడే ఉన్నారు. ఆ తర్వాత ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

★ ★ ★

ఆరుబయట విశ్రాంతిగా కూర్చున్నారు బాలసుబ్రహ్మణ్యం గారు. ఆయన ఎదురుగా మరో కుర్చీలో కూర్చున్న వేణుగోపాల్ తండ్రిని అడిగాడు. "నాన్నగారూ! మీరు తలకి మించిన భారాన్ని మోస్తున్నారేమో అనిపిస్తోంది. భగవంతుడి దయవల్ల మనకి లోటుపాట్లేవీ లేవు. ఏదో చేతనైన సాయం చేయడం వేరూ, ఇన్ని బాధ్యతలు నెత్తిన వేసుకోవడం వేరు. మీరు రెస్ట్ తీసుకోండి. నేనూ మీనాక్షీ మనస్ఫూర్తిగా మీ పనులు చేస్తాం"

"నువ్వింతగా చెప్పాలా వేణూ! ఈ విషయంలో నువ్వు ఎన్నిసార్లు నాగురించీ, నా ఆరోగ్యం గురించీ చెబుతూనే వున్నావు. ఎవరికి వాళ్ళే యిలా అనుకుంటే బాధితులకి దిక్కెవర్రా కన్నా! మాకైతే నువ్వూ, కోడలూ... అక్కడ మీ అక్కా బావా ఉన్నారు. ఈ మారుతున్న కాలంలో ఎవర్రా ఇంత ఆలోచించేది? "

"నాన్నా! మీరు అర్థం చేసుకోండి. ఆరోగ్యం కూడా బాంక్ బాలన్స్‌లాంటిదే. డబ్బు దాచుకుంటే పెరుగుతుంది. ఆరోగ్య సూత్రాల్ని పాటిస్తే ఆయుష్షు పెరుగుతుంది"

"వెర్రి నాగన్నా" శరీరం అంతా కదిలేట్లు నవ్వారు బాలసుబ్రహ్మణ్యం. అరుంధతి ట్రేలో కాఫీ తీసుకురాగానే వేణు సన్నగా నవ్వాడు.

"చూశారా నాన్నా స్వయంగా తనే తీసుకువచ్చింది. ఏమిటమ్మా నువ్విక్కడ మాతోబాటు కూర్చుని ఉంటే మీనాక్షి పంపేది కదా"

"ఇదో ప్లెజర్. ఇలా కాఫీ, టీ అందించడంలో స్త్రీ స్వాతంత్ర్యాన్ని కాలరాయడం కాదు. మేల్ ఈగో అని పేర్లు పెట్టుకోనవసరం లేదు. ఆయాసం, అలసట అనిపించదు. జీవితాన్ని షేర్ చేసుకున్నందుకు ఒకరికొకరు సంతోషాన్ని పంచుకోవడం. అంతే"

"నిజం అమ్మా? " ఒప్పుకున్నాడు వేణు.

మీనాక్షి మల్లెపూలు మాలకట్టి అత్తగారి ముచ్చట ముడి చుట్టూ తురిమింది.

తదేకంగా చూస్తున్న బాలసుబ్రహ్మణ్యం కొడుకువైపు చూశారు. "చూశావట్రా వేణూ. అతి చిన్నవిషయం అది"

వేణు ఆయన చెప్పేది వింటున్నాడు

"అత్తగారికి పూలదండ పెట్టడం మామూలు విషయం. అందులో ఎంత ఆనందం వుందో చూడు. కొడుకూ, కోడలూ, మనవలూ భార్య యిలా చుట్టూ కుటుంబ సభ్యులు వుండటం ఒక వరంలాంటిది. మా హయాంలో యీ కంబైన్డ్ ఫామిలీస్ 'బాధ్యత' అని కూడా అనేవారు. అది నిజం కాదురా. తండ్రికి కొడుకూ, అత్తకు కోడలూ వీళ్ళందరికీ మనవలూ తోడు. ఎవరికి వాళ్ళే

అయితే ఒంటి గాళ్లమే. అంతలోనే ఇంత మంది నా వాళ్ళు నాకున్నారు అనే 'భరోసా' ఎంత ఆనందాన్నిస్తుందో! మనిషి అల్పసంతోషి. ఈ సౌకర్యం వుంటే మరేమీ అవసరం లేదు"

వేణుకి అర్థం అయింది. "నాన్నా! మీరు చాలా ఎక్కువగా ఆలోచిస్తున్నారు".

"ఫాక్ట్. నిజాన్ని చెబుతున్నాను. నాకు కలిగిన ఆనందాన్ని నలుగురితో పంచుకోవడం చాలా ఇష్టం. ఏ దారీలేని వాళ్లని ఓ చోటచేర్చి వాళ్లకి ధైర్యాన్ని, సంతోషాన్ని ఇవ్వాలనుకోవడం శ్రమే అవుతుంది? "

వేణు లేచి "మనం బిర్లామందిర్‌కి వెడదాం అమ్మా రెడీయా" అని అడిగాడు.

పదినిమిషాల్లో వేణు ఇద్దరు పిల్లలూ, మీనాక్షీ, తల్లీదండ్రీ కారులో కూర్చున్నారు. వేణు పిల్లలు ఇంటర్‌లో ఉన్నారు. పెద్దవాడు గిరిధారి, రెండోది అమ్మాయి శ్రీనిధి. మీనాక్షి ఎమ్.ఎస్‌సి చదివింది. కొడుకుని ఇంజినీర్‌ని చేయాలనీ, కూతుర్ని డాక్టర్ని చేయాలనీ మీనాక్షి కోరిక.

అరుంధతి ఎమ్.ఎ. బిఎడ్ చేసిన టీచరు. ఆవిడా కోడలికే ఓటు వేసింది.

దేదీప్యమానంగా వెలిగిపోతున్న బిర్లామందిర్ ముందు కారు ఆగగానే మనసంతా ప్రశాంతంగా మారిపోయింది. మెట్లన్నీ ఎక్కి వెడుతూంటే మొత్తం హైదరాబాద్, సికింద్రాబాద్ కనిపిస్తున్నాయి. ముందు బాలసుబ్రహ్మణ్యంగారు నడుస్తూంటే, మీనాక్షి ఆయనతో చెబుతోంది.

"నౌబత్ పహాడ్‌ని ఎక్కే రోజుల్లో యిక్కడంతా నిర్మానుష్యంగా వుండేదని అమ్మా, నాన్నా చెబుతుంటారు మామయ్యగారూ"

ఆయన సన్నగా నవ్వి "అప్పుడు మేమంతా టీన్స్‌లో ఉండేవాళ్లం" అన్నారు.

"మీరెందుకు నవ్వారు? "

"చెబుతున్నా! చెబుతున్నా. ఓ సారేమైందంటే మేమందరం ఇటువైపు వచ్చాం. నౌబత్‌పహాడ్ పైవరకూ వచ్చిన వాళ్లం మాత్రం నలుగురమే వున్నాం. అదిగో అటు... అటు వైపు చూడు" వేలితో చూపించారు.

"నాకేమీ కనిపించడంలేదు"

"రేడియోస్టేషన్ ఉంది చూడమ్మా"

"కనిపించడంలేదు మామయ్యగారూ"

"నేను మాత్రం కనిపిస్తోంది అన్నానా... అటుపక్క అన్నమాట"

"ఓ... చెప్పండి"

"చాలా సేపటికి ఇద్దరు ఆడపిల్లలు వచ్చారు. 'టీన్స్'లో ఉన్నాం పరిచయాలు అవడం ఏవిటి 'లౌ ఎట్ ఫస్ట్ సైట్' సెకెండ్స్‌లో జరిగిపోయింది. నేనూ నా ఫ్రెండ్ ఇంటికి వెళ్లాలన్న ధ్యాస కూడా మరిచిపోయాం...

"పాపం" నవ్వింది మీనాక్షి. "తరువాత"

"సాయెనారా, సాయనారా..." పాడేసింది. నా ఫ్రెండ్ పదిహేను రోజుల్లో పెళ్లి చేసుకున్నాడు. ఆ అమ్మాయికి డాక్టర్ను చేసుకోవాలని కోరికట. వాడు డెంటిస్ట్..."

"సస్పెన్స్ బాగా మెయిన్‌టెయిన్ చేశారు. మామయ్యగారూ. ఓసారి నాన్నే చెప్పారనుకుంటా. అమ్మ ఫ్రెండ్ అత్తయ్యగారనీ మరో నెల ఆగి మీరు ఆవిడని పెళ్లాడారనీ కూడా చూచాయగా విన్నాను"

"ఆ రోజులు చాలా బావుండేవమ్మా. ఇంత క్రౌడ్ లేదు. మేము పనిగట్టుకుని హుస్సేన్‌సాగర్ దగ్గర సాయంత్రాలు గడిపేవాళ్లం. నో బిజీలైఫ్. ఎక్కడికైనా వెళ్లడమో, ఎవరింట్లోనైనా సాహిత్యం గురించో, సంగీతం గురించో చర్చించుకోవడమో! భలే ఉండేవి ఆరోజులు"

"గుడి వచ్చేసిందండీ" అరుంధతి పిలిచింది.

"వస్తున్నా"

ఆలయం చుట్టూ ప్రదక్షిణ చేస్తుంటే ఏకా

**సంతోషం సంతృప్తి సౌందర్య వర్ధకాలు, నిత్యయౌవన పోషకాలు**

**- చార్లెస్ డికెన్స్**

గ్రత పోతోంది. రద్దీ... రద్దీ.

అంతదూరం నుంచి ఎంతో కష్టపడి వస్తుంటే తీరా గర్భగుడిలోకి వెళ్లాక ఎవరో తరుముతున్నట్లే. స్వామిని కళ్లారా చూసేందుకు లేదు. కనురెప్ప వేసే లోగా ఆలయం బయట ఉండాల్సిందే.

ఈ ఆలయం కట్టాక పదిన్నర పదకొండు గంటల ప్రాంతంలో అప్పుడప్పుడు భక్తులు కనిపించేవారు. హడావుడే వుండేది కాదు.

రద్దీ వల్ల వేడెక్కిన వాతావరణం చల్లని గాలివైపు పరిగెత్తిస్తోంది మనుషుల్ని. ఎంత త్వరగా వచ్చారో అంతే త్వరగా ఇంటిదారి పడుతున్నారు.

నెలకోసారి ఇక్కడికి రావడం బాలసుబ్రహ్మణ్యం కుటుంబానికి అలవాటు. అలాగే



మీనాక్షి తల్లిదండ్రులు రాధా వంశీలకి కూడా ఆలయానికి రావడం ఇష్టం.

ఇల్లు చేరేసరికి బాగా పొద్దుపోయింది. అత్తాకోడళ్ళిద్దరూ కలిసి వంటావడ్డనా చేశారు.

"ఈమధ్య కాత్యాయనీ, పిల్లలూ కల్లోకి వస్తున్నారు. వాళ్ళనోసారి రమ్మని ఫోన్ చేయండీ" అంది అరుంధతి.

"ఉన్నట్లుండి ఇదేమిటి? పొద్దున్నుంచీ గుర్తురాలేదా"

అరుంధతి వడ్డించడం మానేసి కుర్చీలో కూర్చుండిపోయింది. ఆమె చదవని పుస్తకం అంటూలేదు. లైబ్రరీలో పుస్తకాలన్నీ అయిపోయాయి. కొన్న పుస్తకం పదినిమిషాల్లో చదివేస్తుంది. నవలలు, కథలూ, కవితలూ అని ప్రత్యేకమేం లేదు. ఏదైనా సరే చదివేయాల్సిందే. సైన్స్, ఫిక్షన్ - అన్నీ... అన్నీ... చదివేస్తుంది.

"చెప్పు అరుంధతీ! ఇప్పుడు ఫోన్ చేయనా"

అరుంధతి తలెత్తి గోడగడియారం వైపు చూసింది. పదకొండు గంటలు చూపిస్తోంది. తిరిగి తలదించుకుంది.

"చెప్పు అరుంధతీ"

"ఇప్పుడు బాగుండదేమో. రేపొద్దున అల్లుడు కోర్టుకు వెళ్ళేలోగా ఫోన్‌చేసి నాకు వెంటనే వాళ్ళని చూడాలని వుందనీ, వారం రోజులు వుండేట్లు రమ్మనీ చెప్పండి"

"అమ్మా సాయంత్రం చెప్పాల్సింది"

అరుంధతి చేతికున్న గాజుల్ని యిటూ అటూ జరుపుతూ "యిప్పుడే అనిపించింది. పిల్లకి నలతగా వుందని" అంది

"ఏ పిల్లకమ్మా"

"ఏ పిల్లేమిట్రా? నీ చెల్లెలు కాత్యాయనికి"

"కలలు వస్తూనే వుంటాయి. వాటిని పట్టించుకోకూడదు".

"నీకు తెలీదు. పిల్లలకీ భర్తకీ, పక్కన పుట్టిన వాళ్ళకీ, తల్లిదండ్రులకీ అంటే మన రక్తం పంచుకుని పుట్టిన వాళ్ళందరికీ అన్న మాట. మంచి జరిగినా, చెడు జరిగినా మనసూరుకోదు. ఏదో విధంగా గుండె తలుపులు తడుతుంది. మనం కదిలిపోతాం. ఈ సంగతి నేను చెబితే కొట్టిపారేస్తారు. ఇది మాత్రం నిజం."

"నాన్నా ఓ సారి చెల్లికి ఫోన్ చేయండి"

బాలసుబ్రహ్మణ్యం గారు వెంటనే ఫోన్ అందుకున్నారు.

"మామయ్యగారూ! అలాగే వస్తాం. రేపు రాత్రికి హైద్రాబాద్‌లో వుంటాం సరేనా? అత్తయ్యగారిని బెంగ పెట్టుకోవద్దని చెప్పండి" అన్నాడు అల్లుడు.

ఇటు అరుంధతి కుర్చీలోంచి మెల్లగా లేచి భర్త ఏవైపు తిరిగితే అటు తిరుగుతూ కంగారు పడిపోతూ ఆఖరికి కూర్చుంది బాలసుబ్రహ్మణ్యం కూర్చుని "హమ్మయ్య" అన్నారు.

"కాత్యాయని ఎలా ఉంది" మనసు మారుమూలల్లో ఏదో బెంగ ఆవిడకి.

"రేపురాత్రి వస్తున్నారు. అంతా బాగానే ఉన్నారు. నువ్వు భోంచేసి పడుకో" అన్నారాయన.

గిరిధారీ, శ్రీనిధీ నిశ్శబ్దంగా గదుల్లోకి వెళ్ళిపోయారు. మీనాక్షి డైనింగ్‌టేబుల్ శుభ్రం చేసి అత్తగారితో "మీరు విశ్రాంతి తీసుకోండి. ఈ వారం రోజులూ ఎలా గడపాలో నేను ప్లాన్ చేస్తాను. ఏమేం వండుకోవాలో, షాపింగేంచేయాలో మీరు ఆలోచించండి సరేనా"అంది

అరుంధతి గుండె అదిరినట్లయింది. భర్త ఆ పెద్దవాళ్ళ యింటికి వెళ్ళి వచ్చినప్పుడల్లా తనకు తెలియకుండానే శరీరం చచ్చుబడినట్లయిపోతుంది. రాబోయే ప్రమాదానికి గుర్తుగా ఏదో అలజడి జరుగుతున్నట్లూ, ఆ ప్రళయం లాంటిది విరుచుకు పడబోతోందేమో అనిపిస్తుంది. తనవల్ల కానిదీ... అసలీ భూప్రపంచంలో ఎవరూ ఆపలేనిదీ ఏదో కోరలు చాచి మింగేయబోతోందన్న

భావం ఆరోజంతా భయపెడుతుంది.

తను కూడా ఏదో ఊబిలోకి దిగిపో తోంది. లాభం లేదు. ఈ విషయం యింట్లో అందరికీ చెప్పేయాలి. చెబితే వేణు "అమ్మా! అదేంలేదు నువ్వనవసరంగా డిటెక్టివ్ నవలలూ, ఫాంటసీ కథలూ చదివి ఏదో ఊహించుకుంటున్నావు. ఇది కలియుగం ప్రథమపాదం. ఈ జంబూద్వీపం అప్పుడే మునిగిపోదు. మీనాక్షితో కాసేపు 'చెస్,' ఆడితే బావుంటుందేమో" అనేస్తాడు.

ఆయనైతే "అరుంధతీ! నువ్వేదో ఫోబియాలో చిక్కుకుంటున్నావు. మనం అందరం కలిసి వైష్ణవదేవిని చూసి వద్దామా" అని అడుగుతారు. కాత్యాయినీ అల్లుడూ పిల్లలూ వచ్చాక ఆ పనిచేస్తే బావుంటుంది అనుకుంది.

"అత్తయ్యా! మీరు ఏదో ఆలోచిస్తున్నారు? ఏమైంది? " అని అడిగింది మీనాక్షి.

ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చింది అరుంధతి.

మీనాక్షి ఆవిడదగ్గరికి వచ్చి భుజంమీద చేతులువేసి "చెప్పండి, ఎందుకు భయపడుతున్నారు? మీకేం కావాలి? చెప్పాలి. మరి నేను మీకేమైనా 'హెల్ప్' చేయగలనేమో ఆలోచించండి" అంది.

ఆ భుజం మీద చేతులు దృఢంగా "నీకు నేనున్నాను" అన్న హామీని ఇస్తున్నాయి. ఆ చేతుల్ని ముందుకు తీసుకుని ప్రేమగా నిమిరి "మీనాక్షీ, కాపాడు తల్లీ" అని అమ్మవారికి మొక్కుకుంది.

పక్కమీదకి చేరుకునేసరికి పన్నెండు గంటలైంది. రోజంతా శ్రమపడడంవల్ల ఇలా పడుకోగానే కంటిమీదికి కునుకు వచ్చేసింది.

అంతలోనే కొంపలంటుకుపోయినట్లు ఫోను రింగైంది. బాలసుబ్రహ్మణ్యం గారికి చీమచిటుక్కుమన్నా మెలుకువ వచ్చేస్తుంది. అరుంధతి మాత్రం నిద్రలో గురక పెడుతోంది.

ఆయన అడిగారు "ఏమైంది భవానీశంకరం! కృపాకరం గారికి ఎలా ఉంది? రాఘవరావు ఇంకా అక్కడే ఉన్నాడా? నన్ను రమ్మంటారా? "

"ఇన్వెస్టిగేషన్స్ అన్నీ అయ్యాయి. దేవుడి దయవల్ల అంతా బాగుంది. టెన్షన్... ఆయన కోలుకున్న వెంటనే ఎంత రాత్రయినా ఫోన్ చేసి చెప్పమన్నారని చేశాను" అన్నారు భవానీశంకరం.

"చాలా సంతోషం సర్. మీ వంటివాళ్లు ఉండబట్టే మిగతావాళ్లు ధైర్యంగా ఉంటున్నారు. ఇప్పుడు నాకు కూడా ప్రశాంతంగా ఉంది. మీరు ఇంటికి వెళ్లండి. నేను ఆయన దగ్గర ఉండేందుకు రామకృష్ణని పంపిస్తాను"

"రామకృష్ణనా" ఆయన రెట్టించారు.

"అవును రామకృష్ణకి ఫోన్ చేస్తాను"

"వస్తాడంటారా"

"వస్తాడు"

"అతను వచ్చేవరకూ ఉంటాను బాలసుబ్రహ్మణ్యంగారూ"

"ఒద్దు. మీరు వెంటనే ఇంటికి వెళ్లండి. మీరున్నారని తెలిస్తే రామకృష్ణ రాడు"

"బయలుదేరుతున్నాను"

"దట్స్ గుడ్... గుడ్‌నైట్" అని ఫోన్ పెట్టేశారు.

ఫోన్ శబ్దం విని అరుంధతి తలతిప్పి అటువైపు చూసి మళ్లీ నిద్రలోకి జారిపోయింది. బాలసుబ్రహ్మణ్యంగారు ఫోన్ చేసేందుకు గుమ్మం అవతలికి వెళ్లారు. అరుంధతికి మెలుకువ వస్తే మళ్లీ నిద్రపోదావిడ.

"హలో" అవతలినుంచి రామకృష్ణ పలికాడు.

"రామకృష్ణా! నువ్వు వెంటనే బయలుదేరి మన హాస్పిటల్‌కి వెళ్లు. అక్కడ నువ్వు వస్తావని మీ మామగారు ఎదురుచూస్తున్నారు"

"ఇంత రాత్రివేళా? "

"అవును నువ్వు వెళ్లాలి"

అవతలినుంచి జవాబు రాలేదు.

"హలో... హలో"

'....'

"రామకృష్ణా! నువ్వింకా లైన్లో ఉన్నావని నాకు తెలుసు. నువ్వు చెప్పిన మాటలు అప్పుడే మరిచిపోయావా? "

అక్కడ నిశ్శబ్దం.

ఆ నిశ్శబ్దానికి బాలసుబ్రహ్మణ్యం పెనుతుఫానులా ఊగిపోయాడు. అవతలి వ్యక్తి నిర్లక్ష్యానికి ఆయన గుండె మండిపోతోంది. అవి సెగలూ, పొగలుగా మారి పరిసరాల్ని కూడా దగ్ధం చేస్తాయనిపిస్తోంది. ఆ ఆవేశంలో ఫాలాక్షుడే అయారు.

నైట్‌డ్రెస్ తీసేసి పాంటూ షర్టూ వేసుకున్నారు. అలికిడికి డ్రైవరు శ్రీను నిద్ర లేచాడు. లేచి నిలుచుని వినయంగా "సర్" అన్నాడు.

అతని నమ్రత బాలసుబ్రహ్మణ్యంగారికి చల్లని నీళ్లలో స్నానం చేయించింది.

"రామకృష్ణ ఇంటికి వెళ్దాం"

"సర్...' శ్రీను నెమ్మదిగా అన్నాడు "విషయం చెప్పండి. నేను వెళ్లి ఆయనకి చెబుతాను. ఈ రాత్రివేళ మీరు బయలుదేరారని తెలిస్తే అమ్మగారు 'డిస్టర్బ్' అవుతారు"

బాలసుబ్రహ్మణ్యం అక్కడున్న సిమెంట్ చప్టామీద కూర్చుండిపోయారు. ఆయన వెనకే వచ్చిన శ్రీను చేతులు కట్టుకుని నిలుచుని ఆయన జవాబు కోసం ఎదురుచూస్తున్నాడు.

కొంచెం ఆలోచించి లైటు వెలుగుకి అడ్డంగా ఉన్న తీగల నీడలోంచి స్పష్టంగా కనిపించిన శ్రీను మొహంలోకి చూస్తూ "నీ మాట విని నీతో వస్తాడంటావా శ్రీనూ" అని అడిగారు అనుమానంగా.

"మీరేం కంగారుపడకండి. నేను నచ్చజెప్పి తీసుకువెడతాను"

"నాకూ రావాలని ఉందోయ్"

"మరీ పొద్దుపోయింది. మీరు వెళ్లి ఏమీ జరగనట్లే పడుకోండి. అక్కడ ఏదైనా పొరపాటు జరిగితే నేను మీ సెల్‌కి ఫోన్ చేస్తాను. మీరు 'టేమింగ్ ఆఫ్ ది ష్రూ' చదివారు కదండీ. చివరివరకూ తొందరపడను సరేనా సర్"

మనసు కట్టలు తెంచుకున్న ఆనందం ఒళ్లు విరుచుకున్న సముద్రం అయింది. ఆయన ఊపిరి పీల్చుకున్నారు.

శ్రీను షెడ్‌లోంచి కారు తీసి "మీరు వెళ్లండి సర్' అని గేటు తీసుకున్నాడు. డూప్లికేట్ 'కీ' అతని దగ్గర కూడా ఉంటుంది. కారు వెలుగూ- చీకట్ల మధ్య తారురోడ్డు మీద మెత్తగా జారిపోతోంది.

★ ★ ★

ఆరుబయట కుర్చీల్లో కూర్చున్నారు మిత్రవిందా అవధాని గారూ. ఐదు గంటలు నలభై నిమిషాలకి తూర్పుదిక్కు ఎర్రబడింది. గోరువెచ్చని ఆ ఎరుపు రంగు రూపు దిద్దుకుని ఆరుగంటలకల్లా ఆకాశంలోంచి పైకిరాగానే అక్కడ పరమేశ్వరి తిలకం దిద్దుకున్నట్లు కనిపించింది.

ఎంత బాగుందని!

టైము ఏడు గంటలు దాటింది. ఒళ్లు కొద్దికొద్దిగా చుర్రుమంటోంది. లోపలికి వెళ్లిన మిత్రవింద రెండుగ్లాసుల్తో ఘుమ ఘుమ లాడే కాఫీ తీసుకువచ్చి "తాతగారూ! తీసుకోండి" అంది. గ్లాసు అందుకున్నారు.

"కాఫీ చాలా బాగుంది."

"థ్యాంక్యూ! థ్యాంక్యూ వెరీమచ్. మీరో విషయం గమనించారా" అడిగింది మిత్రవింద.

"ఉపోద్ఘాతం లేకుండా వేసే ప్రశ్నకు జవాబు ఇవ్వడం కష్టం మిత్రవిందా..."

"ఓ! సారీ నేనే చెప్పేస్తాను. తినే పదార్థాలు గానీ తాగే పానీయంగానీ బాగుంటే ఆ యిచ్చిన వాళ్లని మనస్ఫూర్తిగా మెచ్చుకో

**నిగ్రహం కోసం విగ్రహం. – అమ్మ**

వాలి. అలా మెచ్చుకోవడం వల్ల పట్టరాని సంతోషం కలుగుతుంది. ఆ సంతోషంలో ఎప్పుడూ ఏదో ఒకటి ఇవ్వాలనో, పెట్టాలనో అనిపిస్తుంది. ఆవిధంగా పెట్టే గుణం ఊపిరిపోసుకుంటుంది"

"నిజం... నిజం..."

"తాతగారూ! మనం చేయాల్సిన పనులు ఏమీలేవా? "

"నాకైతే లేవు"

"ఎన్నాళ్లిలా ప్రపంచానికి తెలియకుండా దాక్కుంటారు."

"చచ్చే వరకూ"

"ఛ! ఛ! పొద్దున్నే అవేం మాటలు? మీరేదో చాలా గొప్పవాళ్లనుకున్నాను. జేమ్స్ బాండ్ లెవెల్లో హీరోలా దెబ్బలాడేసే మీరేనా పిరికివాడిలా మొహం చాటేసుకుంటున్నారు."

అందుకాయన ఫెళ్లున నవ్వారు. "పిచ్చి తల్లి, నేను హీరోనేమిటి నామొహం. పిల్లిని నాలుగ్గోడల మధ్య బంధించడం లాంటి శౌర్యం నాది" "పిల్లిని బంధించడంలో శౌర్యం ఏవింటి? "

"పిల్లి నాలుగ్గోడల మధ్యా చూపించే శౌర్యం సరేనా? "

"నేనొప్పుకోను. పరిగెత్తి పరిగెత్తి రైలు కంపార్టుమెంట్‌లో ధబ్బున పడ్డ చప్పుడూ, ఆ వెనుక తిట్లూ అంతా ఓ సినిమా షూటింగ్‌లా అనిపించడం లేదూ"

'ఊc'

"అసలు మనం బతికి బయటపడడం ఓ అద్భుతం"

కాఫీ తాగేసి గ్లాసు కిందపెట్టారు. "అంతా దైవేచ్ఛ. మన చేతిలో ఏమీలేదు. నా ప్రాణాన్ని గుప్పెట్లో పెట్టుకుని ఎక్కడి నుంచో పరిగెత్తుకొని వచ్చాను. పరుగో పరుగు... ఎందుకూ? నన్నునేను కాపాడుకోవడానికి. ప్రాణభయం. స్వేచ్ఛ కోసం! ఆ టైమ్‌లో నేను సినిమాషూటింగ్ గురించి ఏమాలోచిస్తాను చెప్పు? "

"మీరు వాళ్లతో హోరాహోరీ దెబ్బలాడలేదూ"

"వెనకటికి ఎవడో సింహం మీసాన్ని లాగాడుట. పోయి పోయి సింహంతో చెలగాటమా? నేనూ ఆ టైమ్‌లో సింహాన్నే అయాను. పొట్ట కోసం తిప్పలు వేరు. డబ్బుకోసం గడ్డితినడం వేరు. నాకంటి ముందే ఓ ఆడకూతుర్ని ఓ స్త్రీని ఓ అమ్మని భయం భక్తీ లేకుండా సిగ్గు తీయాలని ప్రయత్నం చేస్తారా? స్త్రీ అంటే తోలు కప్పుకున్న బొమ్మకాదు. సాక్షాత్తూ ఆదిశక్తి. అంతే. నా నరాలు పొంగాయి. చేతులు విసురుగా లాగేస్తున్నాయి.

ఆ చీకట్లో కనిపించ లేదు గానీ మిత్రా. ముందువాడి పొంటువూడి వచ్చేసింది. జుట్టు పీకాను. అందిన చోటల్లా కరిచి పోగుపెట్టాను. ఆఖరికి వాడి రైఫిల్ లాగేశాను."

"బ్రేవో" మిత్రవింద చప్పట్లు కొట్టింది.

"దేశరక్షణ జాగృతం చేస్తే అది ఈ భాష్యం చెబుతుంది."

"అర్థం కాలేదు"

"స్త్రీని పువ్వులా చూడడం నైతికం. జన్మయిచ్చిన స్త్రీ లాంటిదే జన్మభూమి కూడా. స్త్రీని బలాత్కారం చేయడమే దురాక్రమణ. నాలో సిపాయి మేల్కొన్నాడు. గెలిచేవరకూ పోరాడడం వీరుల లక్షణం. ఆ టైమ్‌లో అదే జరిగింది."

'ఓ' అని మిత్రవింద కళ్లు గుండ్రంగా తిప్పింది. "యుఆర్ రియల్లీ గ్రేట్ సోల్జర్"

"థాంక్యూ"! అవధానిగారు గర్వపడ్డారు.

'మరి నేను ఇంటికి వెళ్లాలి. ఇంట్లో వాళ్లు కంగారు పడతారు. మీ సంగతేమిటి? "

అవధానిగారు నవ్వి "వెనకటికి ఓ ముసలమ్మ కోడినెత్తుకు పోయిందిట" అన్నారు.

"అంటే"

"నువ్వూ ముసలమ్మలా కోడిలేకపోతే తెల్లారదన్నట్లు మాట్లాడుతున్నావు"

"మీరు మీ విలువ గుర్తించడం లేదు సుమా"

"ఇంతకీ నన్నేం చేయమంటావు మిత్ర వింద"

"నేను చెప్పినట్లు చేస్తారా? "

"ఓ. యస్."

"మాట తప్పకూడదు"

"ఓ. కే."

"నేను తిన్నగా బయలుదేరి..."

"స్టాప్" మధ్యలో కట్ చేస్తూ "నేను బయలు దేరి తిన్నగా అని చెప్పాలి".

"థాంక్యూ. అలాగే మీ ఇంటికి తీసుకు వెడతాను మిమ్మల్ని. అక్కడ నాలుగు రోజు లుండి మా ఇంటికి వెళ్లిపోతాను".

అవధానిగారు నోట మాట రాని వాడిలా తెల్లబోయారు.

"తాతగారూ... తాతగారూ" మిత్రవింద ఆయన భుజం మీద చేయి వేసి కుదు పుతూ లేపింది.

అప్పటికే ఆయన కళ్లు నీళ్లల్లో కొట్టుకొం టున్న చేప పిల్లల మాదిరి అయ్యాయి. ఊపిరి ఆడనట్లూ గొంతులో గరగరమంటు న్నట్లూ, దగ్గూ, ముక్కులోంచి నీరూ కారిపో తుంటే ఆయన ఒక్క ఉదుటున కుర్చీలోంచి లేచారు.

మిత్రవింద చప్పున ఆయన చేతిని గట్టిగా పట్టేసుకుంది. "మీరు రిలాక్స్ అవండి. మీకేమీ కాలేదు తాతగారూ, ఇదిగో ఇక్కడే మీ ఎదుట కూర్చుని ఉంటాను. కోపగించు కోకూడదు. ఎస్వీరంగారావుగారి లాంటి మీ పర్సనాలిటీకి డిప్రెషన్, ఫ్రస్ట్రేషన్ రాకూ డదు. అరే! ఇంత చిన్న మాటని హార్ట్ ఆఫ్ హార్ట్స్ తీసుకోకూడదు. ప్లీజ్ తాతగారూ రిలాక్స్"

ఆమె చేతికి విదిలించుకోబోయారు.

ఉడుం పట్టులా ఉంది మిత్రవింద చేతుల బలం.

నొసలు చిట్లించి కుర్చీలో కూలబడిపో యారు.

మిత్రవింద మళ్ళీ వంటింట్లోకి వెళ్లి రెండు కప్పుల టీ చేసి తెచ్చి "తీసుకోండి" అంది.

ఆయన 'టీ' తాగి హమ్మయ్యా అనుకు న్నాడు. ఆ తరువాత ఆ పిల్ల వైపు చూస్తూ "సో నువ్వు మీ ఇంటికి వెళుతున్నావు. ఈ ఇంట్లోంచీ, ఆ గేట్లోంచీ వెళ్ళిపోయాక నీదారి నీదీ నాదారి నాది. నాకేం భయం లేదు. భయంతో ఇంటికి రాననడం లేదు నేను. ఆ ఇల్లూ, పరిసరాలూ నా స్వర్గసీ మలు. వాటిని వదలడం నా వల్ల కాని పని".

"మరి సమస్య ఏమిటి? "

"వినే వాళ్ళకి చాలా చిన్నది. కానీ నాకు ప్రాణాంతకమైంది"

మిత్రవింద అక్కడినుంచి కదిలి వెళ్ళి వంటింటి వైపు ఉన్న మెట్ల మీద కూర్చుంది. గోళ్లకి వేసుకున్న రంగు వెలిసి పోయింది. మనసు గతంలోకి వెళ్ళింది. ఆరోజు తను అసలు స్టేషన్లో దిగిన వెంటనే ఆటోలో ఇంటికి వెళ్ళి పోవాలనే అను కుంది. తరవాత గుర్తు వచ్చింది. అది తన స్టేషన్ కాదని.

కంపార్టుమెంట్‌లో నానా రభసా జరుగు తుంటే మెల్లగా పై బెర్త్ మీంచి క్రిందికి దిగింది. తనని తను చూసుకుంటే సిగ్గుతో చచ్చిపోవాలనిపించింది. నడుము పై భాగం ఆచ్ఛాదన లేకుండా చిరిగి పోయిన చుడీదార్ రెండుగా విడిపోయి జుగుప్సాక రంగా వేలాడుతూంటే...

వెనక నుంచి శాలువ భుజాలు కప్పేస్తూ ముందుకు పడింది. తాతగారికి తను కప్పిందే. అక్కడే ఉంటే తనను గుర్తు పడ తారన్న భయంతో బ్రీఫ్‌కేస్ తీసుకుని అందర్నీ తప్పించుకుని బయట పడింది.

ఆటో మాట్లాడుతూంటే "నన్ను కూడా తీసుకెళ్ళమ్మా, రెండు రోజుల్లో నేను మా ఊరు వెళ్లిపోతాను" అన్న మాటలు వినిపిం చాయి. తల తిప్పి ఆయన వైపు చూసింది. ఆటో అతను మీటరు వేసి సుఖంగా కూర్చు న్నాడు.

మిత్రవింద ఇంటికి వెళ్లాలనే సంగతిని పూర్తిగా మరచి పోయింది. స్నేహితురాలు సత్యవతి దగ్గరికి వెళ్ళి ఏదో విధంగా మేనేజ్ చేసుకుంటే సాయంత్రానికి నీడ పట్టున ఇంటిదారి పట్టచ్చు. అంతవ రకూ ఇల్లు... నో...

"ఏమ్మా!" అవధాని గారు ఆశగా చూస్తున్నారు.

మిత్రవింద ఆటోలో కూర్చుని "పదండి," అంది. అసంకల్పిత ప్రతీ కార చర్య... ఆయన ఆటోలో కూర్చున్నాడు. తూరుపు చీకట్లోంచి బయట పడుతోంది.

మెదుల్లా అబ్లంగేటా ఊహు! పని చేయలేదా క్షణంలో

పెద్దాయన. అయినా నమ్మలేం.

నమ్మకం... ఆ వెనుక నవ్వు... ఎవర్నో నమ్మడం దేనికి? శంకిం చడం దేనికి?

చిన్నప్పుడు తెలుగు పాఠ్యపుస్త కంలో చదివింది. ఉన్న నీళ్ల కూడా దానం చేసిన మహారాజు "హరిశ్చంద్రుడా? కావచ్చు ఏళ్ల క్రితం మాట.

"మానవ సేవే మాధవసేవ'...

"మా ఫ్రెండ్ ఇంటికి వెడుతున్నాం మనం"

ఆయన ఇబ్బందిగా కదిలారు. "మిత్రా! నా దగ్గరనైతేనే డబ్బు లేదు. బాంక్‌లో వుంది. నీ ఋణం తీర్చుకునేందుకు రెండు రోజులు పడుతుంది. బిలీవ్ మి"

మిత్రవింద కంగారుపడ్డట్లు ఆయన మాటకి అడ్డుపడింది. " మా తాతగారు ఇలా లెక్కపెట్టుకోరు"

అవధానిగారు ఆమె వైపు చూస్తు "ఏమ న్నావు" అని అడిగారు.

"ఏముంది? మా తాతగారు ఇలా లెక్క పెట్టుకోరు అన్నాను అంతే" అంది.

"ముక్కూమొహం తెలీని వాళ్లదగ్గర తీసు కోవడం ఏం బావుంటుంది? "

## అది నీకైతే నాకెలా వస్తుంది?



విశ్వనాథ సత్యనారాయణ, మహాకవి శ్రీశ్రీ ఓ సభలో కలిశారు. 'శ్రీశ్రీ.. నాకు జ్ఞానపీఠం వచ్చినా అభినందించలేదేం? ' అడిగారు విశ్వనాథ.

'ఏకంగా భారతరత్న వచ్చాక అభినం దిద్దాం అనుకున్నాన్లెండి' అన్నారు ముసి ముసిగా నవ్వుతూ శ్రీశ్రీ.

'అది నీకోసం రిజర్వ్‌చేసి పెట్టారు కదా! నాకెలా వస్తుంది? ' తిప్పికొట్టారు విశ్వనాథ

"నేనిలాగే ఉంటాను. ఇలా చేయడం నాకు సంతోషాన్ని యిస్తుంది"

"ఇప్పుడో పని చేద్దామా" ఆయన అడి గారు.

"చెప్పండి"

ఆహారం (షర్టు) జేబులోంచి తన ఐడి కార్డు, డిశ్చార్జ్ సర్టిఫికేట్ తీసి చూపిస్తూంటే శ్రద్ధగా చూసింది. ఆయన రిటైర్ అయిన ప్పుడు మంచి రాంక్‌లో వున్నారు. 'ఇంత హోదా, రీవీ, డబ్బుని స్వంతం చేసుకున్న ఈయనకీ వయసులో ఏం కష్టాలో' అను కుంది ఆ తర్వాత ఆయనతో అంది. "వాటిని భద్రంగా దాచండి. మీరు నన్ను ఆదుకుని వుండకపోతే ఏమైపోయేదాన్నో తెలుసా"

"తెలుసు"

"చెప్పండి"

"రైల్లోంచి దూకేసేదానివి"

'అంత త్వరగానా? వాడిని దొరకబుచ్చుకుని అప్పుడు దూకే దాన్ని. తాతగారూ రోజూ ఎక్సర్‌సైజ్ చేసే బాడీ నాది. కరాటే నేర్చుకున్నాను. ఆ టైమ్‌లో ఇవేవీ పనిచేయలేదు. ప్చ్! వీరనారిలా ఎదురు తిరగాల్సిన నేను వానపాములా అయిపోయానేమిటో"

"అదంతే విధి"

"నా కాళ్ళు చచ్చుబడిపోయినట్లు వేలాడిపోయాయి. సత్తువ లేక ఢీలా పడిపోయాను తాతగారూ"

"ఇదే స్టేషనో కూడా చూడలేదు. అప్పుడు కంపార్ట్‌మెంట్‌లోకి ఎగిరిపడ్డాను. ఇప్పుడీ ఆటోలో కూర్చున్నాను. ఎటు వెళ్తున్నానో నాకే తెలీడం లేదు" అని చెప్పాడాయన.



"ముందు మా ఫ్రెండ్ ఇంటికి వెడదాం తాతగారూ. ఇది కాజీపేట జంక్షన్"

"మనం బండి ఎప్పుడు ఎక్కాం? "

"అంతా గందరగోళం వదిలేయండి"

"ఇక్కడినుండి హైదరాబాద్‌కు రెండున్నర గంటలకన్నా ఎక్కువ పట్టదే"

"మనింటికే వెళ్దాం"

"మనిల్లా" ఆశ్చర్యంగా చూసింది మిత్ర వింద.

"అవును" అని "ఆటో లెఫ్ట్" అన్నారు. కాజీపేట చౌరస్తా వచ్చాక. "నిన్నటి నుంచీ అలసిపోయి వుండటంవల్ల ఏదీ బుర్రకె క్కడం లేదు. చౌరస్తా మాత్రం గుర్తుప ట్టాను" అన్నారు.

పది నిమిషాల్లో ఇంటిముందు ఆగింది ఆటో. ఆ ఇంటిని మిత్రవింద తేరిపార చూసింది.

ఆ రోడ్ హైదరాబాద్ వైపు వెళ్తున్నది. వెనకవైపు వరంగల్‌కి వెళ్లచ్చు. రోడ్‌కు కుడి వైపున సివిలియన్స్ ఇళ్లున్నాయి. ఎడమ వైపు 'రైల్వే క్వార్టర్స్' వున్నాయి. రైళ్ళు రాక పోకలతో రాత్రీ పగలూ లేకుండా సందడిగా ఉంటుంది.

ఆకాశం నల్లటి దుప్పటి కప్పుకున్నట్లు పొగ మొత్తం ఆవరించింది. ఆ పరిసరాల వాసన కూడా గమ్మత్తుగా ఉంది. ఆటోలో నుండి బ్రీఫ్‌కేస్ తీసుకుని అతనికి డబ్బు ఇచ్చింది మిత్రవింద.

"రామ్మా" అవధాని గారు సాదరంగా పిలి చారు.

ఆటో శబ్దం విని పక్కింటివాళ్ళు తలుపు తీసి తొంగిచూసి "మీరా! రండి. బాబాయ్ గారు. ఈ సారి చెప్పాపెట్టకుండా వచ్చేశారే మిటి? ఫోన్ కూడా చేయలేదు. ఒక్క నిమిషం తాళం చెవి తెస్తాను" అని ఆ తొంగి చూసిన వ్యక్తి లోపలికి వెళ్ళి చప్పున వచ్చేసి తాళం చెవి అందించాడు.

"థాంక్స్ మూర్తీ" అన్నారు అవధానిగారు.

అతను లోపలికి వెళ్తూ "ఏమైనా కావా లంటే పిలవండి" అన్నాడు.

"అలాగే" అని తాళం తీసి ఇంట్లోకి ప్రవే శించారు. మిత్రవింద ఆయన వెనకే లోపల అడుగుపెట్టింది. అలా పదిరోజులు ఇక్కడే ఆయనతో ఉండిపోయింది. ఎప్పటికప్పుడు ఇంటికి ఫోన్ చేసి చెబుతూనే వుంది.

మిత్రవింద ఈ లోకంలోకి వచ్చింది ఇప్పు డింటికి వెళ్ళాలి.

మిత్రవిందకి ఎటూపాలు పోవడంలేదు. ఆయన రాత్రిళ్లు నిద్ర పోకుండా ఆరుబ యట మంచమీద వాలిపోయి రైళ్ళ రాకపో కలు గమనిస్తూ, ఆకాశంలో చుక్కల్ని లెక్క పెడుతూ మధ్యమధ్య స్టేషన్‌కి వెళ్ళి ఆ ప్లాట్‌ఫామ్ మీద చాయ్ కాఫీలు తాగుతూ కాలం గడిపేస్తున్నారు.

"ఇంటికి పోదాం పదండి" అంటే చాలు బలవంతంగా బడికి పంపే టైమ్‌లో మారాం చేసే పిల్లవాడిలా మారిపోతారు. కొడుకూ కోడలూ యిద్దరూ బాంక్‌లో పని చేస్తారని అద్దెకువుండే మూర్తిగారి తల్లి చెప్పింది.

హైదరాబాద్‌లో కొత్తపేట బాంక్ కాల నీలో స్వంత ఇంట్లో వుంటున్నారు. ఇక్కడ ఈ ఇల్లు కాక సిమెంట్ కంపెనీ దగ్గరో ఇల్లూ, సిద్ధార్థనగర్‌లో రెండిళ్ళూ వున్నాయి. వడ్డేపల్లిలో పదెకరాల భూమి కూడా ఉంది. బంధువులూ, స్నేహితులూ అంతా వు న్నారు. మరి అసంతృప్తీ, భయందేనికీ?

ఆమాట అడిగేసింది మిత్రవింద.

అవధానిగారు కూర్చున్నచోటు నుంచి లేచారు. చాలా సీరియస్‌గా వుందాయన మొహం. లోపలికి వెళ్లి అల్మారా తెరిచి చిన్న సూట్‌కేస్ తీసుకుని అందులో నాలుగు జతల బట్టలు సర్దుకున్నారు.

"నీ బట్టలు కూడా సర్దుకో మిత్రవిందా.

**చీమలో, బ్రహ్మలో శివకేశవాదులలో ఉండేది రాముడొక్కడే. – త్యాగరాజు**

నేను మీ ఇంటికి వస్తున్నాను. ఆ తర్వాత మా ఇంటికి"

"చాలా సంతోషం" అంది మిత్రవింద.

ఇల్లంతా సర్దేసి ఇద్దరూ బయలుదేరారు.

తాళం చెవి తీసుకుంటూ "మళ్ళీ ఎప్పుడు వస్తారు బాబాయ్" అని అడిగాడు మూర్తి.

"తెలీదు" నిర్లిప్తంగా అన్నారాయన.

సైదాబాద్‌లో ఓ ఇంటి ముందు ఆటో ఆగింది. అది రెండంతస్థుల ఇల్లు. ఇంటికి మూడువైపులా ఖాళీస్థలం, ఓవైపు సన్నని దారీ కనిపిస్తున్నాయి. షెడ్లో ప్రీమియర్ పద్మిని ఉంది. గేటు చప్పుడు విని తెల్లని పామిరేనియన్ డాగ్స్ భౌ, భౌమని అర వడం మొదలు పెట్టాయి. మిత్రవింద వచ్చిందని తెలిసినట్లు.

"ఈసారి లేటైంది. నీకోసం మీ తాతమ్మ కలవరిస్తోంది" తండ్రి పలకరించారు.

"నాన్నా ఎలావున్నారు? నన్ను కాపాడా రని చెప్పాను చూడండి ఈయనే. అవధాని తాతగారు" అని "నాన్నగారు పార్థసారథి" అంటూ పరిచయం చేసింది. ఆయన చేయి చాపి "చాలా సంతోషం" అన్నాడు.

"అమ్మ జయలక్ష్మి" అవిడా వచ్చేసింది.

ఆవిడ రెండు చేతులూ జోడించి నమ స్కారం చేసి కూతురి వైపు చూసి "ముందు మీతాతమ్మ గారినీ, నానమ్మా, తాతగారినీ పలకరించిరా" అని "మీరూ రండి," అంటూ అవధాని గారిని హాల్లోకి తీసుకువెళ్ళింది.

"అక్కా! ఎలావున్నావు?" చెల్లెలు అడి గింది.

"అత్తా నేను ఫస్ట్‌ప్రైజ్ తెచ్చుకున్నాను" అన్నయ్యకూతురు చెప్పింది.

"మిత్రా! ఎక్కడెక్కడికి వెళ్ళావు" పార్థసా రథి తమ్ముడు అడిగాడు.

"ఎటూ వెళ్ళలేకపోయాను బాబాయ్! కొత్త ఫ్రెండ్‌ని తీసుకువచ్చాను."

"విన్నాను. వస్తున్నాను" అన్నాడు బాబాయ్ శర్మ.

అవధానిగారు రెప్పవేయకుండా చూస్తు న్నారు. ఆ ఇల్లు పెళ్ళి వారిల్లులా వుంది. ఆ హోరు మరీమరీ వినాలనిపించే నయా గరా జలపాతంలా ఉంది. ఎంత ఆనందం! మనసు మారుమూలల్లోంచి తన్నుకు వస్తోంది. అసలు మనసెక్కడ ఉంటుంది? ఆ విషయమే గుర్తురావడం లేదు. ఇక్క డెంత బావుందో?

"ఇప్పుడేవస్తాను తాతగారూ" మిత్రవింద లేచి లోపలికి వెళ్ళింది.

"ఎవర్రా సారథీ" కళ్ళజోడు సరిచేసు కుంటూ వచ్చిన పెద్దావిడని పరిచయం చేశాడు పార్థసారథి. "మాబామ్మ"

"ఓ!" కనుబొమ్మలెగరేశారు అవధానిగారు

"మీరు మా మిత్రవిందని రైల్లో కాపాడా రని చెప్పింది"

"మీక్కూడా తెలిసిందామ్మా" అనేసి నొచ్చుకున్నట్లు ఆగిపోయారు.

"ఇంట్లో అన్ని విషయాలూ నాతోనూ, నా కోడలితోనూ, దాని కోడలు తోనూ చెబు తారండి. దాపరికాలులేవు"

"అదృష్టవంతులు"

"కూర్చో బామ్మా" పార్థసారథి ఆమె చేయిపట్టుకుని సోఫాలో కూర్చోబెట్టాడు.

ఆవిడ కూర్చుని "మారుతున్న కాలాన్ని చూస్తున్నాను. ఆ తరం వాళ్ళు చాలా మంది వెళ్ళిపోయారు. నేనోదాన్ని మిగి లాను. అదృష్టం బావుంది. మీరన్నట్లు, మా మనవడూ, వాళ్ళ పిల్లలూ ఇంకా విలువల్ని మరిచి పోలేదు. మా సారథి పెంపకం" అంది ఆవిడ.

"తాతమ్మా! ఇల్లంతా వెతికాను నీకోసం నువ్విక్కడున్నావా? మా తాతమ్మ" సంబ రంగా చెప్పింది మిత్రవింద.

లోపల్నించి మరోపెద్దావిడ వచ్చి ఆయ నకు నమస్కారం చేసి "మీకు అన్ని ఏర్పాట్లు చేశారు. మేడ మీద గదిలోకి వెళ్ళి మీ కార్యక్రమాలు పూర్తి చేసుకుని ఇక్కడకే వచ్చేయండి" అంది ఆవిడ.

అవధానిగారు ఆ విశాలమైన ఇల్లునీ, ఆ మనుషుల్నీ తేరపారి చూశారు. మళ్ళీ మళ్ళీ చూస్తూ ఆవిడ ఎవరో అన్నట్లు మొహం పెట్టారు. మిత్రవింద యిట్టేపట్టేసి "చిన్న నానమ్మ. నో గ్రాండ్ పా... నోచిల్డ్రన్. అందుకే డాడీ చూస్తున్నారు" అని "పదండి పైకి వెడదాం" అంటూ తీసుకు వెళ్ళింది.

అవధాని గారు పై నుంచే కిందికి చూశారు. రెండు మిక్సీలు పెట్టి ఇద్దరు ఆడ వాళ్ళు పప్పుగ్రైండ్ చేస్తున్నారు. అవతలి వైపు రెండు గాస్‌స్టౌల మీద వంటలు అవు తున్నాయి.

కాలేజ్‌లకీ, స్కూళ్ళకీ, జాబ్‌లకీ ఎవరి పనులకి వాళ్ళు బిజీగా వెళ్ళిపోతున్నారు.

అవధాని గారు అక్కడున్న సోఫాలో కూర్చున్నారు.

"మిత్రా! ఇంక దాపరికం దేనికీ, నేను కల లుకంటున్న స్వర్గం ఇదిగో ఇది. ఎంత హాయిగా వుందో తెలుసా. ఎవరికి వాళ్ళే అయినా అంతా ఒకటే. నేను కుళ్ళుకుంటు న్నాననుకోకు. నలుపో, తెలుపో నలుగురు పిల్లలూ. ముతకో సన్నమో నాలుగు గుడ్డలూ వుండాలని మా అమ్మ చెప్పేది. నాకు ఇక్కడే వుండిపోవాలనుంది. నేను ఎక్కడినుంచి పారిపోయానో చెప్పనా"

"అలాగే. కానీ యిప్పుడు కాదు. మీరు స్నానం చేస్తే టిఫిన్ కార్యక్రమం అయిపో తుంది, మళ్ళీమనం భోజనం చేసే వరకూ డిస్టర్బెన్స్ ఉండదు".

"కరెక్టే, మనవల్ల వాళ్ళు ఇబ్బంది పడకూ డదు."

ఆయన బాత్‌రూమ్‌లోకి వెళ్ళారు.

బాత్‌రూమ్‌లోంచి పాట వినిపిస్తోంది మిత్రవిందకి. కాజీపేటలో ఆయన 'హమ్' చేయడం తను వినలేదు. సంతోషం ఆయన అభిరుచుల్ని బయట పెడుతోంది.

"పియా మిలన్ కోజానా" తన్మయత్వంతో పాడుతున్నారు.

కింద పాతిన కొబ్బరి చెట్లు మేడ చుట్టూ వున్న రెయిలింగ్ వరకూ ఆక్రమించాయి. కొబ్బరి బొండాలతో నిటారుగా ఎదిగినా భారంగా కనిపిస్తున్నాయి.

రోజూ కొబ్బరికాయ పచ్చడే విసుగేరాదు. కోనసీమ నుంచి తెచ్చారు వాటిని. ప్రతి సంవత్సరం ఇంట్లో మామిడి కాయలతోనే ఆవకాయ పడిపోతుంది.

ఇటు బాంబే హైవే. అటు బెంగుళూరు హైవే. మూడో వైపు విజయవాడ హైవే. ఇలాభూమి కొన్నారు. నాలుగో వైపు ఎందుకు కొనలేదని అడిగితే వాస్తు-నక్షత్రం అంటారు.

మిత్రవింద తలుపు చప్పుడికి ఇటు చూసింది. లాల్చీ పైజామా వేసుకున్న అవ ధానిగారు టవల్‌తో జుట్టు తుడుచుకుంటు న్నారు.

మెట్లమీద పార్థసారథి చెప్పుల చప్పుడు వినిపించింది.

"నాన్నవస్తున్నారు, మీరు కూర్చోండి" అంది మిత్రవింద.

అవధాని గారికి అయోమయంగా ఉంది. పారిపోయిరావడం తనలాంటి బాధ్యతగల పౌరుడు చేయాల్సిన పనికాదు. పోలీసులు వెంటబడి తరిమితరిమి పట్టుకుంటారు. ఆ పైన ముందూ వెనుకా చూడకుండా చితక బాదుతారు.

తన మటుకు తను నిర్దోషి. కానీ డిపార్ట్ మెంట్ అలా అనుకోదే.

"మిత్రా! టిఫిన్ రెడీ, తాతగారిని తీసుకు వచ్చేయ్." కిందినుంచి వదిన పిలుస్తోంది.

"వస్తున్నా వదినా,"

అవధానిగారు లేచి కిందకు వెళ్ళేందుకు సిద్ధం అయారు. "పదండి" మిత్రవింద ఆయనతో కిందికి దిగింది. ఆవెనుకే వస్తున్న పార్థసారథి నెమ్మదిగా అన్నాడు "పదిహేను రోజుల క్రితం మీ ఫోటో పేపర్లో చూశాను"

హడలిపోయారు ఆయన. మిత్రవిందని వెళ్ళనిచ్చి పార్థసారథి చేతుల్ని దొరక పుచ్చు

కుని "ప్లీజ్ ఫర్‌గెట్‌యిట్, లెట్ మీ స్టే హియర్... ముఝే బచావ్ ... నన్ను కాపాడు నాయనా!" కంఠం వణుకుతూంటే కళ్ళల్లో నీటిపొరలు పొగమంచులా అలుముకున్నాయి.

"ఆచూకీ తెలిపిన వారికి లక్ష రూపాయలు నగదు బహుమతి ఇస్తామని కూడా రాశారు"

ఆ పెద్దాయన దాచుకున్న కన్నీళ్ళు 'టప టపా' రాలి పార్థసారథి చేతుల మీద పడ్డాయి.

కత్తితో పొట్టలో పొడిచినంత బాధేసింది పార్థసారధికి.

"నన్ను భయపెట్టకు పార్థసారధీ. వాళ్ళు లక్షే ఇస్తామన్నారు. నేను పాతిక లక్షలు ఇస్తాను. నన్ను ఈ ఇంట్లో వుండనీయి. నన్ను. నన్ను కాపాడు" పదే పదే అంటూ కాళ్ళమీద పడబోయాడు. పార్థసారధి చప్పున పట్టేసుకుని దగ్గరకు తీసుకున్నాడు.

"ఎక్జయిట్ కావద్దు. మీరు పారిపోయి వస్తున్నారంటే అందుకు తగిన కారణం ఉంటుంది. భయపడద్దు. నా వల్ల మీకు కీడు జరగదు. మీరు ఈ ఇంట్లో నిర్భయంగా వుండచ్చు. స్వేచ్ఛగా తిరగొచ్చు. సరేనా... మిగిలిన విషయాలు తరువాత మాట్లాడుకుందాం"

అవధాని గారు చేతిలో వున్న తువ్వాలుతో మొహం తుడుచుకున్నారు. డైనింగ్ హాల్లో అందరూ అవధాని గారి కోసం ఎదురుచూస్తున్నారు.

ఆయన వచ్చి కూర్చున్నాక గానీ వాళ్ళు టిఫిన్ ముట్టుకోలేదు.

పార్థసారధి కూర్చున్నాక తన పిల్లలతో తమ్ముడి పిల్లలతో అక్కడున్న మరదలితో, ఒకరేమిటి అందరికీ పేరుపేరునా చెప్పారు.

"ఈయన మీ తాతగారు, నాకు వరసకు బాబాయి. ఈయన్ని మీరందరూ జాగ్రత్తగా చూసుకోవాలి. ఆయనతో చదరంగం ఆడాలి. ఆయనకి కావలసిన నవలలు లైబ్రరీ నుంచి తెచ్చివ్వాలి. సాయంత్రం పూట షికారుకి తీసుకువెళ్ళాలి."

"అలాగే అన్నయ్యా"

"సరే పెదనాన్నగారూ"

"మంచిది బావగారూ" అందరూ చెప్పారు.

మిత్రవింద తండ్రి మొహంలోకి చూసింది.

ఆయన నిశ్చింతగా కనిపిస్తున్నాడు. అవధాని గారు మాత్రం కళ్ళు మూసుకుని "ఈ క్షణం జారిపోకుండా గట్టిగా పట్టుకోగలిగితే... భగవంతుడా! మనిషిని పుట్టించి ఎందుకయ్యా చోద్యం చిత్తగిస్తావ్." అనుకుంటున్నారు. ఆ రాత్రి డాబా మీద పక్కలు వేసుకున్నారు. వాళ్ళంతా ఇంట్లో పని చేసేవాళ్ళే. అవధాని గారు తనూ అక్కడే పడుకుంటానని పార్థసారధితో అన్నారు.

"అక్కడ మధ్య రాత్రివేళ దోమలు కుడతాయి. పనివాళ్ళకి అలవాటైపోయింది. మీకు ఈ ఆరుబయట పడుకోవడం అలవాటు వుందో లేదో".

"అందుకు కాదు" ఆయన ఇబ్బందిగా గది గోడలని చూస్తున్నారు.

పార్థసారధి టేబిల్ దగ్గర ఖర్చులు రాస్తున్నాడు. తన ఎదుట అవధాని గారు తప్పు చేసిన వాడిలా నిలబడడం నచ్చలేదు అతనికి. అక్కడినుంచి లేచి వచ్చి "మీరు ఇబ్బంది పడతారని వద్దన్నాను. మీకెలా బాగుంటే అలాగే చేయండి. మీకు సాయంగా మా పెద్దవాడిని పడుకోమని చెప్పనా" అని అడిగాడు.

"ఓ గంట సేపు ఆ వాతావరణంలో మిత్రవిందతో, ప్రభుతో మాట్లాడాలనీ"

"అలాగే వాళ్ళని పిలిచి చెప్పనా"

అవధాని గారి మొహం వెన్నెల వెలుగైంది.

పార్థసారధి తలతిప్పి "నేనూ రానా... మీరు చెప్పేది వినాలని ఉంది..." అని అడి

గాడు.

తల ఊపి "తప్పకుండా వినాలి. జీవితం ఎన్ని మలుపులు తిప్పుతుందో తెలుసుకుంటే నమ్మలేం. ఒక్కో జీవితం ఒక్కో గ్రంథం లాంటిది. ఎంతమందిని పరిచయం చేసుకుంటామో అన్ని గ్రంథాలని అధ్యయనం చేసినట్లు, ఈ కథలన్నీ పునాదిరాళ్ళ వంటివి" అని "విసిగిస్తున్నానా? " అన్నారు.

"లేదు.. లేదు. పెద్దల మాటలు చద్దిమూటలన్నారు. వినడం వల్ల జరిగే నష్టం అంటూ ఉండదు"

ఇద్దరూ కలిసి మేడ మెట్లు ఎక్కుతున్నారు. చల్లని గాలి చెవి పక్కనుంచి దూసుకుపోతుంటే ప్రాణానికి హాయిగా ఉంది. విరజాజీ, ఛమేలీ, రాత్‌కీ రాణీ సువాసనలు వెదజల్లుతున్నాయి.

అడుగులో అడుగు వేస్తూ, సువాసనల్ని ఆస్వాదిస్తూ, ఉత్సాహంగా డాబా మీదకి చేరుకున్నారు ఇద్దరూ.

పగలంతా పనిచేయడం వల్లా, జోకొట్టే చిరుగాలి వల్లా ఇలా పడుకున్నారో లేదో అలా గురకపెడుతూ గాఢ నిద్రలోకి చేరిపోయారు అంతా.

పనివాళ్ళ చేత పక్కలు వేయించి అవధాని గారికోసం ఎదురుచూస్తోంది మిత్ర. ఆమెతోబాటు ఆమె అన్న ప్రభు కూడా ఆసక్తిగా ఉన్నాడు.

"మేము ఇలా కూర్చుంటాం. మీరు రిలాక్స్ అవండి. ఆ పైన చెప్పండి. పేపర్లో వచ్చిన వార్త వీళ్ళు కూడా చూశారు. ఆడవాళ్లు ఇంటి పనుల్తో బిజీగా వుంటారు కనుక వాళ్ళు చూడలేదు" పార్థసారథి ఆయనతో అన్నాడు.

అవధానిగారు చుట్టూ చూశారు. చీకట్లో మొహాలు స్పష్టంగా కనిపించడంలేదు. దీర్ఘంగా నిట్టూరుస్తూ 'చాలా కష్టం... పార్థసారథీ చాలా కష్టం. ఈ మనుషులెందుకిలా ప్రవర్తిస్తారు? ఈ వార్ధక్యం ఉంది చూడు. ఇది ఒక్క రోజులో దబేల్నపడ్డ భూతం కాదు. పుట్టినప్పుడు దబ్బపండులా ఉండేవాడినని అమ్మ చెప్పేది. ఈ డెబ్బై ఏళ్ళ వయసులో వడలిపోయిన పనసపండులా అయిపోయాను. నేను ప్రేమించి పెళ్లి చేసుకున్న విక్టోరియా నా అందాన్ని తెగపొగిడేది..." అని ఆపారాయన.

"విక్టోరియా" పార్థసారథి ఆశ్చర్యంగా అడిగాడు.

అవధానిగారు హాయిగా నవ్వారు. "యాభై ఏళ్ళపైనే అయింది. లోకం ఎంతో మారింది అనుకుంటాం. కొంచెం కూడా మారలేదు. ఆనాడు జనం ఎంత ఆశ్చర్యపోయారో ఇప్పుడూ అదే స్థితిలో వున్నారు. 'సేమోల్డ్ స్టోరీ'- ప్రేమకి కాలంతో పని లేదు. రెండు హృదయాలు ఏకమవడం, నమ్మకంతో పెళ్ళి చేసుకోవడం షరా మామూలే.

అప్పట్లో మా అమ్మ నాకు వంటింట్లో భోజనం పెట్టేది కాదు. నా కంచం నేను కడుక్కునేవాడిని. విక్టోరియా అత్తవారి యింటి పద్ధతుల్ని నేర్చుకున్నా అమ్మ ఒప్పుకునేది కాదు. నాన్న ఆమెకి సర్దిచెప్పేలోగా నరసింహం పుట్టాడు"

"నరసింహం పేరు పెట్టి మీ పేరెంట్స్‌ని బుట్టలో వేసుకున్నారన్నమాటకదూ! తాతగారూ" మిత్రవింద అంది.

ఆయన కంగారు కంగారుగా "నో మిత్రవిందా. అది హిందూ ధర్మం. పెద్దవాళ్ళ పేర్లు పెట్టుకోవడం అనేది సంప్రదాయం. ఆ పిల్లలు తాత ముత్తాతల మాదిరి కీర్తీ, ఆయుష్షు తెచ్చుకోవాలనీ అందుకు నాన్న గారి పేరు పెట్టుకున్నాం," అన్నారు

"తర్వాత"

"ఏముంది? అమ్మ మూఢాచారాల్ని తుంగలో తొక్కేసింది"

**ఇంట్లో ఒక్క శత్రువుకంటే బయటి వెయ్యి మందినయినా భరించవచ్చు.**

**– అరబ్బీ సామెత**

"ఆ ఇల్లు ఎంత బావుండేదని. ఇదిగో పార్థసారథీ అచ్చం ఈ ఇల్లులాగే వుండేది. పిల్లలు పెరిగి పెద్దవాళ్లవడం కూడా తెలీనంత వేగంగా కాలం కరిగిపోయింది".

"విక్టోరియాకి 'ఇండియా ఇష్టం'... దేశ భక్తి ఎక్కువ. నేను ఎయిర్‌ఫోర్స్‌లో చేరాను. తన ఇష్టం నన్ను సంతోష పెట్టేది. తొమ్మిదిన్నర సంవత్సరాలు చేశాను. " ఆ సెలవలకి నేను ఇంటికి వచ్చేసరికి నాన్న మంచాన పడ్డారు. ఆ తర్వాత అమ్మ"

"ఆ ఇల్లు ముక్కలైంది. మా వాటాలో మేము సెటిల్ అయిపోయాం. మా ఇంట్లో జీన్స్ ప్రభావం కాబోలు. ఒక్కొక్కళ్ళమే పుట్టాం. ఆడపిల్లల్లో మాత్రం పిల్లలకి కరువులేకపోయింది"

"మీ నరసింహం ఏడి తాతగారూ" ప్రభు అడిగాడు

"నరసింహం బాగానే ఉన్నాడు. ఉద్యోగ రీత్యా ఎన్నో ప్రదేశాలు తిరిగాడు. వాడికి ముగ్గురు పిల్లలు. వాడి భార్య బాగా చదువుకుంది. వీడికి ముగ్గురు పిల్లలు పుట్టినప్పుడు ఎంత సంతోషపడ్డామో! అందర్నీ పీడించే ఆర్థిక సమస్యలు మాకు లేవు."

పార్థసారథి దీర్ఘంగా నిట్టూర్చాడు. ఆయన పారిపోవడం సంగతి విన్నప్పుడే ఆయన మానసిక స్థితి అర్థం అయిపోయింది.

"మనకి కావల్సింది దొరకనప్పుడు ఎంతకైనా తెగిస్తాం. నేనూ అదే పని చేశాను"

ఎన్నాళ్ళనుంచో దాచుకున్న బాధని ఇప్పుడు చెబుతున్నారు

"ఆ నరకకూపంలో నేను వుండను. వుండలేను. అంతకంటే చావడం నయం. నా శరీరం మీదా, నా మనసు మీదా నాకే సర్వహక్కులూ, అధికారాలూ వున్నాయి. వాటిని దోచుకోవాలని ప్రయత్నం చేస్తే నేను పారిపోతాను"

పార్థసారథి ఆయనకి దగ్గరగా జరిగాడు. భుజం మీద చేయి వేసి తట్టి "రిలాక్స్... రిలాక్స్... మీరు ఆవేశపడవద్దు సరేనా? " అన్నాడు.

ప్రభు కూడా ఆయనకి దగ్గరగా జరిగాడు.

మిత్రవింద " అరే! తాతగారూ నేను చెప్పలేదూ! మనిషి తోడుంటే సింహబలం వస్తుందని, మీరు డీలా పడిపోవడం, నిస్సహాయంగా చూడడం ఏమీ బాగాలేదండీ! మీకు ఓ సహాయం చేయనా? " అని అడిగింది.

"ఏం సహాయం మిత్రా" ఆశగా అడిగారు.

"ముందాయన బాధని చెప్పనీ, మనసు తేలికపడుతుంది" అన్నాడు పార్థసారథి. "మీరు చెప్పండి" ఆయనవైపు తిరిగాడు.

అవధానిగారు మరచెంబులో నీళ్ళు గ్లాసులో పోసుకుని రెండు నిమిషాల్లో తాగేశారు. ఆ తర్వాత పార్థసారథిని అడిగారు. "మన పంచతంత్రంలో ఓ చోట వినిపిస్తుంది. కొత్తగా వచ్చిన వాళ్ళని నమ్మకూడదని. మీరింతగా నమ్మేసి నన్ను ఇంటిలోపలి వరకూ తీసుకువెళ్ళిపోయారు. ఇలా ఎవరిని పడితే వాళ్ళని నమ్మేయడం మంచిది కాదేమో? "

పార్థసారథి నవ్వి "ఆ కథలు అందరం చదువుతాం. మన పూర్వీకులు మన కోసం వదిలేసిన అపార సంపదలు అవి. మన సంస్కృతి ఈ భూమ్మీదా, నదీ జలాల్లో ఎక్కడపడితే అక్కడ కనిపిస్తుంది. అందర్నీ నమ్ముతామో లేదో తెలీదు. ఎదుటివాడు అల్లాడిపోతూంటే చూస్తూ ఊరుకోలేం. అయినా ఒకటి మాత్రం నిజం. అందర్నీ పిలిచి, వాళ్ళని ఆదుకునీ ఏదో దేశోద్ధరణ చేస్తున్నాం అనే ఉద్దేశ్యంతో మాత్రం కాదు. ప్రతి పరిచయానికీ బంధానికీ ఓ కారణం ఉంటుంది. ఆ కారణం మాత్రం మన చేతుల్లో లేనిది" అన్నాడు.

ఆకాశంలోంచి ఉన్నట్లుండి టపటపామని నీటి చుక్కలు పడ్డాయి. ఉలిక్కిపడ్డారు నలుగురూ. హఠాత్తుగా మీద పడ్డ వర్షానికి

"ఇలాంటి రోజుల్ని సింహం పెద్దవాడై పెళ్ళి చేసుకున్నాక మేము ఎప్పుడూ చూడలేదు. బిజీ... బిజీ... రూపాయిని గుణిస్తూ రూపాయలు గడిస్తూ, క్షణం తీరికలేక ఊపిరి సైతం పీల్చుకోలేనంతగా సతమతం అయిపోతూ"

కొంచెం ఆగి మళ్ళీ అన్నారు. "పొద్దున బయలుదేరేటప్పుడు బై అనడం, రాత్రి గుడ్‌నైట్ చెప్పడం వీటినే చూశాం. వాడికీ పిల్లలు పుట్టారు. ఆ పిల్లల మధ్యలో ఇరుక్కుపోయి వాడు మాకు మసకబారిపోయి మా దగ్గరకి వచ్చి ఐదంటే ఐదు నిమిషాలు కూర్చుని మాట్లాడడం నాకు తెలీదు"

పార్థసారథి మధ్యలో అన్నాడు. "కాలంతోబాటు మనం కూడా మారాలండీ. మన అభిరుచుల్ని వీళ్ళమీద రుద్దితే ఏం బాగుంటుంది? ఆలోచించి చూడండి"

"ఆలోచించే మాట్లాడుతున్నాను. తల్లీతండ్రితో వెళ్ళిన పిల్లలు, తల్లీ తండ్రీతో కలిసి వస్తారు. ఇంట్లో మా కోసం పనివాళ్ళుంటారు. వాళ్ళు స్వంత వాళ్ళెలా అవుతారు?"

"అదిగో! అదే తప్పు, మన ఇంట్లో పనిచేస్తున్న వాళ్ళు మనవాళ్ళెందుకు కారు? మనం వాళ్ళని గజం దూరంలో నిలబెడితే వాళ్ళు మైలుదూరంలో వుంటారు. మనక్కావలసిన ఆనందం వాళ్ళ దగ్గర దొరుకుతుందేమో ఆలోచించండి."

"ఊఁహు... ఇలా సినిమాల్లోనో, కథల్లోనో జరుగుతుంది కానీ యథార్థ జీవి

## నువ్వే వంగాలి..



సుమారు నాలుగున్నర దశాబ్దాల క్రితం ప్రభుత్వం తరపున ఆంధ్ర సారస్వత పరిషత్‌హాలులో ప్రముఖ తెలుగు కవిపండితులకు సన్మానాలు జరుగుతున్నాయి. సన్మానకర్త నాటి కేంద్ర సమాచారశాఖామాత్యులు, విఖ్యాత సాహితీవేత్త బెజవాడ గోపాలరెడ్డి. సన్మాన గ్రహీతలలో విశ్వనాథ, దివాకర్ల వెంకటావధాని, దాశరథి, గడియారం శేషశాస్త్రి, కప్పగంతుల వంటి హేమాహేమీలున్నారు. ఒక్కొక్కరివద్దకూ గోపాలరెడ్డి రావడం.. వారు లేచి నిలబడడం.. ఆయన శాలువా కప్పి సత్కరించడం జరుగుతోంది.

ఆయన తనవద్దకు వచ్చేసరికి విశ్వనాథ, 'ఇదుగో అబ్బాయ్.. నేను లేవను.. నువ్వే వంగి శాలువా కప్పాలి..'అన్నారు దర్పంగా. కవులు అందరికన్నా గొప్పవారన్నది ఆయన మాటల్లోని ఆంతర్యం. సాహితీవేత్త కనుక, కవులవిలువ, ఘనత తెలిసినవాడు కనుక బెజవాడ గోపాలరెడ్డి అలాగేనంటూ నవ్వుతూ విశ్వనాథను కూర్చోపెట్టే సత్కరించారు. నిజమే ఆ ధీమా విశ్వనాథకే సొంతం.

పడుకున్నవాళ్ళు లేచి చుట్టూ చూసి మళ్ళీ పక్కల్లోకి దూరిపోయారు.

అంతలోనే వెలిసిపోయిన వర్షం నేలమీదకి సువాసనల్ని వదిలిపెట్టింది. ఆ గాలిని పీల్చుకుంటూ 'అబ్బ' అన్నారందరూ.

తంలో మాత్రం కాదు."

"మీరు చాలా అశాంతిగా వున్నారు."

"అవును చాలా చాలా అశాంతి. ఒళ్ళు భగ్గుమని మండే అశాంతి. నిప్పులు చెరుగుతున్న మంటలు... విక్టోరియా నా విక్టోరియా ఎంత గొప్ప వ్యక్తో తెలుసా పార్థసారథీ"

"చెప్పండి" అన్నాడు ప్రభు. మానవ సంబంధాలు. ఇదేం కొత్త విషయం కాదు. ఎక్కడో ఓ చోట యిలాంటి సంఘటనలు జరుగుతూ వుంటాయి. సర్దుకుపోవాలి.

"నాకు వంట్లో బాగులేదని విక్టోరియా నా మంచం దగ్గరే రాత్రీ పగలూ గడిపేది. వారం రోజులైనా జ్వరం తగ్గలేదు. కోడలు విసుక్కోవడం కూడా పట్టించుకునేది కాదు విక్టోరియా. డాక్టరు ఠంచనుగా వచ్చి వెడుతున్నాడు. పెద్దవాడినయ్యానని బంధువులు కూడా చూసి వెళ్ళారు. కానీ" అని ఆపేశారు. కళ్ళలో నీళ్ళు తొణుకుతున్నాయి. అవి బయటికి రాలేక గుండెల్లోకి జారిపోలేకా యిబ్బంది పెడుతున్నాయి.

పార్థసారథి ఆలోచిస్తున్నాడు. పాపం ఓల్డ్ యేజ్ సెంటర్‌లో ఈయన కోసం ఎంత బాధపడుతున్నారు. రాత్రీ పగలూ నిద్రలేక ట్రస్ట్ మెంబర్స్, బాలసుబ్రహ్మణ్యంగారూ వీళ్ళంతా డబ్బుని మంచినీళ్ళలా ఖర్చుపెడుతున్నారు. ఈయన ఆచూకీ కోసం చేయాల్సిన పనులన్నీ చేస్తున్నారు. ఆఖరికి కన్నకొడుకు కూడా "ఆచూకీ తెలియజేయండి" అంటూ పేపరుకి యిచ్చాడు.

ఇంతమంది మనస్తాపానికి కారణం అయిన అవధానిగారు తన యింట్లోకి ప్రవేశించారు.

అంత మందికి నిద్రాహారాలు లేవు.

"పోనీ ఆచూకీ చెప్పేస్తే"

ఛ! తనంత నీతి లేని మనిషి కాదు. ఆ పెద్దాయనకి చేతనైన సహాయం చేయాలి. పోనీ పెద్దాయన యిక్కడే వుంటానని చెబితే అలా చేసినా బాగానే ఉంటుంది.

"నాకొడుకు తన పని తను చేసుకుపోయే గడియారంలా ఠంచనుగా రెండు సార్లూ కనిపించి "ఎలా వున్నారు నాన్నా, అనీ "మరి వుంటాను గుడ్‌నైట్" అనీ చెప్పేవాడు. ఈ డ్యూటీ టైప్ ఆఫ్ రిలేషన్ నన్ను నరకంలోకి తోసేసేది. అప్పటికీ విక్టోరియా వాడితో ఘర్షణ పడేది".

"మీ నాన్న దగ్గర ఐదు నిమిషాలు కూర్చోలేవురా? ఎందుకిలా ప్రవర్తిస్తావు? నిన్నేమైనా యిది కావాలీ, అది కావాలీ అని అడిగామా? కొంచెం ప్రేమగా మాట్లాడితే బావుండును అనుకుంటున్నాం. ప్రేమరా... ప్రేమ. మాక్కావలసింది మా కన్నకొడుకు ప్రేమ. దాని కోసం మేం బిచ్చమెత్తాల్సిన పరిస్థితి వచ్చింది. మా ఖర్మ కాదూ యిది? "

"అబ్బబ్బ! ఎందుకమ్మా యిన్ని మాటలు. మీతో ఏం మాట్లాడతాను? మన మధ్య మాటలేం ఉంటాయి? ఏ టాపిక్ ఉంటుంది చెప్పు" అనేవాడు.

"స్టాప్ స్టాప్ ఐసే స్టాప్ సింహం. తల్లితండ్రుల్ని ప్రేమించిన శ్రవణుని కథ విన్నావా? అంత ప్రేమ కూడా అఖ్ఖర్లేదు. ఛ! నీతో గొడవేమిటి? యుకెన్ గో నౌ" అనేదామె.

"థాంక్స్" అని వెళ్ళిపోయేవాడు.

ఆ తర్వాత విక్టోరియా మూగదైపోయింది." అవధానిగారు చెప్పటం ఆపారు.

పార్థసారథి టైమ్ కోసం వాచీ చూసుకున్నాడు. పదకొండు గంటలు దాటిపోయింది.

"ఆ తర్వాత" మిత్రవింద అడిగింది.

"ఓ రోజు ప్రొద్దున్నే విక్టోరియాని లేపేందుకు వెళ్ళాను. పది నిమిషాలు వరకూ ఈ ప్రపంచంలోంచి వెళ్ళిపోయిందన్న విషయాన్ని గమనించలేకపోయాను"

"పిటీ" మిత్రవింద అంది.

"ఆ ఇంట్లో నాకు నేనే పరాయివాడినైపో

యాను. అంతవరకూ నా చుట్టూ తిరుగుతూ తన ప్రేమ సామ్రాజ్యంలో నన్ను చక్రవర్తిగా నిలబెట్టిన నా విక్టోరియా నన్ను అన్యాయం చేసి ఒంటరిగా మిగిల్చి వెళ్లిపోయింది. నన్ను మోసం చేసింది. తనే వుంటే యివాళ దొంగలా ఎక్కడెక్కడో తల దాచుకోవడం జరిగేది కాదు"

ఆయన కోపం తారాస్థాయిని చేరుకుంటోంది.

"పొద్దున్నే కాఫీ కోసం కాలు కాలిన పిల్లిలా తిరుగుతూంటే ఎప్పటికోగానీ రాదు, ఇవి చిన్న చిన్న విషయాలే. అలవాట్లన్నీ ఎడిక్షన్‌లాంటివి. అంతసేపు ఎదురుచూడడం నరకం కాదూ! నా బట్టలు ఎక్కడ పెడతారో తెలీదు. ఇవన్నీ నన్ను కలవరపెడుతున్నాయి. అసలు యివేవీ కారణాలు కావు పార్థసారథీ! నన్ను పీడిస్తున్న ఒంటరితనం, వాళ్ళెవరూ నన్ను కుటుంబంలో ఓ సభ్యుడిగా 'ట్రీట్' చేయడం లేదని, అక్కడికీ నాకోసం ఓ 'కేర్ టేకర్'ని పెట్టుకున్నాను. దానికి వాళ్ళు డబ్బు దండగ ఎందుకు అని అతని ఎదుటే పదిసార్లు అంటూంటే అతను జీతం కూడా తీసుకోకుండా వెళ్ళిపోయాడు. ఎందుకిలా చేయాలి పార్థసారథీ! అమ్మ పెట్టదు, అడుక్కు తిననీయదు అన్నట్లుంది!!

"మీరు సర్దుకుపోవలసింది సర్. కోడలు కూడా మనమ్మాయిలాంటిదే అనుకుని మీరే చొరవ తీసుకుని మీక్కావలసినవి అడిగి తీసుకోవలసింది. మీరూ బిడియపడితే ప్రాబ్లమ్ ఎలా సాల్వ్ అవుతుంది కొంచెం ఆలోచించండి"

"పార్థసారథీ! అదీ ప్రయత్నం చేశాను. మీరు చీటికీమాటికీ కాఫీ, టీ అడక్కుండా ఫ్లాస్క్‌లో పోశాను. హాట్ పాక్‌లో పెట్టాను. ఫ్రిడ్జ్‌లో పెట్టాను అని చెప్పింది కోడలు. ఆ పిల్లని తప్పుపట్టడం లేదు నేను. భోజనం చేసేప్పుడు నేనొక్కడినే డైనింగ్ టేబిల్ మీద ఉండాలి".

"మీరు ఇష్యూని కాంప్లికేట్ చేస్తున్నారు. మీరు మీ పరిధిలోంచి బయటికి వచ్చే ప్రయత్నం చేయండి. సాయంత్రం మొక్కలకి నీళ్ళు పోయండి. పిల్లలతో కాసేపు కాలం గడపండి"

"ష్..." అలసిపోయారు అవధానిగారు. "వాళ్ళని దగ్గరకే రానీయరు. వాళ్ళు చదివే ఇంతోటి చదువుకూ గోల్డ్ మెడల్ ఇచ్చేయాలనుకుంటారో ఏమో. ఎప్పుడూ చదువూ.. చదువూ. ఇదే ధ్యాస. ఆ పసిపిల్లలు "తాతగారూ" అంటూ రావడం నాకు తెలీదు. పార్థసారథీ ఇక నేను చెప్పలేను. అలసిపోయాను"

ప్రభు నిట్టూర్చి "ఖర్మరా దేవుడా" అనేశాడు.

"ఖర్మే! ఆ రోజు నా చెవులారా విన్నాను. రహస్యం అయితే వినిపించకపోయేది. కావాలనే అన్నారు. నేను వినాలనే"

"చెప్పండి" అంది మిత్రవింద. ఆయన చెప్పడం మొదలుపెట్టారు. "ఈ రోజుల్లో వోల్డ్ ఏజ్ హోమ్స్ బోలెడు కనిపిస్తున్నాయి. మనం మన పనుల్లో మునిగిపోతుంటే... ఇంట్లో పెద్దవాళ్లని నిర్లక్ష్యం చేస్తున్నాం అన్న బాధ పీడిస్తోంది. సింహం డియర్ మీ నాన్నగారిని అందులో చేరుద్దామా"

"నీ ఇష్టం జానీ"

"మనం వారం వారం వెళ్ళి చూడచ్చు. అక్కడ ఉండే వాళ్ల ఏజ్ గ్రూప్‌తో సుఖంగా ఉంటారు. మనల్ని కన్నవాళ్ళనీ మనం కన్నవాళ్ళనీ ఒకే రకంగా చూస్తున్నట్లుంటుంది. చిత్రం కదూ. పిల్లల్ని మొన్నటిదాకా 'క్రెచ్'లో ఉంచి బాధపడేవాళ్ళం. ఇప్పుడు మామయ్యగారి కోసం. ప్చ్ ఏవిఁటో జీవితం"

"నిజం... నిజం"

"తందానా'కి 'తాన' అనడం తప్ప నా కొడుక్కి ఏమీ రాదు. వాళ్లని చూస్తే 'బూచాళ్లని' చూసినట్లుండేది. ఓ ఫైన్

మార్నింగ్ నాకు ఇష్టమని లడ్డూ కోవాలు చేయించారు. నాకిష్టం అని గ్లాస్కో బట్టలు తీసుకువచ్చారు. నన్ను ఆ ఓల్డ్ఏజ్ హోమ్‌లో వదిలేశారు"

"వాళ్ళున్న ఇల్లు నాది. వాళ్ళు ఖర్చుపెడుతున్నది నా డబ్బే. ఇంటి ఖర్చుల్ని నేనే భరిస్తే అది వాళ్లకి లాభం కాదూ. ఇవన్నీ ఎందుకు చేశానని? గుప్పెడు ప్రేమ కోసం"

పార్థసారథి మరోసారి టైం చూసుకున్నాడు. ప్రభు గట్టిగా ఆవులించాడు. మిత్రవింద కూర్చున్నదల్లా మెల్లగా నేలమీదికి జారింది.

"కొన్నాళ్ళుంటే నాకు పిచ్చేక్కేది" అని నిట్టూర్చి "పార్థసారథీ" పిలిచారు అవధానిగారు.



"చెప్పండి" పార్థసారథికి ఎవర్నీ నొప్పించడం ఇష్టం ఉండదు.

"మరోసారి... పార్థసారథీ! ఐ యామ్ థాంక్‌ఫుల్ టు యు... నన్ను కనీసం పదిహేను రోజులు మీ ఇంట్లో ఉండనీయి. నాకేం కావాలో అది ఇక్కడ కనిపిస్తోంది. ఓన్లీ పదిహేను రోజులు. నిన్నుగానీ, కుటుంబసభ్యుల్నిగానీ ఇబ్బంది పెట్టను. ప్లీజ్"

"ఓ గాడ్" పార్థసారథి అన్నాడు. "మీకు ఇక్కడ బావుంటే, నో ప్రాబ్లమ్. మన వాళ్ళకి ఇబ్బంది అనిపిస్తే దానికి ప్రత్యామ్నాయంగా మరో ఉపాయం ఆలోచిద్దాం"

"గుడ్‌నైట్"

"గుడ్‌నైట్"

ఆ గుడ్‌నైట్‌తో గుండెల మీద చేయి వేసుకున్నారు మిష్టర్ అవధాని.

★ ★ ★

గురువారం రాగానే మహేంద్రకి మనసంతా హాయిగా ఉంటుంది. రోజూ కంటే త్వరగా నిద్ర లేవడం, పనులన్నీ చకచకా చేసుకోవడం మాటిమాటికీ టైమ్ చూసుకోవడం అతనికి అలవాటైపోయింది.

భువనేశ్వరి అతనికి పూర్తిగా వ్యతిరేకం. భర్త వైపు రుసరుసలాడ్తూ చూస్తుంది. తనతో సంబంధం లేని ఎన్నో పనుల్ని అతను తన నెత్తిన రుద్దుతున్నాడని కోపం. ఎవరికీ పట్టనీ ఎవరికీ అవసరంలేని వాళ్ళ గురించి అతను తీసుకునే శ్రద్ధకి ఒళ్లు మండుతుంది.

ఆ కోపంతో విరుచుకు పడుతుంది. మహేంద్రకి ఇది కూడా అలవాటైపోయింది. ఆ పండుటాకులు ఏ క్షణాన రాలిపోతాయో తెలీదు. భార్య పోరు పడలేక అమెరికాకి వెళ్ళే ప్రయత్నం చేశాడు.

ఎన్నో ఏళ్లుగా ఎదురు చూస్తూ, వేయి దేవుళ్ళకి మొక్కుకునేవాళ్లకి దొరకని అవకాశం మహేంద్రకి వచ్చింది. ఆ విషయాన్ని బయటపెట్టలేదు.

సాయంత్రం అయింది. మహేంద్ర కొత్త కాసెట్లు,

కొత్త పుస్తకాలూ కొన్నాడు.

"భువనా"

మహేంద్ర పిలుపు విని భువనేశ్వరి దగ్గరికి రాగానే అతను తెల్లబోయాడు. వారానికెన్ని రోజులు, రోజుకెన్ని గంటలు? గంటకి ఎన్ని నిమిషాలు... ఇలా ఘడియ ఘడియకీ వాచీ చూసుకుని టైమ్ లెక్కపెట్టుకుంటాడు. ఆ విషయం భువనేశ్వరికి కూడా తెలుసు. అయినా నిర్లక్ష్యంగా తన మాటని లెక్కచేయదు.

చేతినిండా ఇడ్లీ పిండి. సగం పనిలోంచి

**మానవుడు పక్షిలా అంతరిక్షంలో ఎగరటం నేర్చుకున్నాడు కానీ మానవుడి లాగ జీవించడం నేర్చుకోలేదు.** – డా. యస్. రాధాకృష్ణన్

వచ్చినట్లు తెలుస్తూనే ఉంది. మొహం మీద పడుతున్న వెంట్రుకల్ని ఆ చేత్తోనే వెనక్కి తోయడంతో తల వెంట్రుకలకీ, నుదుటికీ కూడా పిండి అంటుకుంది. వెర్రి కోపం వచ్చింది మహేంద్రకి. అయినా తమాయించుకున్నాడు.

"ఎందుకు భువనా! నా టైమ్ వేస్ట్ చేయాలంటే నీకు అంత సంతోషం. ముఖ్యంగా ఈ రోజు ఎప్పుడెప్పుడు వస్తుందా అని తొందరపడే నాకు, నువ్విలా ఆలస్యం చేయడం బాధగా ఉంది. వాళ్ళు మన కోసం ఎంత ఎదురు చూస్తున్నారో ఏమిటో? "

భువన మొహం తిప్పేసుకుంది. "నాకు బాగా తెలుసు. మీరేం చీటికీ మాటికీ చెప్ప నవసరం లేదు. పోనీ మీరే వెళ్ళి రావచ్చుగా"

"భువనా" అంతవరకూ ఎంతో సహనంగా ఉన్న మహేంద్ర కోపంతో భగ్గుమన్నాడు. "ఎప్పటికీ మనం అమృతం తాగిన దేవతల్లా ఇలాగే ఉండిపోము. ఇప్పుడు మా బామ్మా, తాత గారూ వున్న స్థితికి ఏదో ఒక రోజున మనం కూడా చేరుకునేవాళ్ళమే. పండుటాకుని చూసి పచ్చి ఆకు నవ్వినట్లు మాట్లాడతాం. రోజు గడిస్తే కాలం గీసిన గీత మొహం మీద పడుతుందని ఒక్కసారైనా ఆలోచిస్తామా? లేదే... ఎందుకు భువనా ఇంత రాక్షసంగా మాట్లాడతావు"

రెండడుగులు వెనక్కి వచ్చి "నేను రానండీ! మీ ఇష్టం మీరేమైనా అనుకోండి. ఓ. కే." అనేసి వెళ్ళిపోయింది.

మహేంద్ర క్షణం తల పట్టుకున్నాడు. వెంటనే లేచి కార్లో కూర్చుని డ్రైవర్ ప్రసాద్‌ని పిలిచాడు. అతను సిద్ధంగా ఉన్నాడు.

కారు శబ్దం విని భువనేశ్వరి తొంగిచూసింది. కారు వెళ్ళిపోవడం దూరంగా కనిపిస్తూంటే ముందు తెల్లబోయింది. ఆ తర్వాత 'హూం' అని వంటగదిలోకి వెళ్ళి పోయింది.

"అమ్మా! ఇప్పుడు నీకు సుఖంగా ఉందా? పాపం ఆయన ఎంత డిసప్పాయింట్ అయ్యారో? వారానికి ఒక్కరోజు తనతో రమ్మంటారు అంతేగా? వెనకటి ఓ కథ గుర్తొస్తోంది. తన తండ్రి తాతకి చిప్పలో భోజనం పెట్టడం చూసిన ఓ మనవడు తాత దగ్గర ఆ చిప్పని అడిగి దాచి ఉంచుతాడు. ఈ కథ చదివినవాళ్ళూ, విననివాళ్ళూ ఉండరమ్మా"

"ఓ" అంది భువనేశ్వరి. "నన్ను బెదిరిస్తున్నావా? లేకపోతే భయపెడుతున్నావా? నీకేం తెలుసురా నా బాధ. అత్త మామలకి చాకిరీ చేసి చేసి అలసిపోయాను. ఎంత డబ్బు ఉంటే ఏం లాభం? వాళ్ళు హద్దు లేనంత ప్రేమతో నన్ను చంపుకు తిన్నారు"

"విచిత్రంగా మాట్లాడకమ్మా. చాకిరీ అంటే తప్పేనమ్మా. మనింట్లో పనివాళ్ళు లేకపోయారా. ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోకమ్మా. నువ్వు చేసిన సేవ నిన్నంత బాధపెట్టిందామ్మా? "

ఇడ్లీ పిండి గిన్నెలోకి ఒంపి చేతులు కడుక్కుని మొహం తడుచుకుంది భువనేశ్వరి. ఆపైన అంది: "కొందరు కొందరికి నచ్చరు. అదొక రకం సైకలాజికల్ ప్రాబ్లం. బహుశా నాదే తప్పయి ఉంటుంది."

"ఆవిడ నన్ను దగ్గరకి తీసుకుని చేతి నిండా బంగారు గాజులు తొడిగితే అది పెద్ద ఇబ్బంది. గట్టిగా తల దువ్వి ఎడ్ల మెళ్ళో గంటల్లాగా నా జడ చివర కుచ్చులు. నాకు నచ్చేవి కావు. బిగుతుగా అల్లిన జుట్టు చెమ్మకాయలా ఉండేది".

తల్లివైపు మనోహర్ వింతగా చూస్తూ "ఇవమ్మా కష్టాలూ సేవలూ" అని అడిగాడు.

"నీకు సింపుల్‌గా కనిపించే విషయాలు నాకు సాల్వ్ చేయలేనంత సమస్యలు. నీ మనసూ, మా మనసూ ఒకటే కాదు మనో

హర్. నీకు పాయసం ఇష్టం అయితే నాకు పులిహోర ఇష్టం. మీ బామ్మా తాతగారూ నాకు స్వేచ్ఛని ఇవ్వలేదని నేననుకుంటు న్నాను. వాళ్ళ అడుగుజాడల్లో నడవడం అనేది నాకు ప్రాణాంతకం లాంటిది"

"అన్యాయం అమ్మా!"

"నాకు ఈ ఇండియా వదిలి వెళ్ళిపోవడం ఇష్టం. రోజుకి ఎనిమిది గంటలు పనిచేసినా తగిన ఫలితం లేనప్పుడు ఎందుకు నేనూ, నా దేశం అని పాకులాడడం? "

"మనకి డబ్బుకేం లోటమ్మా"

"అదేమో నాకు తెలీదు. నాకు డబ్బు ఖర్చుపెట్టడం ఎన్‌జాయ్ చేయడం ఇష్టం. ఉన్నది ఖర్చుపెడితే రెండు నిమిషాలు పట్టవు. సంపాదించాలంటే విదేశాలకి వెళ్ళాలే తప్ప మరో మార్గం లేదు"

"నువ్వు చెప్పే ఏ విషయంలోనూ రీజన్ లేదమ్మా. వాళ్ళు నిన్నెంత ముద్దుగా చూశారో అర్థం కావడంలేదూ. నువ్వు చెప్పే విషయాలు మరెవరైనా వింటే నవ్విపో తారు. వాళ్ళు అదృష్టవంతులు. ఇంకా నిన్ను బాధపెట్టకుండా వెళ్ళిపోయారు."

"నువ్వు వ్యంగ్యంగా అంటున్నావని తెలు సుకోలేనంత పిచ్చిదాన్నీ, అమాయకురాలినీ కాను, వాళ్ళ శకం అయిపోయింది. ఇంక వీళ్ళని ఉద్ధరించాలంటే నావల్లకాదు. నేను తలచుకుంటే ఏమైనా చేయగలను."

మనోహర్ లేచి వెళ్తూ "నేను వెళ్తున్నా నమ్మా" అన్నాడు.

"వెళ్ళు" విసురుగా అంది భువనేశ్వరి.

ఈ మధ్య కొంచెం ఎక్సర్‌సైజ్‌లా ఉంటుందని మిక్సీ వేయడం, టీ, కాఫీలు కలపడం లాంటివి చేస్తోంది. ఇంట్లో పని వాళ్ళు ఉన్నా అంతగా పనిలేకపోవడంవల్ల ఇల్లంగా నిశ్శబ్దంగా ఉంది.

ఇంత నిశ్శబ్దంగా ఉంటే ప్రాణానికి హాయిగా ఉంది. ఈ నిశ్శబ్దాన్ని భరించడం కష్టం అంటారేమిటి? ఏమైనా ఇంక ఈ దేశంలో తను మాత్రం ఉండలేదు. మహేంద్ర మాత్రమే తాతనీ బామ్మనీ చూడాలనేం రూల్ లేదు. అందరిలా ఇంకా ఇంకా సంపాదించి టింగూ-రంగా అని బత కాలి. భువనేశ్వరికి వయసు పెరుగుతోందే గానీ జీవితం గురించి ఆలోచించడం తెలి యడంలేదు.

ఉన్నవాళ్ళకే మరెంతో ఆశ.

భువనేశ్వరి ఈ బంధాలకి దూరంగా ఉండేరోజు గురించి ఆలోచిస్తోంది. చదు వుకీ, సంస్కారానికీ మధ్య దూరం ఎక్కువౌ తున్న కొద్దీ జీవితం కుంచించుకుపోతుందనే విషయాన్ని చదువుకున్న భువనేశ్వరి మరి చిపోయింది.

"అమ్మాయి రాలేదేం మహీ" భానుమతి విశాలమైన కళ్ళని మరీ పెద్దవి చేసుకుని మనవడి వెనకాల ఉందేమోనని ఆశగా చూసింది.

భవానీశంకరం "ష్! భానూ! వాడొ చ్చాడు. ముందు వాణ్ణి చూడు" అన్నారు.

మహేంద్ర ఎప్పటి మాదిరిగానే అందరికీ స్వీట్లూ, పళ్ళూ తీసుకువచ్చాడు. అవి తీసు కుని ఆఫీస్‌వైపు వెళ్ళిన డ్రైవరు ప్రసాదు నుండి కేర్‌టేకర్ రంగారావుగారు తీసుకు న్నారు.

లాన్ మధ్యలో కూర్చున్న భవానీశంకరం గానీ, భానుమతిగానీ ఏమీ మాట్లాడలేకపో తున్నారు. నిశ్శబ్దం క్షణాల్ని మింగేస్తోంది. అప్పుడు క్రమంగా వచ్చేవాళ్ళు తగ్గిపోతు న్నారు.

"మాతా నాస్తి, పితా నాస్తి, నాస్తి బంధు సహోదరా

అర్థం నాస్తి, గృహం నాస్తి, తస్మాత్ జాగ్రత- జాగ్రత.

ఈ బంధాలేవీ శాశ్వతం కావు భానూ! మన కాలం వేరూ, మన పెంపకాలు వేరు. గత కాలమే మేలు సుమ్మ అని ఊరికే అన లేదు. ఈ పద్ధతి ఇలాగే సాగిపోతే భార్యని భర్తా భర్తని భార్యా కూడా గృహాల్లో వది లేసి సుఖంగా బతికేస్తారేమో" అన్నారు

భవానీశంకరంగారు.

భానుమతి మొహంమీద చాచికొట్టినట్లు భయపడింది. ఆ ధాటికి తట్టుకోనట్లు మన వడి చేతుల్ని గట్టిగా పట్టేసుకుంది. మహేంద్ర ఆవిడని గుండెల్లోకి తీసుకు న్నాడు. అతని కళ్ళు నీటి తెరల్ని కప్పుకు న్నాయి. ఆ వెచ్చదనంలో ఆవిడ తడిసి ముద్ద అవుతోంది.

"నాయనా మహీ... మీరు ఏ రెండు మూడేళ్ళో ఫారిన్‌లో ఉండి ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా తీసుకు వెడతారను కున్నాంరా. అసలు నువ్వు వెళ్లడం మానే స్తావేమో అని కూడా ఆలోచించాను. ఇవాళ భువన రాలేదు. అర్థం అయిపో యింది. మా బతుకులు యిక్కడే తెల్లవార తాయి" ఆవిడ దూరంగా జరిగి ఫక్కున నవ్వింది.

మహేంద్ర ఆమెని నివ్వెరపోయి చూశాడు. "బామ్మా! నేను అలా అనుకోవ డంలేదు. నమ్ము. మీరైనా చెప్పండి తాత గారూ".

భవానీశంకరం కూడా నిర్లిప్తంగా చూస్తుండిపోయారు.

"మాట్లాడండి తాతగారూ" మహేంద్రకి దుఃఖం ముంచుకువస్తోంది.

దూరంగా జంటలు జంటలుగా కూర్చున్న పెద్దవాళ్ల మొహాల్లో కళాకాంతులు లేవు. మహేంద్ర వెర్రివాడిలా కూర్చుండిపో యాడు..

"మహీ! నీ దగ్గర డబ్బుంది. చాలా సంతోషంరా. ఆ డబ్బుతో స్వీట్స్ హాట్స్ అన్నీ అన్నీ ఇస్తున్నావు. తిన్న తిండి కడు పులో శాశ్వతంగా ఉండదు. ఇకమీదట అవి తీసుకువచ్చి డబ్బు వృథాచేయకు. అసలు వచ్చేందుకు కూడా ప్రయత్నం చేయవద్దు. ఏడుస్తున్న పిల్లలు ఏడుపు మానేందుకు చాక్‌లెట్ ఇస్తాం. మేము మరీ అంత చిన్న వాళ్లం కాదు"

మహేంద్ర ఆయన్ని చుట్టేశాడు. "తాత గారూ. నేను అలాంటి వాడినికాదు"

"అనే చచ్చిపోయే టైమ్‌లో నా కొడుకూ కోడలూ నాతో అన్నారు" భవానీశంకరం గారి మాటలు మహేంద్రక్కూడా జ్ఞాపకం వస్తున్నాయి. కళ్లముందు నిన్నో మొన్నో జరిగినట్లుంది. మహేంద్రకి ఏడవాలని ఉంది. ఏడిస్తే చుట్టూవున్నవాళ్లు నవ్విపోతా రనే భయం కూడా ఉంది.

"తాతగారూ నమ్మండి ప్లీజ్" కంఠం నరాలు తెగిపోయేట్లు అరిచి తన నిజాయి తీని నిరూపించుకోవాలని ఉంది.

భవానీశంకరం గారి వంటి వాళ్లు తొంద రగా అర్థంకారు. ఎదుటివాడిని తిట్టకుండా, కొట్టకుండా అసలు పెదవే విప్పకుండా పశ్చాత్తాపంతో దగ్ధం అయిపోయేట్లు చేయ గలరు.

మహేంద్ర జరిగి బామ్మ దగ్గర కూర్చుని ఆవిడ చేతులకి ఉన్న గాజులు సవరి స్తూంటే ఆవిడ ఆ చేతిని అందుకుని "ఈ చేయి జారిపోతే నాగుండె ఆగిపోతుందిరా మహీ... నా కొడుకు పట్టుకున్నట్లే ఉంది. ఎందుకురా దేవుడిలా కష్టపెడతాడు? అసలు దేవుడంటేనే మహా గొప్పవాడే. పుట్టించిన బిడ్డల్ని ఇంత కఠినంగా చూడ చ్చునా? "

"ఏడవకు బామ్మా"

"భువనని చూడాలి. కావాలనే... కావా లనే ఇలా చేస్తున్నారు"

మహేంద్రకి ఏంచేయాలో తోచలేదు. అక్కడ ఎంతోమంది కూర్చున్నారు. ఎక్కువ మంది ముక్కూ, కళ్లూ తుడుచుకుంటు న్నారు. కొంతమంది పగలబడి నవ్వుతు న్నారు. ఆ నవ్వు తెచ్చిపెట్టుకున్నదే. భవానీ శంకరంగారు ఆకాశంలోకి చూస్తున్నారు. ఎగిరేపక్షులు ఎంత బాగున్నాయో తెల్లని మేఘాల మధ్య నల్లని పక్షులు. నల్లని మబ్బుల్ని కప్పుకున్న తెల్లని పక్షులు.

ఆకాశం అంతా తమదే అయినట్లు ఆ రెక్కల మధ్య సన్నగాలి. ఈలపాటలా

ఓవైపు దూరంగా కొండలమధ్యలో వెలుగు తున్న సూర్యుడు.

"ఇలా చూస్తూ యీ లాన్‌లో కూర్చున్నా రోజులు గడిచిపోతాయి భానూ! ఎందు కమ్మా చేతులు చాపి అందర్నీ దేవిరించడం? ఇంక చాలు నువ్వు వారం వారం ఎవరికోసమో ఎదురుచూడనవసరంలేదు. మానుకో. ఇవన్నీ మానుకో. నీకు తోచక పోతే రామకోటి రాయి. ఇంకా బోర్ అని పిస్తే గాయత్రీ జపంచేయి. ఆత్మశాంతిగా ఉంటుంది"

"తాతగారూ"

"అరె నిన్నేం అనలేదు మహీ. మీ బామ్మవి అన్నీ చిన్నపిల్లల వేషాలే. గట్టిగా మారాం చేయదు గానీ అంతే చికాకుపెడు తుంది. అలిగి అన్నం తినదు. ఇలా ఎప్ప టికీ సాగదుకదా. ఎవరుముందో, ఎవరు వెనుకో... నేనైతే ఆటుపోట్లన్నిటినీ తట్టుకో గలను. దానికి చేతకాదు"

మహేంద్ర చప్పున బామ్మ వొళ్లో తలపె ట్టుకున్నాడు. ఆవిడ మొహం చూడాలి. సంబరాల పండగలా వుంది. ఆ తల్లి పడు కున్న పిల్లడి క్రాపులో వ్రేళ్లు జొనిపి ఆనం దంతో ఉక్కిరి బిక్కిరి అయిపోతోంది.

భవానీశంకరంగారు నెమ్మదిగా అన్నారు. "ప్రేమ పెంచుకుంటే చిక్కబడుతుంది. తెంచుకుంటే ఆవిరైపోతుంది. మహీ ఇప్ప టికే నీకు మేం ఎంతో రుణపడి ఉన్నాం. ఇంకా నిన్ను బాధపెట్టడం ఏం బావుం టుంది? "

మహేంద్ర జవాబు చెప్పలేదు. అలా పడుకునే బామ్మాతో మాట్లాడుతున్నాడు: "బామ్మ నేను బాదంచెట్టు మీంచి పడడం గుర్తుందా? "

ఆవిడ కంగారు పడింది. "చచ్చి బ్రతికావు కదురా నాయనా. మీ అమ్మ నీ అల్లరికి విసిగిపోయింది. డాక్టరమ్మగారింట్లో జామ పళ్లు దొంగతనం చేశావని ఆమె ఇంటిమీ దకి వచ్చింది. లాల్‌టమాటర్ అనగానే నాకు వొళ్లు మండింది. ఎర్రగా వున్నావని ఇంట్లో వాళ్లం మేం ముద్దుగా పిలిస్తే ఆవిడా ఆ పేరుతోనే పిలుస్తూ జాంపండుకే ప్రాణం గిలగిల్లాడినట్లు అరిచేసింది. ఈ అవమానం భరించలేక మీ అమ్మ కర్రపు చ్చుకుంది. మన పెరట్లో బాదం చెట్టు ఎక్కావు. మీ అమ్మ వచ్చేసింది. ఎంత ఆపినా ఆగదే. ఆయాసపడి పోతుంటే నువ్వు దిగబోయి కొమ్మతోసహా దబ్బుమని కింద పడ్డావు. పడీపడగానే నీలంగా మారి పోయావు. నీ మొలతాడు తెంపేశాను. ఆ డాక్టరమ్మ ఇరుగూ పొరుగూ వాళ్ల సాయంతో వైద్యం చేసింది.

మహేంద్ర నవ్వాడు.

"మహీ! నువ్వొక్కడివే అల్లరి చేసేవాడివి. మీ అన్న కమలాకర్ అల్లరి ఎరగడు. నీ పిల్లలూ ఎరుగరు. అటువంటి నువ్వు ఇవాళ ఎంత బాధ్యత భుజంమీద వేసుకు న్నావో".

ఉన్నట్లుండి లైట్లు వెలిగాయి.

"ఇంక వెళ్లు మహీ" భవానీశంకరంగారు కల్పించుకున్నారు. ఎప్పుడూ ఏదో విషయం మీద చర్చించే ఆయన ఇవాళ ముళ్లమీద ఉన్నట్లున్నారు. ఎప్పుడెప్పుడు మహేంద్ర ఇంటికి వెళ్లిపోతాడా అని ఎదురు చూస్తు న్నట్లు కనిపిస్తున్నారు. అసహనంగా ఈ చివరి నుంచి ఆ చివరి వరకూ తిరుగుతు న్నారు.

మహేంద్ర మనసులో కల్లోలం మొదలైంది.

ఇంటికోసం, ఇంటి వాతావరణం కోసం ఎంత మొహం వాచిపోతున్నారో అర్థం అవుతోంది. ఏదీ చేయలేని నిస్సహాయస్థితి. అతను నిశ్శబ్దంగా గేటుని చూస్తూండిపో యాడు.

గేటుని దాటి ఇరవైఏళ్ల అమ్మాయి మహేంద్ర దృష్టిలో పడుతూనే అతన్ని లేచి కూర్చునేలా చేసింది.

భుజాల వరకూ కట్‌చేసిన వెంట్రుకలు

గాలికి రెపరెపలాడుతున్నాయి. చెంపకు చేరడేసి కళ్లు అవి నీళ్లల్లో క్షణం నిల వని చేపపిల్లల్లా ఆ ప్రదేశాన్నంతా కలియచుడుతున్నాయి. జీన్స్ పాంట్ మీద టీషర్టు వేసుకుంది.

అడుగుతీసి అడుగు పెడుతుంటే ఠీవిగా ఉంది. జంకూ గొంకూ లేకుండా తిన్నగా రంగారావు ఆఫీసువైపు దారితీ సింది. మహేంద్ర ఆ పిల్ల కదలికల్ని గమనిస్తున్నాడు. పది నిమిషాల తర్వాత లాన్‌లోకి వచ్చి భుజంమీద వేలాడుతున్న బాగ్‌ని కిందపెట్టి తనూ కూర్చుంది.

మహేంద్ర రెప్పవేయకుండా తనని కట్టిపడేసిన ఆ కుందనపు బొమ్మని అపురూపంగా చూస్తున్నాడు. భవానీశంకరంగారు మనవడి చూపుల్ని వెంటాడుతూంటే లాన్‌మీద



కూర్చున్న అమ్మాయి పట్టుబడింది.

ఆ పిల్ల దగ్గరికి వెళ్లాడాయన.

ఆయన ఆడుగుల చప్పుడుకి తలెత్తింది కింద కూర్చున్న అమ్మాయి.

"ఐయామ్ భవానీశంకరం" స్నేహపూర్వకంగా చేతిని ముందుకి చాపారు.

'ఓ! అల్లరిగా శబ్దంచేసి తన రెండు చేతుల్నీ ఆయన చేతుల్తో కలిపి "మిత్ర విందా... మిస్ మిత్రవిందా పార్ధసారధి" అంది నవ్వుతూ...!

ఆ నవ్వులు పువ్వుల్లా గుబాళించాయి.

"కూర్చుందామా" అడిగింది మిత్ర.

"అక్కడ భానుమతి ఉంది" చెప్పారు భవానీశంకరంగారు.

"సర్" అంది మిత్ర! "ఇక్కడికి రాక ముందు చాలాచోట్లకి వెళ్లాను. మనిషి తపన, బాధ, అందుకు కారణం, వాళ్ల సైకాలజీ, దానికి రెమెడీ యివన్నీ తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నాను. అందువల్ల నాకేం లాభంకాదు... నా వల్ల వీళ్లకి ఎంత ఉపకారం జరుగుతుందో చూడాలి"

"వెరిగుడ్. ఇంత పొద్దుపోయాక వచ్చావేమిటమ్మా".

"బయలుదేరడం పొద్దున్నే లెండి. అన్ని చోట్లకీ వెళ్లిరావడంవల్ల లేటైంది అంతే సర్"

భవానీశంకరం ఓసారి తలతిప్పి మహేంద్ర వైపు చూశాడు. మహేంద్ర నెమ్మదిగా లేచి కూర్చున్నాడు. అసంకల్పితంగా పైకిలేచి అడుగులో అడుగు వేసుకుంటూ మిత్రవింద దగ్గరికి వచ్చాడు. మిత్రవింద చొరవగా "సర్‌గారి అబ్బాయి అవునా" అని అడిగింది.

మహేంద్ర తల అడ్డంగా తల తిప్పి "మా తాతగారు" అని చెప్పాడు. అతను భుజాలు బరువెక్కిపోతున్నట్లు నీరసించి పోయాడు. శరీరం అతని స్వాధీనంలో లేనట్లు, ఏం చేయాలో తోచనట్లు ఆధారం కోసం చూస్తుంటే భవానీ శంకరం గారు చప్పున మనవడిని గట్టిగా పట్టుకున్నారు.

మిత్రవింద రెండవ వైపు వచ్చి ఆ చేతికి ఆసరాగా నిలబడింది. ఆ తర్వాత మెల్లగా అంది "చాలా అలసిపోయినట్లున్నారు. బాగా ఆలోచించినందుకే అయివుంటుంది. కొన్నిసార్లు కాలంతో రాజీపడి బతికేయడం ఆరోగ్య లక్షణం"

మహేంద్ర జవాబు చెప్పలేదు వింటున్నాడు. ఆ పిల్ల మాటల్లో 'అమ్మ' ఓదార్పు. మరో పది కాలాలు బతికేంత బలాన్నిస్తోంది. ఈ వయసు వాళ్ళు ఇంత వరకూ ఎవరూ రాలేదు. సహజంగానే అందంగా వున్న ఆ అమ్మాయి పనిగట్టుకుని ఇక్కడికి రావడానికి కారణం తెలుసుకోవాలనిపిస్తోంది. మహేంద్రకి గుర్తున్నంతవరకూ యింత ఆసక్తిగా ఎప్పుడూ ఎవర్నీ చూడలేదు పెద్దమ్మ గుళ్ళో అమ్మని తప్ప.

భానుమతి దూరం నుంచి ఆశ్చర్యంగా చూస్తూ ఇక ఉండలేక అక్కడికి వచ్చేసింది.

"భానూ! ఈ అమ్మాయిని చూడు" అన్నారు భవానీ శంకరంగారు.

ఆవిడ తేరిపార చూసి "జిక్కీలాగే వుంది. అయినా అది ఇక్కడికి ఎందుకు వస్తుంది? " అని "ఇంతకీ ఎవరూ" అని అడిగింది.

"మిత్రవిందట. మన కష్టసుఖాల మీద రీసెర్చ్ చేస్తుందిట".

భానుమతి రెండడుగులు ముందుకువేసి "ఇక్కడే వుంటావామ్మా" అని అడిగింది. మిత్రవింద నవ్వింది "ఇక్కడ ఉండనీయరమ్మా. రోజూ రావచ్చు. మీ అందరితో మాట్లాడవచ్చు. నాకు తెలుసు మీకు నేను ఇక్కడే వుండాలని వుంది అవునా? "

భానుమతి ఆశ్చర్యంగా చూసి "నీకెలా తెలుసు" అంది. "నేను యిక్కడికి రావడం మొదటిసారే అయినా యిలాంటి హోమ్స్‌కి తరుచు వెడుతుంటాను. వాళ్ళందరూ నన్ను

**ఇంటిని మించిన పాఠశాల లేదు. తల్లిదండ్రులను మించిన గురువులు లేరు.**

– మహాత్మాగాంధీ

వుండమని అడుగుతుంటారు. నాకూ ఉండాలనే ఉంటుంది. కానీ నాన్నగారికి కూడా నేను కావాలి”

భానుమతి నిట్టూర్చింది. “ఇక్కడ ఉండడానికి ఎవరూ ఇష్టపడరు. ఇదో రకం జైలు. చూస్తూ చూస్తూ జైల్లోకి ఎవరు వస్తారు. నీలాంటి పిల్లలు ఇక్కడ ఉండాలని ఆశ పడడం కూడా తప్పే. రాబోయే కాలంలో యాభై ఏళ్ళు దాటగానే రిటైర్‌మెంట్ దాంతోబాటు ఈ ఓల్డ్‌ఏజ్ హోమ్స్‌లో సెటిల్‌మెంట్”

“మీరు ఇంగ్లీషులో మాట్లాడుతున్నారు” మిత్రవింద ఆవిడ మొహంలోకి చూసింది.

భానుమతి జవాబు చెప్పలేదు.

మహేంద్ర తన విజిటింగ్ కార్డు యిస్తూ “మీలాంటి పిల్లలు పరిష్కారం ఆలోచించాలి. ఈ పెద్దవాళ్ళు మన శ్శాంతి లేకుండా బతుకుతున్నారు. నేనో తప్పు చేశాను. ఆ తప్పు సరిదిద్దుకునేటందుకు టైమ్ పడుతుంది. చూపుడు వేలితో శాసించగల్గే నేను ఇప్పుడేమిటో దారి తెలియని ఎడారిలో దిక్కులు చూస్తున్న వాడిలా అయిపోతున్నాను” అన్నాడు.

“మీరు చెప్పింది సగమే అర్థం అయింది అంకుల్”

“మిత్రవిందా! రేపు కూడా వస్తావామ్మా”

“కనీసం నెలా రెండు నెలలైనా తప్పనిసరిగా రావాల్సి ఉంటుంది. ఏమైనా పని వుందా అంకుల్”



## ఖర్మని సరిపెట్టుకుందాం

విశ్వనాథ కావ్యం రామాయణ కల్పవృక్షం ప్రశంసలు చూరగొన్నట్లే విమర్శలూ చవిచూసింది. విశ్వనాథను కించపరచాలని విమర్శలు గుప్పించినవారూ లేకపోలేదు. అలాంటి ఓ సభలో దానికి అధ్యక్షత వహిస్తున్న ఓ పెద్దమనిషి రామాయణ కల్పవృక్షంలో వ్యాకరణ దోషాలున్నాయని విమర్శించారు. అదేసభలో పాల్గొన్న విశ్వనాథ ఆగ్రహంగా లేచి, పైమీది ఉత్తరీయం విసిరేసి, ‘తెలుగులో బాల వ్యాకరణం ఉంది. ప్రౌఢ వ్యాకరణం ఉంది. అధర్వణ కారికలని ఉన్నాయి.. ఇంకా చాలా చాలా ఉన్నాయి. అవన్నీ చదివిన వారికి నా కావ్యంలో వ్యాకరణ దోషాలు కన్పించవు. కేవలం బాలవ్యాకరణమే చదివిన వారికి తప్పులు కన్పిస్తాయి.. ఈ సభాధ్యక్షుడూ బాలవ్యాకరణం ఒక్కటే చదివినట్లున్నాడు.. అందుకే తప్పులనుకుంటున్నాడు.. అలాగే అందులో శైలి క్లిష్టమని.. నూటికి పది పద్యాలు మాత్రమే అర్థమవుతాయనీ అంటున్నాడు.. మా కాలేజీలో ఇంటర్ పిల్లలందరూ వాటికి భావాన్నీ అర్థాన్నీ చెప్పగలరు.. వారిపాటి కూడా చేయని ఇలాంటివాడు సభాధ్యక్షుడైతే మనం ఏంచేయగలం? ఖర్మని సరిపెట్టుకోవడం తప్ప’అన్నారు. సభాధ్యక్షుడి ముఖాన కత్తివేటుకు నెత్తురుచుక్కలేదు.

"నీతో చాలా మాట్లాడాలి. నీ సలహా తీసుకోవాలి."

"అయ్యో! ఎంతమాట. నన్ను మీరు చాలా పెద్దదాన్ని చేస్తున్నారు. నాకు వీళ్ళందరూ చాలా ఇష్టం. కుటుంబం అనే వ్యవస్థకి పునాదిరాళ్ళు. వీళ్ళని పట్టించుకునేందుకు సంస్థలు ముందుకు వస్తున్నాయి. సంస్థలు" రెట్టిస్తూ ఆగింది.

మహేంద్ర వాచీ చూసుకున్నాడు. చూస్తుండగానే చీకట్లు అలముకున్నాయి. గాలి తీవ్రత హెచ్చింది. తుఫాను వచ్చే ముందు వాతావరణంలా అయిపోయింది. భానుమతి విసురుగా వెళ్ళిపోయింది.

భవానీ శంకరం గారు మనవడి వైపు చూడకుండానే అలా వెళ్ళిపోతున్న భార్య వైపు నడిచారు. మిత్రవింద చూస్తూనే ఉంది. ఏడడుగుల బంధం! ఎన్ని సంవత్సరాల ప్రేమో!

"నిన్ను డ్రాప్ చేయనామ్మా"

"సర్! నాకు స్కూటీ వుంది."

ఇద్దరూ గేటు దగ్గర ఆపిన వాహనాల కోసం నడుస్తూంటే మహేంద్ర అన్నాడు. "చాలా ఏళ్ళ క్రితం ఇల్లు స్వర్గంలా ఉండేది. ఊపిరి పీల్చుకోలేనంత బిజీ. ఇంటి నిండా చుట్టాలతో ఎప్పుడు చూసినా పెళ్ళివారిల్లులా కళకళ లాడుతూ ఉండేది. ఇప్పుడలా కాదు. నిశ్శబ్దం రాజ్యం ఏలుతోంది అంటారే అలా..."

"ప్చ్..." మిత్రవింద పెదవి విరిచింది. "నాకు చేతకాని వాళ్ళంటే ఒళ్ళు మంట. ఎదుటివాళ్ళ సానుభూతి కోసం బోల్డు కథలు చెబుతారు. చెప్పండి! ఈ వృద్ధాశ్రమంలో మీతాతగారినీ, నానమ్మనీ ఉంచడం మీకు అసలు ఇష్టంలేదు. కానీ పరిస్థితులు . ఇదేగా మీరు చెప్పబోయేది."

మహేంద్ర నడుస్తున్నవాడు ఆగిపోయాడు.

"అంత ఆశ్చర్యపోనవసరం లేదు. రోజూ వింటున్న చిలకపలుకులే యివి. మీ తప్పేం లేదులెండి. దీనికి సొల్యూషన్ వుంది."

"జాబ్‌కి వెళ్ళే పేరెంట్స్‌కి చిన్నపిల్లలు ఎంత సమస్యో ఈ పెద్దతరం వాళ్ళు కూడా అంతే సమస్యలో చిక్కుకుంటున్నారు." మహేంద్ర సంజాయిషీ యిస్తున్నట్లు అన్నాడు.

స్కూటీ స్టార్ చేయబోతూ అతనివైపు చూసింది. "ఎస్కేపిజం. ఎలాగూ వాళ్లని ఆశ్రమాల్లో చేర్పిస్తున్నారు. ఒక విధంగా సంతోషమే. కానీ మీరు. మీరు అంటే ఇదిగో ఈ ఆశ్రమవాసుల బంధువులు... ఎందుకు మళ్ళీ మళ్ళీ వచ్చి వాళ్ళు మరిచిపోతున్న గతాన్ని గుర్తుచేస్తారు? అయినా మిమ్మల్ని ఇన్ని మాటలు అనకూడదు. కానీండి... యింకా ఎన్ని రకాల మనుషులు వున్నారో అదీ చూస్తాను. కొంచెం ఆగి మళ్ళీ "సారీ! క్షమించండి. ఇది నా అన్వేషణలో ఓ భాగం అంతేగానీ మరే ఉద్దేశ్యం లేదునాకు. ఒకటి మాత్రం నిజం మనం మన దేశంలో పుట్టిన ప్రతి మనిషీ ఆలోచించాల్సిన విషయం. వృద్ధాప్యం అనేది ఓ దశ అంతేకానీ అదో శాపంకాదు. విరక్తితో చచ్చిపోతే అది మనకి సంతోషాన్నిచ్చే విషయమా? సో - వస్తాను" అనేసి స్కూటీ స్టార్ట్ చేసి రయ్యిన వెళ్ళిపోయింది.

విసురుగా వచ్చిన గాలి దుమారం మొహానికి తగిలి ఉక్కిరిబిక్కిరి చేసినట్లు అనిపించింది మహేంద్రకి. అసలీవేళ బయలుదేరిన టైమ్ బాగులేదు అనుకున్నాడు.

"మనం వెళ్దామా సర్" డ్రైవరు ప్రసాద్ అడిగాడు.

మహేంద్ర ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడు. కారు ఇంటిదారి పట్టింది. తనని వెంటాడుతున్న మిత్రవిందని మాత్రం వదిలించుకోలేకపోతున్నాడు.

ఇరవై... ఇరవైనాలుగు ఏళ్ళ చిన్నది తనని తూర్పారపట్టింది. తనలాంటి వాళ్ళని చెరిగి పారేసింది. తను మాత్రం ఏం చేయగలడు?

"వెళ్ళిపోవాలి" అనే నస భరించలేకపోతు న్నాడు. ఒక్కోసారి మృదువుగా మాట్లాడే భువనేశ్వరి ఉన్నట్లుండి కొండచెరియలా విరిచుపడితే తను తట్టుకోలేడు.

ప్రసాద్ ఓ సారి అతనివైపు చూశాడు.

అతని గుండె చప్పుడు ప్రసాద్‌కి వినిపి స్తోంది.

ఉండబట్టలేక "సర్! అంతా బాగానే వున్నారు కదూ" అని అడిగాడు.

మరోసారి ఉలిక్కిపడ్డాడు మహేంద్ర. తలెత్తి అతని మొహంలోకి చూస్తూ "బయ లుదేరినప్పటి నుంచీ బాగాలేదు. మీ వదిన ఆఖరి నిమిషంలో రానని చెప్పగానే సగం ఓపిక పోయింది. ఇక్కడికి వచ్చాక మరో సగం పోయింది" అన్నాడు.

డ్రైవరు ప్రసాద్ గ్రాడ్యుయేషన్ చేశాడు. భువనేశ్వరి ఓసారి పల్లెటూరికి వెళ్ళినప్పుడు వరుసకి మేనమామ కొడుకైన ప్రసాద్‌ని తీసుకువచ్చి డ్రైవర్‌గా ఉద్యోగం యిప్పిం చింది. భువనేశ్వరి దగ్గర ఉన్న చనువు మహేంద్ర దగ్గర లేదు. అయినా అప్పుడ ప్పుడు ఇంటి విషయాల్లో కలుగచేసుకుని మహేంద్ర మనసుని తేలికపరుస్తుంటాడు.

ఇద్దరి మధ్యావున్న ఆత్మీయత దృఢమై నదే. అయినా ఈ ఐశ్వర్యం అనే పదం కోటగోడలా దగ్గరికి రానీయకుండా చేస్తుంది.

"వదిన మంచిదేనండి. ఫారిన్ వెళ్ళాలి అనే ఆశ ఆమెను మీ దగ్గర అలా ప్రవర్తిం చేలా చేస్తోంది. మీరో పనిచేయకూడదూ" ఆసక్తిగా మొహాన్ని అతని వైపు తిప్పాడు మహేంద్ర "చెప్పు"

"మీరు కొన్నాళ్ళు వదినని తీసుకుని పెద్ద న్నయ్యగారి దగ్గరికి వెళ్ళిరండి. అక్కడి జీవితం ఎలా వుంటుందో వదినకి తెలు స్తుంది. ఆపైన వెళ్ళి ఉండిపోయేదీ లేనిదీ ఆలోచించొచ్చు కదండీ"

"నా గుండె ఆగిపోతుంది ప్రసాద్. నన్ను వారానికోసారి చూడనిదే ఉండలేరు తాత గారూ, బామ్మా, నేను కనిపించకపోతే ఇంకే మైనా వుందా?"

"మీరేమీ అనుకోనంటే ఓ మాటడగనా సర్" ప్రసాద్ క్షణం ఆగాడు. ఈ సమస్య తాను ఈ ఊరికి వచ్చినప్పటినుంచీ చూస్తు న్నదే. తెగదూ, ముడిపడదూ అన్నట్లుంది.

మహేంద్రలో అతి మంచితనం అతడిని పిరికివాడిని చేస్తోంది. అందుకే అతను ఓ నిర్ణయానికి రాలేకపోతున్నాడు.

కారు నెమ్మదిగా సాగిపోతోంది. ప్రసా ద్‌కి సందేహం వచ్చింది. ఈయన తన మాట వింటున్నారా? మహేంద్ర టాంక్ బండ్ మీదికి దృష్టిని పోనిచ్చాడు.

హుసేన్‌సాగర్ కంఠం చుట్టూ దీపాలు బంగారు నగల్లా ప్రకాశిస్తున్నాయి. అల్లంత దూరంలో బిర్లా మందిర్ అప్పుడే తెచ్చిన వెండికొండలా కనిపిస్తోంది. చల్లనిగాలి ఈ చెంపమీంచి ఆ చెంపకి తగులుతోంది. ఈ వాతావరణం అతనికి పోయిన ప్రాణాన్ని నిలబెట్టినట్లు చేసింది.

ఈ లోకంలోకి వచ్చినట్లు "అడుగు" అన్నాడు.

ప్రసాద్ అడిగేశాడు. "మీరు ఎంతోమం దిని పోషించగలరు. అసలు లోటు అంటూ లేదు. తాతగారినీ, బామ్మగారినీ మన ఇంట్లోనే ఉంచేసి పనివాళ్ల చేత వాళ్లకి ఏమేం చేయాలో చెప్పి వుంటే బాగుండే దేమో. ఆ పెద్దమనుషుల్ని క్షోభ పెట్టి, ప్రతి క్షణం మీరు బాధపడటం జరిగేది కాదేమో సర్".

మహేంద్ర గంభీరంగా చెప్పాడు "ఆరోజు జీవితంలో మరిచిపోలేను"

ప్రసాద్ వింటున్నాడు.

"తాతగారు సంపాదించిన రూపాయిని నాన్నగారు రెట్టింపు చేశారు. ఆయన లాయ రైతే నాన్నగారు చార్టర్డ్ అకౌంటెంట్. నాన్న గారు ఆరోజుల్లోనే ప్రేమించి పెళ్లి చేసుకు

**పాపభీతి, దైవప్రీతి, సంఘనీతి అలవరచుకోవాలి. – బాబా**

న్నారు. నాన్న శ్రీరామచంద్రుడైతే అమ్మ వైదేహి"

"ప్రసాద్! మన ఇండియాలో ఉన్నన్ని పండుగలు మరే దేశంలోనూ కనిపించవు. ఎన్ని పండగలో. అన్నీ కొత్తపేట ఇంట్లోనే జరిగేవి. పండక్కి బంధువుల్తో ఇల్లు కిటకి టలాడిపోతుండేది. తాతగారి బావమరు దులూ... వారి కుటుంబాలూ, నాన్నగారి అత్తింటి బంధువులూ ఎంత బాగుండేవి ఆరోజులు? "

"కొత్తపేట పల్లెటూర్లా ఉండేదిట కదండి. వదిన చెప్పింది. పల్లెటూరి వాతావరణంలో ప్రేమలు కూడా కల్మషంగా ఉండవండి. మా బండార్లంకే చూడండి. ఇప్పటికీ మార్పు లేదు".

"పండగలే కాదు ప్రసాద్. పెళ్లిళ్లు, పుట్టిన రోజులూ, షష్టిపూర్తులూ, నోములూ వ్రతాలూ... నిత్యకళ్యాణం పచ్చతోరణంలా ఉండేవి. ఉమ్మడి కుటుంబంలోంచి చిన్న తాతగార్లు అందరూ తప్పుకున్నారు. ఒక్క సారిగా పెళ్లి పందిరి తీసేసినంత చిన్నబో యింది ఇల్లు. ఆ టైంలోనే అన్నయ్య వెళ్లి ఫారిన్‌లో సెటిల్ అయిపోయాడు. భువనా, నేనూ, పిల్లలూ, అమ్మానాన్న, తాత గారూ బామ్మ మిగిలాం. గిరిజక్కయ్య రావడం తగ్గించేసింది".

ప్రసాద్ వింటున్నాడు. కారు చాదర్ ఘాట్ వంతెన దాటింది. ఉన్నట్లుండి పిడుగు పడినట్లు ఓరోజు పొద్దున్నే నాన్న గారు "అమ్మా" అని కేక పెట్టారు. అందరి కంటే ముందు నానమ్మ 'వస్తున్నా రాముడూ' అంది. ఆ వెనుక మేమంతా పరుగెత్తాం. తాటిచెట్టు నిలువునా కూలిపో యినట్లు నాన్న పడిపోయారు".

సముద్రం పొంగినట్లు ఇరుగూ పొరుగూ, బంధువులూ గుండె బాదుకుంటూంటే నాన్న ఆయాసపడుతూ నా చేతుల్ని అందు కుని అతి కష్టంమీద "మహీ అమ్మ... అమ్మ జాగ్రత్త... బాగా చూసుకుంటానని మాటియ్యి" అన్నాడు.

"నేను చేతిలో చేయి వేస్తూ కంటి పాపలా చూసుకుంటాను" అని చెబుతుంటే ఆయన అంత కష్టంలోనూ నవ్వి "మీ అమ్మని కాదు. మా అమ్మనీ నాన్ననీ అని చెప్పారు" మహేంద్ర కళ్లు తడిసి వీధి దీపాల కాంతిలో మెరుస్తూండటం ప్రసాద్ గమనించాడు.

"నాన్నకి నల్లమందు మోతాదులో ఇవ్వు. ఆయన అది వేసుకోకపోతే కాళ్ల నొప్పులతో బాధపడతారు. ఎడిక్ట్ అని విసుక్కోకు. జబ్బు చేస్తుందని బలవంతంగా మాన్పిం చకు. అప్పుడప్పుడు పాలకోవా తెస్తూండు. బి.పి., షుగర్, కాన్సర్ ఈ పేర్లు చెప్పి భయపెట్టద్దు"

"అయ్యో! నేనలా చేయనండీ"

"మా నాన్నకీ అమ్మకీ బాంక్ బ్యాలన్స్ అవసరం లేదురా మహీ! బోలెడు డబ్బుంది. వాళ్ల బ్యాంక్ బాలన్స్‌వి నువ్వే. అమ్మకి జిలేబీ ఇష్టం. వేసవిలో మామిడి రసాలు తెచ్చి పెడుతుండు..."

"మీరు రెస్ట్ తీసుకోండి నాన్నా"

"బై చెప్పారు నాన్న. నా చేతిని మెల్లగా వదిలేశారు. పసిపిల్లల్ని అప్పజెప్పినట్లు నా చేతిలో పెట్టి ప్రశాంతంగా వెళ్ళిపోయారు"

"అటు తిరిగానో లేదో గుండె ఝల్లుమ న్నట్లు అయింది. ఇంటిల్లిపాదీ నెత్తీనోరూ మొత్తుకుంటూంటే ముందు అర్థం కాలేదు. తర్వాత చూస్తే ఏముంది? అమ్మ కూర్చున్నచోటే గోడకి చేరగిలబడి కూర్చున్న మనిషి వొరిగిపోయింది. నాన్నగారిమీద ఆవిడ ప్రేమో, ఆమెపట్ల ఆయన అనురా గమో తెలీదుకానీ ఇద్దరూ కలిసే వెళ్ళి పోయారు"

ప్రసాద్‌కి బాధేసింది. మాటల్ని కూడబ లుక్కున్నట్లు "విధి ఏం చేస్తాం" అన్నాడు.

"అటువంటి కొడుకూ- కోడలూ ఉండడం తాతగారూ బామ్మా చేసుకున్న పుణ్యం. నేను మా నాన్నకిచ్చినమాట పూర్తిగా నిలబె

ట్టుకోలేకపోతున్నాను ప్రసాద్. సాయంత్రం పాటలు పాడుకుంటూ చెట్లకి నీళ్ళుపోసే తాతగారు, బామ్మని అటుకులూ ఆవకాయా నూనే కలిపి తీసుకురమ్మనిచెప్పి లాన్‌లో కూర్చునే తాతగారు ఇంట్లోంచి వెళ్ళిపోవడం ఖర్మ. ఆయనకి రిటైర్మెంటు ఇలా ఏర్పా టైంది. ఆయనతోబాటు బామ్మకూడా. చాలా తప్పుచేశాను ప్రసాద్."

ఆయాసపడుతూ కర్చీఫ్‌తో మొహం తుడుచుకున్నాడు. వాటర్‌బాటిల్ తీసుకుని మంచినీళ్ళు తాగాడు.

"తాతగారు ఎప్పుడూ జ్ఞాపకం చేస్తుం టారు. నేను తండ్రిమాట జవదాటని కొడు కునని. కానీ అది నిజం కాదు. నేను పెళ్ళాం గుప్పిట్లో కీలుబొమ్మని. తాతగారు ఈ ఆస్తినంతా సంపాదించి ఇస్తే నాన్న దీన్ని కాపాడి పెంచారు. నేనేం చేశాను? ఆయన ఆస్తిని దోచుకున్నాను. ఇంట్లోంచి తరిమేశాను."

ప్రసాద్ నొచ్చుకుంటున్నట్లు అన్నాడు "మీరు అన్నీ తెలిసినవారు. మనం ఎన్నో అనుకుంటాం. చివరికి మన చేతిలో ఏమీలే దనే నిర్ణయానికి వస్తాం. మీరు బాధప డద్దు. రేపటిమీది ఆశతో బతికే మనం మంచి రోజులు కూడా వస్తాయని ఎదురు చూద్దాం"

"పొగాకు తినడంవల్ల ఆయన ఉమ్మేయ డంతో ఇల్లూ వాకిలీ అసహ్యంగా తయారౌ తున్నాయని భువన అంటుంది. ఆయన చీటికీమాటికీ బయటికి వెళ్ళలేరుకదా. పెద్ద తనంవల్ల దగ్గుతూంటే అదీ భరించలేకపో యింది. నాచేత బలవంతంగా ఈ రెండు విషయాల వల్లే హోమ్‌లో చేర్పిస్తున్న సంగతి చెప్పించింది"

ప్రసాద్ తెల్లబోయాడు.

"గిల్టీ, నామీద నాకు అసహ్యం. వాళ్ళని... ఏ పాపం తెలీని అమాయకుల్ని పంజరంలో బంధించాను. రాత్రీ పగలూ, క్షణక్షణం చస్తూ బతుకుతున్నాను. ఈ చెరలో వాళ్ళని వదిలేసి ఫారిన్ వెళ్ళిపోవా లంటుంది మీ వదిన"

మహేంద్ర చాలా మాట్లాడుతున్నాడు. ఎప్పుడూ బయటపడని అతను మనసుని ప్రక్షాళనం చేసుకుంటున్నాడు. ప్రసాద్‌కి ఆశ్చర్యంగా ఉంది. ఐదు నిమిషాలు మాట్లా డితే తన పరిధిలోకి తను బిగుసుకుపోయే మహేంద్ర ఇవాళ లక్ష్మణరేఖ దాటేశాడు.

ప్రసాద్ ఫ్రూట్ మార్కెట్ చౌరస్తాకి ఎడ మవైపుకి కారు మలుపు తిప్పాడు.

మహేంద్ర నిశ్శబ్దం అయిపోయాడు. కళ్ళు మూసుకున్నా తెరిచినా మిత్రవింద కనిపిస్తోంది. కారు కల్లు కాంపౌండ్ దాటింది. తన పిల్లలు కనిపించారు. వాళ్ళు వాళ్ళ అంతరంగం తెలుసుకోవాలని మొట్ట మొదటిసారి మహేంద్రకి అనిపించింది.

కారు షెడ్‌లో పెట్టి ప్రసాద్ "గుడ్‌నైట్ సర్" అన్నాడు మహేంద్ర కూడా జవాబు చెప్పి లోపలికి వెళ్ళాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. భువనేశ్వరి తన రూమ్‌లో పడుకుని టీవీ చూస్తోంది. టి.వి. శబ్దం కూడా విని పించడంలేదు.

మనోహర్‌గానీ, జిక్కీగానీ గదుల్లోంచి బయటికి రాలేదు. అతను బూట్లు విప్పేసి తలని సోఫాకి ఆన్చి కళ్ళు మూసుకున్నాడు. ఆకలిగానీ నిద్రగానీ దగ్గరకి రావడంలేదు. ఇవాళ వాళ్ళతో ఏమీ మాట్లాడలేదు. మనసూ, నోరూ మూగబోయాయి.

మహేంద్రకి లోపలికి వెళ్ళాలనిపించ లేదు. మహావృక్షాలు నేల కూలుతున్నాయి. అకారణంగా పడిపోతున్నాయి. ఇక్కడా అంతే. ఇంటిమీద బెంగతో, పిల్లలమీద మమకారంతో లోలోపలే కృశించిపోతు న్నారు. పారిపోయిన అవధానిగారు... 'పారిపోయిన', అనుకున్నందుకు చెంపలు వేసుకున్నాడు మహేంద్ర.

తాతగారు కూడా వెళ్ళిపోయేవారేనేమో? బామ్మ ఆయన్ని వదిలి వుండలేదు. ఆయన ఒక్క బామ్మ కారణంగానే తెగించలేకపోతు న్నారు. పొద్దున్నుంచీ ఆలోచించి ఆలోచించి

అలసిపోయిన మహేంద్రకి ఆవలింత వచ్చింది. ఆ పైన కళ్ళు వాటంతట అవే మూతలు పడ్డాయి.

రాత్రి పన్నెండు గంటలకి భువనేశ్వరికి మెలకువ వచ్చింది. టి.వి. చూస్తూనే నిద్రపోయింది. టి.వి.ని ఆఫ్ కూడా చేయలేదు. లేచి మహేంద్రకోసం చూసింది. హాల్లో సోఫాలో నిద్రపోతున్న అతన్ని లేపేందుకు ధైర్యం చాలలేదు.

చిన్నమాట చిలికి చిలికి గాలివాన అవుతుందని ఆమెకి తెలుసు. 'ఐదున్నరకి లేవచ్చు' అనుకుని గదిలోకి వెళ్లిపోయింది.

తెల్లవారు ఝామున చెట్ల మీద పక్షులు రెక్కలు తటతట లాడిస్తూంటే ఆ చప్పుడికి నిద్రలేచాడు మహేంద్ర. చుట్టూ చూస్తే తను హాల్లోనే నిద్రపోయిన సంగతి గుర్తు

వచ్చింది. 'రాత్రంతా'... అతను లేచి వెళ్లి మొహం కడుక్కుని తిరిగి హాల్లోకి వచ్చాడు. భువన కాఫీ తీసుకువచ్చి అతనికి ఇచ్చి వెళ్లి పోయింది. "రాత్రి ఎందుకు లేపలేదు" అని అడగలేదు. లేపకపోవడమే మంచిదైంది అనిపించింది అతనికి.

భువనేశ్వరి వంట ఇంట్లోనే ఉండిపోయింది. హాల్లో కాసేపు అటూ ఇటూ తిరిగి మెట్లుదిగి ఆరు బయటికి వచ్చాడు అతను. అప్పటికి బాగా తెల్లవారిపోయింది.

"గుడ్‌మార్నింగ్ నాన్నగారూ" పిల్లలిద్దరూ ఒకేసారి అన్నారు. చెట్లమధ్య చెప్టా మీద కూర్చున్న మహేంద్ర తను జరిగి వాళ్లకీ చోటు ఇచ్చాడు.

"తాతమ్మగారూ, నాన్న తాతగారూ ఎలా ఉన్నారు? " జిక్కి అడిగింది.

మహేంద్ర ఇద్దరివైపు మార్చి మార్చి చూస్తూ "కాలేజ్ నుంచి వచ్చేటప్పుడు వారానికోసారి వాళ్లని చూసి వస్తే వాళ్లు సంతోషిస్తారు. వాళ్ల బాగోగులు తెలుసుకోవడం కన్నా చూసి వస్తే బావుంటుంది" అన్నాడు.

జిక్కి దిగులుగా అంది. "మీరు వెడితేనే తాతమ్మగారు మీ చేతులు పట్టుకుని "మమ్మల్నెప్పుడు తీసుకువెడతావురా మహీ అని ఏడుస్తుందిట. మేము వెళ్లినా అదే పని చేస్తుంది. మేమా బాధ చూడలేం నాన్నగారూ! అయినవారు ఎవరూ లేని అనాథల్లా వాళ్లు దిక్కులు చూస్తూంటే మేము భరించలేం"

మహేంద్ర చిరాకుపడ్డాడు "నాకు మాత్రం లేదూ ఆ బాధ. మీరు నామీద దండెత్తగలరు. నేను...నేను ఏమీ చేయలేను. నాకు ప్రతిక్షణం చిత్రవధే. ఇప్పుడు నేను ఏంచేయాలో మీరే చెప్పండి"

మనో వంక తల అడ్డంగా తిప్పాడు. "ఈ చర్చలూ వినడాలూ, సలహాలు ఇవ్వడాలూ ఇవన్నీ ఎప్పుడో చేయాల్సిన పనులు. చాలా ఆలస్యం అయిపోయింది నాన్నగారూ" మహేంద్ర కర్చీఫ్‌తో కళ్లు తుడుచుకున్నాడు. క్రితం రోజు వేసుకున్న బట్టలు మార్చుకోలేదు. అవి మాసిపోయాయి కూడా. తండ్రి పడుతున్న బాధ అన్నాచెల్లెళ్లిద్దరికీ తెలుసు.

మహేంద్ర చుట్టూ చూశాడు. అతనికి అప్పుడప్పుడు అనిపిస్తూ ఉంటుంది. ఈ చెట్లూ, చేమలూ, వలస వచ్చి కొమ్మల మీద వాలే పక్షులూ తనని "మహీ! మహీ! తాతగారూ బామ్మ ఏరీ? " అని నిలదీస్తున్నట్లు.

ఓ గాలి తుమ్మెద చెవి దగ్గర్నుంచీ వెళ్తూ "మహీ! వాళ్లేరీ" అన్నట్లు అనిపిస్తుంది. రోజులు గడుస్తుంటే తనకి పిచ్చెక్కుతుందని తెలిసిపోతుంది. ఓ చిన్న పొరబాటు అతన్ని నిలువునా కాల్చేస్తోంది.

నిన్నటి నుంచీ సరిగా భోజనం చేయకపోవడంతో కళ్లూ, చెంపలూ లోపలికి వెళ్లిపోయాయి. అపరాధ భావం తలెత్తనీయడం లేదు. నిశ్శబ్దంలో కూరుకుపోతున్న తండ్రిని మరీ దోషిని చేయాలనిపించలేదు. ఇద్దరూ చెరో వైపూ కూర్చుని అతని భుజం మీద చేయివేసి తలని ఆన్చారు.

మహేంద్రకి వేయి ఏనుగులు బలం వచ్చినట్లయింది. ఒక తల్లికి పుట్టిన పిల్లల జీవితాలే ఒకలావుండవు. వాళ్లల్లో ఎవరికో ఒకరికి తప్పనిసరి బాధ్యతలు తలకుమించిన భారాలౌతాయి. తప్పించుకోలేరు.

భువనేశ్వరి మరో కప్పు కాఫీ తీసుకువచ్చి అతనికి ఇచ్చేసి వెళ్లిపోయింది. ఎన్ని ఉన్నా తను ఫారిన్ వెళ్లి తీరుతుంది. ఎవరు అడ్డు వచ్చినా లెఖ్ఖ చేయదు. తనతోబాటు భర్తా పిల్లలూ కూడా వస్తారు. ఆరోజు ఎంతో దూరం లేదు.

మహేంద్ర కాఫీగ్లాసు కింద పెట్టాడు. "మిత్రవింద ఆశ్రమానికి వస్తుంది. మీరూ రండి."

"ఎవరు నాన్నగారూ? " నమ్మలేనట్లు అడి

**ఒక్క ముక్కలో ఎంతో చెప్పడాన్ని సూక్తి అంటాం. కుదింపుదాని దేహం. చమక్కులే దాని ప్రాణం. – కొలెరిడ్జ్**

గాడు మనోహర్

"నా ఫ్రెండ్. మీకు పరిచయం చేస్తాను"

మనోహర్, జిక్కీ మొహామొహాలు చూసుకున్నారు.

"ఎన్ని గంటలకి వస్తుంది నాన్నగారూ" జిక్కీ అడిగింది.

"ఐదు గంటలకు మీరు అక్కడికి వచ్చేయండి. నేను మూడు గంటలకే వెళ్లాలి."

"నాన్నగారూ"

మహేంద్ర లేచి "చూస్తారుగా" అని బాత్ రూమ్ వైపు వెళ్లాడు.

జూబ్లీహిల్స్‌లో ఓ గేటు ముందు ఆగి ఆ ఇంటినే పరీక్షగా చూస్తూ ఈ ప్రపంచాన్ని మరిచిపోయిందామె. ఎత్తైన కొండ మీద కట్టారు. 'ఆలిండియా గుండ్రాళ్ళ మహాసభ' లా చిన్నవీ పెద్దవీ, మరీ పెద్దవీ, యింకా పెద్దవీ ఎన్నో రంగుల్లో ఉన్న రాళ్ళ మధ్య ఒద్దికగా ఉందా ఇల్లు.

కాస్తో కూస్తో రసహృదయం వున్న వారెవరైనా కంటిరెప్ప వేయకుండా ఆ ఇంటి అందచందాల్ని చూస్తూ ఉంటారు. గాలికి ఎగిరి మొహం మీద పడుతున్న వెంట్రుకల్ని వెనక్కి తోస్తూ 'ఆహా', అనేసింది.

ఆ అమ్మాయి మిత్రవింద. ఆ ఇల్లు బాల సుబ్రహ్మణ్యం గారిది. అలికిడికి కుక్క మొరుగుతూ వచ్చింది. దాన్ని గొలుసు పట్టి లాగుతు "సిస్సీ... స్టాప్... స్టాప్... ఐ. సే' అని అరుస్తూ భారంగా అడుగులు వేస్తూ వచ్చారు ఆ ఇంటి వైభవం మత్తులోంచి బయటి! రాని మిత్రవింద చిత్తరువు అయింఁ.

కుక్క మొరగడం ఆపింది.

"ఏమ్మా! మీరు లోపలికి వస్తారా" అని అడిగారాయన. మొహం మీద జల్లు పడ్డట్లు ఉలిక్కిపడి "నమస్కారం అండీ నేను మిత్రవిందని.

"ఓ!" బాలసుబ్రహ్మణ్యం గారు చేతిని ముందకు చాపి "చాలా సంతోషం" అన్నార.

ఆయన చేతిని అందుకుని స్నేహపూర్వకంగా గట్టిగా పట్టుకుని నెమ్మదిగా వదిలేసింది.

"కింద స్కూటీ పెట్టాను ఫరవాలేదుగా"

"ఫరవాలేదు"

"మన దేశంలో దేవుళ్ళందరూ కొండల్లోనే ఉంటారు. ఈ మెట్లన్నీ ఎక్కి, ఈ కనుమ ల్లోంచి జాగ్రత్తగా అడుగువేస్తూ చేరుకోవడం, మరిచిపోలేని అనుభూతి".

"ఎంతమాట" అని "ఏమ్మా సైడ్ బై సైడ్ మీరు జర్నలిజం కూడా చేస్తున్నారా? " అడిగారు.

ఒక్కో మెట్టూ ఎక్కుతూ చుట్టూ చూస్తుంటే మిత్రవింద ఒళ్ళు పులకరిస్తోంది.

కాయిన్‌కి రెండు వైపులా బొమ్మ, బొరుసూ వున్నట్లే జీవితానికి కూడా రెండు అనుభవాలున్నాయి కాబోలు.

"మెల్లగా, జాగ్రత్తగా" వెనుకనుంచి బాల సుబ్రహ్మణ్యం గారు హెచ్చరిస్తున్నారు. కాలు ఏమాత్రం జారినా కొండమీంచి బండ రాయి దొర్లినట్లు కిందపడి పోవాల్సిందే.

మిత్రవింద నవ్వుతూ అడిగింది. "ఇంత ఎత్తులో, ఇంత అందమైన వాతావరణంలో ఇలాంటి ఇల్లు కట్టడం గ్రేట్".

"థ్యాంక్యూ" అన్నారు ఆయన. పదిహేను ఇరవయి మెట్లు ఎక్కేందుకు పది నిమిషాలు పట్టింది.

కారు వచ్చేదారి వెనుకవైపు కనిపిస్తోంది.

లోపలికి రాగానే మంచినీళ్ళ చెంబూ గ్లాసుతో మిసెస్ బాలసుబ్రహ్మణ్యం రెడీగా ఉన్నారు. మిత్రవింద ఆ గదిలోకి రాగానే. వేలాడుతున్న 'షాండ్లియర్ల' వైపు చూస్తుండిపోయింది.

"కూర్చోమ్మా" అన్నదావిడ. మంచినీళ్ళు అందించి "ఎండ బాగా ఉంది. పగలంతా స్నానం చేస్తున్నట్లే. కొండల మధ్య ఇల్లు అవ్వడం వల్ల నిప్పుల్లో పెట్టినట్లుంటుంది. హైదరాబాద్‌లో ఇంకెక్కడా స్థలమేలేనట్లు ఈయన ఇక్కడ కట్టించారు".

## మాటకటువైనా మనసు వెన్న



కవి శేషేంద్రశర్మకు విశ్వనాథంటే వల్లమాలిన అభిమానం. విచిత్రమేమంటే ఆయనెంత ప్రాచీనుడో శేషేంద్ర అంత ఆధునికుడు.. తనబాణీలో ఆయన ఓ వచనకవితా సంపుటిని రాసి ముందు మాట రాయమంటూ విశ్వనాథకు పంపారు. ఎన్నాళ్లకూ జవాబులేదు. విసుగొచ్చిన శేషేంద్ర ఒకసారి తనేవెళ్లి అడిగారు.. 'నీకు మంచి కవితా ధార ఉంది. కానీ ఏమిటయ్యా? కన్నీళ్లు.. కష్టాలు కార్మికులు.. ఇదితప్ప మరో అంశం దొరకలేదా కవిత్వం రాయడానికి? ఇలాంటివాటికి నేనేంరాయాలి?' అన్నారు విశ్వనాథ కాస్తంత కటువుగా.

శేషేంద్ర కూడా తక్కువ తినలేదుగా.. సరే పుస్తకం ఇచ్చేయండి అనిపట్టుకొచ్చేశారు. ఇంటికివచ్చాక చూసుకుంటే ఆశ్చర్యం! అందులో విశ్వనాథ ఆ కవిత్వం గురించి అత్యద్భుతంగా రాసిన 'ముందుమాట' ఉంది. అందుకే పైకి కటువుగా కన్పించినా విశ్వనాథ హృదయం వెన్నలాంటిది అంటారు శేషేంద్ర.

"చాలా బావుంది. మళ్ళీ మళ్ళీ చూడాలనిపించేలా ఉంది. కళాత్మక దృష్టితో కట్టిన ఇల్లండీ బాబూ!"

"ఇంత ఎండలో బయలుదేరావేమిటమ్మా" అంది మీనాక్షి. మిసెస్ బాలసుబ్రహ్మణ్యాం ఆమెని పరిచయం చేశారు.

"మా కోడలు. సంగీతం బాగా వచ్చు. చాలా బాగా పాడుతుంది. ఈ అమ్మాయి స్వరం విని ముందు మా వాడూ, ఆ తర్వాత మేము పడిపోయాం"

మిత్రవింద నవ్వింది. "మీరు బాగా మాట్లాడతారు."

"థ్యాంక్స్" ఆవిడా నవ్వారు. "ఈ ట్రస్టులున్నాయి చూడమ్మా. ఎంత దయా."

వింటోంది మిత్రమిద.

"మీనాక్షి కచేరీ పెట్టించి ఆ డబ్బుకూడా ఆశ్రమాల కోసం ఖర్చు పెడతారు. ఇది మీనాక్షి చేసుకున్న అదృష్టం ఇటువంటి అవకాశం అందరికీ రాదు".

"గ్రేట్" అంది మిత్రవింద సంతోషం పట్టలేక.

"అయ్యో! అసలు విషయమే అడగటం మరిచిపోయాను. మా మనవల కోసం వచ్చావామ్మా"

మిత్రవింద చెప్పింది. "మీ ఇంటి ధ్యాసలో పడి వచ్చిన మాటే మరిచిపోయాను. ఇవాళ ఇక్కడ షౌరినర్స్ సమావేశం ఉందనీ, ఇక్కడికి వి.ఐ.పి లు వస్తున్నారని తెలిసి వచ్చాను. ఈ విషయం మిస్టర్ బాల సుబ్రమణ్యాం గారికి కూడా చెప్పలేద.

"వస్తున్నా... వస్తున్నా" బయట నుంచి గుమ్మం దాటుతూ అన్నారు బాలసుబ్రహ్మణ్యాం.

ఎడమచేత్తో నెత్తి మీద ఒకటి వేసుకుని "మతి లేదు నాకు క్షమించండి" అంది నొచ్చుకుంటూ.

బాలసుబ్రహ్మణ్యాం గారు సోఫాలో

కూర్చున్నారు. హాలు చల్లగా వుంది. బయటి వాతావరణం గుర్తుకు రావడం లేదు. తను ఫోన్ చేయాల్సింది. ఏదో అడ్వంచర్ అనుకుంది. ఛీ వచ్చిన పని మరిచిపోయిందేమిటి?

"సారీ సర్" ఇబ్బందిగా చూసింది.

"నో ప్రాబ్లమ్. ఉడుకురక్తం యిలాగే వుండాలి ఈ వయసు చేసే అల్లరిలో కల్మషం ఉండదమ్మా. నువ్వ వస్తున్నావని జార్జ్, డానియల్, నారాయణ, రావు వీళ్ళంతా ముందే చెప్పారు. పనీ పాటా కట్టిపెట్టి నీ కోసమే చూస్తున్నాను."

"నా కోసమా"

"అవునమ్మా"

సిగ్గు పడింది మిత్రవింద.

బాల సుబ్రహ్మణ్యం గారు ఒళ్ళంతా కదిలేట్లు నవ్వుతూ "నీలాంటి డాషింగ్ హీరోయిన్ సిగ్గుపడడం సిగ్గుకే సిగ్గుగా వుంటుంది" అన్నారు.

"థ్యాంక్యూ సర్" అని నిశ్శబ్దం అయిపోయింది. మిసెస్ బాలసుబ్రహ్మణ్యం కలుగచేసుకుని "మాట్లాడమ్మా నువ్వు సంఘ సేవ చేస్తావా? " అని అడిగింది.

మిత్రవింద చేయి అప్రయత్నంగా గుండె మీదకి వెళ్ళిపోయింది.

"ఇప్పుడు తప్పేం అన్నాను? నువ్వు చేస్తున్న పని సామాన్యమైందేం కాదు. ఈ రోజుల్లో నీ వయసు పిల్లలు చదువూ, షికార్లూ ఫ్రెండ్స్ ఇవే ఇష్టపడుతున్నారు. నువ్వేమిటో ఎ.డిలో పుట్టి బి.సిలోకి వెళ్ళిపోతున్నావు."

"బాగా అడిగావు అరుంధతీ ఇంత చిన్నపిల్లలు లక్ష్యాలు పెట్టుకుని వాటికోసం జీవితాన్నే ఫణంగా పెడుతున్నారు. ఎవరికీ శ్రద్ధలేని సబ్జెక్ట్. నిన్నెలా ఆకట్టుకుందో అర్థం కావడంలేదు. ఎనీవే గాడ్ బ్లెస్ యూ."

ఫైలు తీసుకుని చదువుతూ ఉండిపోయింది.

బాలసుబ్రహ్మణ్యం కోడలి వైపు చూసి "నీ పాట వినిపించి ఆ రుచి కూడా చూపించమ్మా" అన్నారు.

మిత్రవింద చప్పున తలెత్తింది "అవును పాటలంటే నాకూ ఇష్టమే కానీ పాడలేను"

"అదేమ్మా" మీనాక్షి కంగారుపడింది.

"టైము లేక, రెండు పడవల మీద ఒకేసారి ప్రయాణం చేయడం నావల్ల కాదు కనుకా పాడలేను అంతేనమ్మా"

"మీనాక్షీ నువ్వు మొదలుపెట్టు"

"మామయ్యగారూ! ఏదో ఓ వంకతో నా చేత పాడిస్తూనే ఉంటారు. మీరు పాడమని అడిగితే నేను పాడనా చెప్పండి"

"ఓకే నాకు ఇష్టం వినడం. పాడమ్మా"

ఆ ఇంటిని, మనుషుల్ని చూస్తూంటే ముచ్చటేసింది మిత్రవిందకి. తన ఇంటినీ, పరివారాన్నీ చూస్తే బాలసుబ్రహ్మణ్యం గారు మరెంత సంబరపడి పోతారో? హాల్లో గోడమీద వరుసగా రవివర్మ గీసిన చిత్రాలున్నాయి. శ్రీ రామ పట్టాభిషేకం, గరుత్మంతుడి వీపుమీద శ్రీదేవినీ, భూదేవినీ రెండుచేతుల్తో గట్టిగా పట్టుకుని ఈ తొడ మీదా, ఆ తొడమీదా కూర్చోపెట్టుకున్న శ్రీ మహా విష్ణువు, హిమాలయాల మీద ఓ వైపు కుమారస్వామి, మరోవైపు విఘ్నేశ్వరుడు, నందీశ్వరుడూ, మొత్తం సకుటుంబ సపరివార సమేతంగా వేంచేసియున్న పరమేశ్వరుడూ, నెత్తిన గంగా, పక్కన పార్వతమ్మా ఒక్కో చిత్రం మిత్రవిందని నిలబెట్టేస్తోంది.

గంగావతరణంలో నందీశ్వరుడిని ఆనుకుని భవాని, రెండు చేతుల్నీ నడుం మీద పెట్టుకుని మెడ ఎత్తి ఆకాశం వైపు చూస్తున్న శంకరుడు ఎంత పెద్ద జుట్టో !భుజాలు దాటి, రెండు కాళ్ళూ ఎడంగా ఉంచి.. బరువునెత్తిన పడుతుంటే తట్టుకునేందుకు వీలుగా...

"మిత్రవిందా! గోడకి అతుక్కుపోయావేమిటమ్మా"

పెద్ద ఉలికిపాటే. మిత్రవింద రెండు చేతుల్నీ రెండు చెంపల మీదా పెట్టుకుని "ఏం కళాఖండాలండి బాబూ. ఆ కళ్ళూ, చెంపలూ ఆయనకే చెల్లాయి. రవివర్మ గారు మన వారు కావడం మన అదృష్టం" అని "మీ పాట కూడా విని నాజన్మ ధన్యం కానీండి మీనాక్షిగారూ" అంది.

హాయి.... హాయి...

ఎంత హాయిగా వుందో పాట. వీనుల విందే. మరో ప్రపంచంలోకి తీసుకువెళ్లి నట్లు. "అబ్బ" అంది. "ప్రపంచంలో కష్టాలూ, కన్నీళ్ళే అనుకున్నాను. వెతు క్కుంటే జీవితం ఓ స్వర్గసీమ అనిపిస్తోంది సర్"

బాల సుబ్రహ్మణ్యం నవ్వారు "అదేం లేదమ్మా మన మూడ్‌ని బట్టి మన అభిరు చులు మారుతుంటాయి. అంతే. అసలు విషయం మరిచేపోయాం. నువ్వు ఏమి అడగాలని వచ్చావో తెలుసుకోవచ్చా"?

నవ్వింది మిత్రవింద.

"అంటే చెప్పాలని లేదు అంతేనా? "

"అయ్యయ్యో! అదేం లేదు సర్, నాదగ్గర ప్రశ్నలే ఉన్నాయి. జవాబు చెప్పేది మన కోసం తాపత్రయ పడేవాళ్ళు, వాళ్ళనోటి నుంచి వస్తే మీకు తృప్తిగా ఉంటుందని"

"మీటింగు ఐదుగంటలకి మిత్రవిందా... ఇంత త్వరగా వచ్చావేమిటి? "

"తెలీదు. నాన్నగారు మాత్రం లేడికి లేచిందే ప్రయాణం అంటూంటారు. తీరాబ యలుదేరాక వెనక్కి వెళ్ళడం దేనికని ముందుకే వచ్చేశాను. సెంటిమెంట్"

మిసెస్ బాలసుబ్రహ్మణ్యం అడిగారు. "ఇంతకీ ఏం చదువుతున్నావమ్మాయ్"

"అందర్నీ" పొరబాటున అనేసింది. ఆ తర్వాత నాలుక కరుచుకుంది. టైమ్ చూస్తే నాలుగు దాటుతోంది.

బాలసుబ్రహ్మణ్యం మీటింగ్‌కి తయారు అయేందుకు "జస్ట్ ఎ మినిట్"అని వెళ్ళిపో యారు. ఆయన వెనకే ఆవిడ.

మీనాక్షి కూర్చున్నచోటు నుంచి లేచి మిత్రవింద దగ్గరకి వచ్చి కూర్చుంది.

"చాలా త్వరగా వచ్చేశానాంటీ. మీక్కూడా ఇబ్బంది కలిగించాను. సారీ! మీటింగ్ అయిపోగానే వెళ్ళిపోతాను."

"ఏం ఫరవాలేదు. పగలంతా ఎవరో ఒకరు వస్తూనే ఉంటారు. అతిథిదేవోభవ! అన్నట్లు ఎవరూ రాకపోతే మాకూ బాగుం డదు. ఇంటి నిండా మనుషులుండాలని మామగారు అంటుంటారు. అత్తయ్యగారి తమ్ముడి మనవలూ, మామయ్యగారి అక్క మనవలూ అందరూ ఈ ఇంట్లోనే వుంటారు."

"ఓహో" అంది మిత్రవింద.

వేసవి, వింటర్‌లకి ఇలా సెలవులు వస్తే చాలు పరిగెత్తి ఠంచనుగా వచ్చి రేపు స్కూల్స్ రీ-ఓపెన్ అనగానే వెళ్ళిపోతారు. అప్పుడు చూడాలి ఇళ్లు రణగొణ ధ్వనీ రాళ్ళ వానా... ఇల్లుపీకి పందిరి వేస్తారు.

మిత్రవిందకి టైము జరిగినట్లే తెలియ లేదు.

మిసెస్ బాలసుబ్రహ్మణ్యంగారు కూల్ డ్రింక్ తీసుకువచ్చింది.

మిత్రవింద నవ్వి "పొట్ట పగిలిపోతుందే మోనమ్మా" అంది.

బాలసుబ్రహ్మణ్యంగారు తయారై వచ్చే శారు. "మనం ఇంక పైన కాన్ఫరెన్స్ హాల్లోకి వెడదామా"?

మిత్రవింద బుర్ర వూపింది. ఆవిడకి దగ్గ రగా వెళ్ళి ఆ చేతుల్ని గుప్పిట్లో బంధించి "మీరు నాకు బాగా నచ్చారు. థాంక్యూ అండీ. థాంక్యూవెరీమచ్. మీరు నన్ను బాగా చూసుకున్నారు. మీటింగ్ అయాక అటునుంచి అంటే వెళ్ళిపోతాను." అని ముందుకు కదిలింది. ఆ పిల్ల మనసు ప్రేమసాగరంలో మునిగి తేలుతోంది. మౌనంగా ఆస్వాదిస్తూ ఉక్కిరిబిక్కిరి అవు తోంది.

విశాలమైన హాల్లో పాతికముప్పై కుర్చీలు

వేసి ఉంచారు. పెద్ద పెద్ద కిటికీలూ, నాలుగు తలుపులూ వెలుతుర్నీ, గాలినీ ఏక కాలంలో తీసుకువస్తున్నాయి.

డయాస్ మీద టేబిల్ కి ఆ వైపు మరి కొన్ని కుర్చీలు వేశారు. మీటింగ్‌లో తమ తమ అభిప్రాయాల్ని తెలియజేసేందుకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. ట్రస్ట్‌మెంబర్స్ ఒక్కొక్కరే రావడం ప్రారంభించారు. అర గంటలో హాలు నిండిపోయింది. ముందు వరుసలో ప్రెస్‌కీ, మీడియాకీ కేటాయిం చారు. మిత్రవింద అందరినీ గమనిస్తోంది. ఆశ్రమంలో తనుచూసిన పెద్దవాళ్ళు కూడా వస్తున్నారు.

మిత్రవిందకి ఆ వాతావరణం ఊపిరి ఆడనీయడం లేదు. అదో సమావేశం అనీ నలుగురూ కలిసినప్పుడు పంచుకునే సంతోషం, ఆనందం వుంటుందనుకుంది కానీ యిలా నిశ్శబ్దం ప్రాణం తీస్తుందనుకో లేదు.

మిత్రవింద చేతిలో పెన్ను కదిలేందుకు సిద్ధంగా వుంది.

నిశ్శబ్దాన్ని బద్దలు చేస్తూ బాలసుబ్ర హ్మణ్యం గారు గొంతువిప్పారు. అక్కడ కూర్చున్నవాళ్ళు ఆత్రంగా ఆయన చెప్పబో యేది వినేందుకు సిద్ధమయ్యారు.

"అందరికీ నమస్కారం. మన ఈ సమా వేశం ఎప్పుడూ జరుగుతున్నదే. ఎప్పటిక ప్పుడు మార్పులూ, చేర్పులూ, అభివృద్ధి పథకాలూ, వీటిని చర్చించడం లోటుని భర్తీ చేయడం లాంటివి చేస్తున్నాము"

"మన ఆశయాలు ప్రతీ ఆశ్రమానికి తెలి యాలి. విస్తృత ప్రచారం చేసి మనల్నే న మ్ముకున్న మనవాళ్ళకి సుఖాన్నీ, సంతో షాన్నీ, ఆనందాన్నీ పంచివ్వాలి. వృద్ధాశ్ర మంలో ఉన్నవాళ్ళకి ఏలోటూ రాకుండా చూడాలి. అందుకు మనం ఇంకా ఏంచే యాలో మీమీ అభిప్రాయాల్ని చెప్పండి. లేదా రాసివ్వండి" చాలా క్లుప్తంగా ముగిం చారు.

అక్కడున్న వాళ్ళందరూ కొద్దిసేపు మౌనంగా ఉండిపోయారు. మాట్లాడేందుకు ఏముంది? చర్వితచర్వణం. ఒక విధంగా ఆలోచిస్తే ఇదో హాస్టల్ వున్న స్కూలు లాంటిది. ప్రతిక్షణం కట్టుబాట్లూ, సిద్ధాం తాలూ వీటి గురించే చర్చించడంతో స్వంత గూటి అనుభూతి సంగతి దేవుడెరుగు బంగారుపంజరంలో పక్షుల్లా విలవిల్లాడి పోవడం మాత్రం నిశ్చయంగా తెలుస్తోంది.

బాలసుబ్రహ్మణ్యంగారు తలెత్తి ఓసారి చుట్టూ కలియచూశారు. ట్రస్ట్‌మెంబరు లేచి వెళ్ళి తన అభిప్రాయం చెప్పారు. "నా మటుకు నాకు మన ఆశ్రమం ఓ స్వంత ఇల్లు మాదిరిగానే కనిపిస్తోంది. వేళకి పను లన్నీ ఒక ప్రణాళికాబద్ధంగా జరిగిపోతుం టాయి. ఎవరికి ఏం కావాలో తెలుసుకునేం దుకు ఇంటికి పెద్ద కొడుకులా రంగారావు గారు, తల్లిలా చూసుకునే అన్నపూర్ణగారూ బంధువుల్లా గానో రక్తసంబంధీకుల్లానో అర మరికలు లేకుండా కలిసిపోయే పెద్దలూ యింత మందితో నా కంటికి పెళ్ళివారి ల్లులా కనిపిస్తుంది"

"ఆపండి"

ఉలిక్కిపడ్డట్టు అందరూ ఆ వైపు చూశారు.

ఆయన నిలబడ్డారు. అందరికీ చేతులు జోడించి నమస్కారం చేశారు.

బాలసుబ్రహ్మణ్యంగారు కంగారుపడి కుర్చీలని జరుపుకుంటూ, దారిచేసుకుని ఆ పెద్దాయన దగ్గరికి వచ్చేశారు.

"ప్లీజ్! నన్ను అడ్డుకోకండి. చెప్పనీ యండి"

బాలసుబ్రహ్మణ్యం ఆగిపోయి ఆయన వైపు చూస్తూండిపోయారు.

ఆయన భవానీ శంకరంగారు. ఆవేశంతో

**తల్లి పిల్లవాడిని కనిపెట్టి చూస్తున్నట్లు. మనస్సును కనిపెట్టి చూడు.**

– స్వామి విశారదా ప్రియానంద

ఆయన ఒళ్ళంతా కదిలిపోతోంది. "ఏమన్నారు? ఆశ్రమం ఓ స్వంత ఇల్లు మాదిరిగా కనిపిస్తోందా? రంగారావు కొడుకులా, అన్నపూర్ణ తల్లిలా చూసుకుంటున్నారా? క్షమించండి. ఆ ఇద్దరూ నిజంగానే బాగా చూసుకుంటున్నారు. అంతేగానీ ఆశ్రమం గురించి అతిశయోక్తులు వద్దండీ"

"బాగా డబ్బున్న వాళ్ళందరూ చేసేపనే ఈ బోర్డ్ మెంబర్స్ చేస్తున్నారు. కోటివిద్యలూ కూటికొరకే అన్నట్లు ఆశ్రమాల ద్వారా వ్యాపారం చేస్తున్నారు."

ఒక్కసారి హాలు దద్దరిల్లింది. "ఆపేయండి, అన్యాయం" అంటూ బాలసుబ్రహ్మణ్యం గారు అతి ప్రయత్నం మీద వేదికనెక్కి మైకు అందుకున్నారు. "దయచేసి కూర్చోండి. ఆయన ఆరాటాన్ని తెలుసుకుందాం. ప్లీజ్. నిశ్శబ్దంగా వుండండి"



ఐదు నిమిషాలకి గానీ సద్దుమణగలేదు.

ఆయన నోరు విప్పారు. "వ్యాపారం చేయడం, డబ్బు సంపాదించడం ఎంత మాత్రం తప్పుకాదు. మీ దగ్గర వున్న డబ్బుని సద్వినియోగం చేయండి. వయసు మీరిన మాలాంటి వాళ్ళకి మీరు ఆశ్ర యాన్ని ఇవ్వడం లేదు. నరకంలోకి తోసే స్తున్నారు".

మళ్ళీ పెద్దపెట్టున గొడవ మొదలైంది.

భవానీశంకరం గారు చెప్పడం ఆపలేదు. "నరకం అనేమాట మీ అందర్నీ బాధించి ఉంటుంది. నిజం నిష్ఠూరంలా ఉంటుందం టారు. ఆశ్రమానికి వచ్చే ముందు నేనూ నా భార్య మాదైన పెద్ద ఇంట్లో మా మన వడూ అతని భార్యా, వాళ్ళపిల్లలూ, నౌకర్లూ, స్నేహితులూ, బంధువులు వీళ్ళ మధ్య సుఖంగా, సంతోషంగా ఉండేవాళ్ళం. రోజులు క్షణాల్లా దొర్లిపోయేవి"

"ఉన్నట్లుండి ఓ రోజు పేపర్లో యాడ్ చూశాను. వృద్ధాశ్రమాల గురించి ఆ వృద్ధుల మనోగతం ఇవన్నీ ప్రచురించారు. ఓసారి చదివి వదిలేశాను. వారం పదిరో జుల తర్వాత మా మనవడూ వాడి భార్యా తారాస్థాయిలో పోట్లాడుకుంటున్నారు. నేనూ నా భార్యా. హడలిపోయాం విషయం అడిగి తెలుసుకుందాం అని ప్రయత్నిస్తే అసలు వాళ్ళు వినే స్థితిలో ఉంటే కద? "

ఆయన గొంతు జీరపోయింది. కళ్ళు తడుస్తున్నాయి.

"మీరు ఇలా వచ్చి ఇక్కడ కూర్చుని చెప్పండి" బాలసుబ్రహ్మణ్యం గారు ఆయన దగ్గరికి వచ్చి జాగ్రత్తగా పట్టుకున్నారు.

భవానీశంకరం గారు దీర్ఘంగా నిట్టూ ర్చారు. "ఫరవాలేదు. నాకు ఇక్కడే బావుంది. అక్కడ వేదిక మీద కూలిపోతా నేమో..."

"ఓ. కే... ఓ. కే", బాలసుబ్రహ్మణ్యంగారు ఆయన్ని సమర్ధించారు.

'ఆc" అని గొంతు సవరించుకుని చెప్పడం మొదలుపెట్టారు.

భువనేశ్వరి అంటోంది. "ఇదేదో బావుంది. పెద్దవాళ్ళని వాళ్ళ ఖర్మానికి వాళ్ళను వదిలేయకుండా ఓ చోట భద్రంగా వుంచవచ్చు. చిన్నపిల్లలకి కేర్ సెంటర్లా పెద్దవాళ్ళకి కూడా ఈ ఏర్పాట్లు జరుగుతు న్నాయన్న మాట. మనలాంటి వాళ్ళు ఆఫీ సులకి నిశ్చింతగా వెళ్ళచ్చు".

"నువ్వేం మాట్లాడుతున్నావో నీకేమైనా అర్థం అవుతోందా? ఇప్పుడీ వయసులో జాబ్ ఏమిటి? మనకున్నది చాలకనా ఆఫీ సంటూ ఆలోచిస్తున్నావు".

"నాకు జాబ్ చేయాలని ఎప్పటినుంచో ఉంది. ఆ సంగతి మీక్కూడా చెప్పాను. మీరు వినకపోతే అది నా తప్పు కాదు."

"అవసరం లేదు."

"మీరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా నేను చేసే పని మానను. రేపేవెళ్ళి వృద్ధాశ్ర మంలో తాతగార్నీ, అమ్మమ్మగార్నీ చేర్చుకునే విషయం తెలుసుకుని వస్తాను. ఓ. కే" ఆమె చరచరా వెళ్ళిపోయింది.

మహేంద్ర మొహంమీద చన్నీళ్ళు కుమ్మ రించినట్లయింది. క్షణం దిమ్మెరపోయాడు. తన భుజం మీద చేయిపడడంతో అతనికి ఎవరో ఈలోకంలోకి తోసినట్లు తోచి తల తిప్పి భుజం మీదుగా చూశారు. అక్కడ భవానీశంకరంగారు. తలతిప్పి "బాధపడకు" అన్నారు.

"తాతగారూ! సారీ! మీరు భువన మాటలు పట్టించుకోవద్దు ప్లీజ్, ఆమె చెప్ప గానే వినేంత మూర్ఖుణ్ణికాను. మిమ్మల్నీ వదిలి నేనుమాత్రం ఉండగలనా? "

అప్పటికే ఆయన వెళ్ళిపోయారు.

"ఇదీ జరిగిన సంగతి. నా మనవడు మహేంద్రకి మేమంటే పంచప్రాణాలు, ఎవరినీ నొప్పించని స్వభావం వాడిది. అయినా ఏంలాభం రాత్రిపగలూ వాడిని నిద్రపోనీయకా, తిండి తిననీయకా తన

పంతం నెగ్గించుకుని ఇక్కడ చేర్పించింది" ఆయన కొద్దిసేపు ఆగారు.

"ఇదో రకం జైలు. అందరూ వుండి యింత ఆనందంగా గడిపేస్తూ ఉంటే ఇంకా ఏం కావాలి అని అడుగుతుంది మా మన వరాలు. మాన్ ఈజ్ ఎ సోషల్ యాని మల్ అనే విషయం ఎవరికి తెలియనిది? ఎంత మంది మధ్యలో కాలం గడిపినా రాత్రయే సరికి యిల్లు కావాలనిపిస్తుంది."

ఆయనకి ఆయాసం వచ్చింది. పక్కనే వున్న మరో పెద్దాయన మంచినీళ్ళసీసా యిచ్చాడు. ఆ నీళ్ళని తాగేసి భవానీశం కరం చెప్పారు. మాతో చాలామంది యిక్కడ మా డబ్బుతోటే బతుకుతున్నాం. ఇంకా మా బంధువుల దగ్గర డొనేషన్లు తీసుకుంటున్నాం. అవి కూడా ఆశ్రమం అభివృద్ధికి ఖర్చుపెట్టమని మీకే అంది స్తున్నాం. మిష్టర్ బాలసుబ్రహ్మణ్యం యీ పద్ధతి మీరు మార్చుకుంటే మేము మాక్కా వలిసిన బతుకు బతికేస్తాం"

ఆయన ఒళ్ళంతా కదిలించి ఓనవ్వునవ్వి "ఇందుకు నన్నేం చేయమంటారో చెప్పండి" అని అడిగారు.

"మాకు మా ఇల్లు కావాలి. ఈ ఆశ్ర మంలో అనాథలెవరూ లేరు. మా అందరికీ ఆస్తిపాస్తులున్నాయి. నౌకర్లని పోషించగల స్తోమత ఉంది. మా కోసం పెడుతున్న ఖర్చుల్ని అనాథల కోసం వినియోగించండి. దిక్కూమొక్కూ లేకుండా రోడ్లమీద వేలాది మంది కనిపిస్తారు. మీరు మానవత్వంతో సేవచేయాలనుకుంటే వాళ్ళకి చేయండి. మాకొద్దు, మేమంతా ఇక్కడ సుఖంగా బ్రతి కేస్తున్నట్లు నటిస్తున్నాం"

ఆడియన్స్ మధ్య సూది పడితే శబ్దం వినిపించేంత నిశ్శబ్దం.

అందరూ తనే అయి తనే అందరూ అయి ఆయన ఒక్కరే మాట్లాడుతున్నారు.

ఉన్నట్లుండి చిన్నపిల్లవాడిలా బావురు మన్నారాయన.

హాల్లో కూర్చున్నవాళ్ళు హడలిపోయారు. కంగారు కంగారుగా చుట్టేశారు. బాలసుబ్ర హ్మణ్యంగారితో బాటు మిత్రవింద కూడా అందరి మధ్యకీ వచ్చేసి వాళ్ళని జాగ్రత్తగా కూర్చోబెట్టడంలో సాయపడుతోంది.

వాళ్ళని చూస్తుంటే బెంగగా వుంది. ఆ పెద్దమనిషి చాలా హైరానా పడుతున్నారు. మిత్రవింద రెప్ప వేయకుండా చూస్తోంది. అసలు ఏం చేయాలని వచ్చింది? ఏం చూస్తోంది? ఎవరిని, ఏవిధంగా తృప్తి పర చాలనుకుంది? ఆశ్రమంలో ప్రస్తుతం వున్న వాళ్ళందరూ యిక్కడే వున్నారు. వాళ్ళు భవానీశంకరంగారిని సమర్థిస్తున్నారు.

భవానీశంకరంగారు తన బాధని దిగమిం గేసి కూర్చోలేదు. అందరినీ చూస్తూ చెప్పారు. "ఒద్దు మిష్టర్ బాలసుబ్రహ్మణ్యం. మా కుటుంబాలు చాలా పెద్దవి. పిల్లలూ, వాళ్ళ పిల్లలూ, మనవలూ ఎంతోమంది వుండీ మేము అనాథలం అయిపోయాం. ఒక్కళ్ళూ మాగురించి పట్టించుకోరెందుకు?"

మిత్రవింద ఆయన చేతుల్ని ఆప్యా యంగా అందుకుని జాగ్రత్తగా కూర్చోబె ట్టింది. ఆయన అలసిపోయారు. ఆ కార్యక్ర మానికి మహేంద్ర రాలేదు. ఆయన కళ్ళు వెతుకుతున్నాయి. ఆ సంగతి మిత్రవిందకీ బాలసుబ్రహ్మణ్యంగారికి కూడా స్పష్టం అవు తోంది. భవానీశంకరం గారి భార్య ఆయన దగ్గరికి వచ్చి, "ఎందుకీ కంఠశోష ఈమాత్రం ఆధారం దొరికినందుకు సంతో షించండి. లోకంలో కొంతమంది తల్లితం డ్రుల్ని వదిలేసి వెళ్ళిపోయిన ఘనులున్నారు. వాళ్ళకంటే మనవాళ్ళు ఎంతోనయం, మనం ఆశ్రమానికి వెడదాం పదండి."

"నన్ను చెప్పనీయి భానూ."

"చెప్పేందుకేమీలేదు. ముందు ముందు ఈ పాటి సౌకర్యాలు కూడా వుండవేమో ఆలోచించండి. రాబోయే కాలంలో గొర్లసా విడిలా ఏర్పాటు చేసినా ఆశ్చర్యపోనవసరం

లేదు." భానుమతి కొంగుతో కళ్ళు తుడుచుకుని భర్తని అక్కడినుంచి తీసుకువెళ్ళిపోయింది.

అంతా అయోమయం గందరగోళంలా తయారైంది. బాలసుబ్రహ్మణ్యంగారు మిత్రవిందతో చెప్పారు. "ఓ సారి వాళ్ళని కారులో డ్రాప్‌చేసి రామ్మా"అన్నారు.

మిత్రవింద ఆయన చెప్పినట్లు కిందికి వెళ్ళి వాళ్ళిద్దరినీ కలుసుకుంది.

మీటింగ్ ఆగిపోయింది. ఎవరి స్థలాల్లో వాళ్ళు చతికిలపడ్డారు. బాలసుబ్రహ్మణ్యంగారు, బోర్డ్‌మెంబర్స్ మోయలేనంత బరువుని మోస్తున్నట్లు కనిపించారు. ఇటుపైన ఏంచేయాలో తోచనట్లు తలపట్టు కున్నారు.

అరగంట సేపటినుంచీ భవానీ శంకరంగారు మాట్లాడుతూనే వున్నారు. కాదు ఆక్రోశిస్తున్నారు. తనో సంఘ సంస్కర్త అనీ సమాజానికి యితోధికంగా సేవ చేయాలనీ ఎంతో తపన పడ్డాడు. ఆయన అంతరాత్మ సన్నగా నవ్వింది " సో మిష్టర్ బాలసుబ్రహ్మణ్యం నిస్వార్థంగా ప్రజాసేవ చేసి సంఘాన్ని ఉద్ధరిచాలనుకున్నారు. "సొమ్ము పోయె దిమ్మా పట్టె" అన్నట్లు అయిపోయింది అవునా? "

బాలసుబ్రహ్మణ్యం వెర్రి మొహం వేశారు. అంతరాత్మ సిగ్గు పడేలా చేస్తోంది. ప్రజాసేవ చేయాలనుకునే వాడు ఇంత అట్టహాసాన్ని ఇష్టపడడు. కుడి చేత్తో చేసిన దానాన్ని ఎడమచేతికి తెలియనీయడు. తనలోనూ స్వార్థం వుంది. పది మంది నోట్లో బాలసుబ్రహ్మణ్యం ఈజ్ రియల్లీ గ్రేట్ అనిపించుకోవాలని చేశారు.

భవాని శంకరం గారు చెప్పింది నూటికి నూరు శాతం కరెక్ట్. ప్రొద్దుటి నుంచి సాయంత్రం వరకూ రోడ్లమీద కనిపించే అనాథలని గురించి తనెప్పుడూ ఆలోచించలేదు. వాళ్ళని కేవలం అడుక్కునే వాళ్ళ కింద జమ కట్టి పట్టించుకోలేదు. కొంతమందికి సహాయపడాలను కున్నాడే గానీ అంత మందిని గురించి క్షణం ఆలోచించలేదు.

ఒక్కొక్కళ్ళువస్తున్నారు. బాలసుబ్రహ్మణ్యంగారిని కలుసుకుని మరిక వెళ్ళొస్తాం అని సెలవు తీసుకుంటున్నారు. ఆయన మనసంతా అల్లకల్లోలం అయిన కడలిలా అయింది.

హాల్లో ఏడుగంటలు వినిపించాయి. వాలుకుర్చీలో కూర్చుని మొహం మీద మోచేతిని మడత పెట్టి కళ్లుమూసుకుని ఆలోచిస్తున్నారు. అపరాధ భావం ఆయన్ని చుట్టేస్తోంది. అప్పుడు ఆ చేతి మీద చల్లని చేతి స్పర్శ తగలగానే చప్పున లేచి కూర్చున్నారు. ఆయన పక్కనే మిత్రవింద నిలుచుని ధైర్యం చెబుతోంది "మీరొక్కరే బాధ్యులు కారు. మంచీ, చెడూ రెండింటినీ సమానంగా పంచుకోవాలి. ఈ ఆశ్రమాన్ని స్థాపించిన వాళ్ళందరూ ఇందుకు బాధ్యులే... బెంగపెట్టుకోవద్దు. ఇది తప్పైతే సరిదిద్దుకునే ప్రయత్నం చేద్దాం"

ఆయన కుర్చీలోంచి లేచి కూర్చున్నారు. వేయి ఏనుగుల బలం వచ్చినట్లయింది. "మిత్రవిందా" అన్నారు ఉత్సాహంగా.

మిత్రవింద నవ్వి "కొంచెం ఆలస్యం అయినా ఫరవాలేదు. మనం ఓ సర్వే చేద్దాం. దాన్ని బట్టి మనం ఏం చేయాలో, యే విధంగా చేస్తే బావుంటుందో అనే అవగాహన ఏర్పడుతుంది. ఆ తర్వాత ఓ ప్రణాళిక ప్రకారం శ్రీకారం చుడదాం".

బాలసుబ్రహ్మణ్యంగారు తదేకంగా చూస్తుండిపోయారు. "ఇకలేవండి అంకుల్ క్షణం క్రితం బాధ కలిగితే ఆక్షణాన్ని మన స్వంత డిక్షనరీలోంచి ఇమీడియట్‌గా తీసేయాలి. మంచి జరిగితే గుండెలో గుడి కట్టుకుని దాచి వుంచుకోవాలి. అదిసరే ఆంటీ, ఏమని పిలవాలో... అని కాసేపాగి

**మంచికి ఉన్న స్వేచ్ఛ చెడుకు లేదు. చెడుకు ఉన్న ఆకర్షణ మంచికి లేదు.**

– ఒక సామెత

అందరూ మీ కోసం డైనింగ్ టేబిల్ దగ్గర వెయిట్ చేస్తున్నారు" అంది మిత్రవింద.

బాలసుబ్రహ్మణ్యంగారు లేచే ప్రయత్నం చేసి లాభంలేదని గ్రహించి ఆ పిల్ల చేతిని ఆసరాగా తీసుకుని లేచారు.

"నువ్వు కూడా భోజనం చేయి మిత్ర విందా" మిసెస్ బాలసుబ్రహ్మణ్యం అన్నారు.

"చాలా పొద్దుపోయిందండీ, నాన్నగారు కంగారు పడతారు. నేను వెళ్ళాలి"

"పోనీ నేను కూడా నీతో వచ్చి మీ ఇంట్లో అప్పజెప్పిరానామ్మా"

మిత్రవింద చప్పున బుర్ర ఊపింది. ఆ వెంటనే కంగారుగా "వద్దు. నేను వెళ్ళగలను" అంది.

"భోజనం చేస్తున్న మాతో కంపెనీ ఇవ్వడం మర్యాద మిత్రవిందా"

ఆయన వైపు చూసి ఏమనుకుందో లేచి వెళ్ళి టేబిల్ దగ్గర కూర్చుంది.

బాలసుబ్రహ్మణ్యంగారు ఆ సాయంత్రం జరిగిన విషయాలు చెబుతూంటే కొడుకూ, కోడలూ, మిసెస్ బాలసుబ్రహ్మణ్యం విన్నారు. పెద్దవాళ్ళ మనోగతం బాధాకరంగానే అనిపించింది.

"ప్రతి సమస్యకీ పరిష్కారం వుంటుంది నాన్నగారూ! మనకి బిజినెస్ చేయాలని గానీ, డబ్బు యింకా యింకా సంపాదించాలనిగానీ లేదు. మనకున్నదానితో మరో ఏడుతరాలు కూర్చుని తినచ్చు. ఈ నిందలూ, అవమానాలూ దేనికి చెప్పండి. ఆశ్రమాన్ని మూసేయమని మీ పార్ట్‌నర్స్ కి చెప్పండి. సుఖాన వున్న ప్రాణాన్ని దుఃఖాన పెట్టు కోవడం దేనికి చెప్పండి" అన్నాడు వేణు

"ఓ మంచిపని చేయాలని నిర్ణయించుకున్నప్పుడు యిటువంటి తిట్లూ, చీవాట్లు భరించాల్సిందే. అంతమందిలో భవానీ శంకరంగారే తన అభిప్రాయాన్ని, అసహనాన్నీ చెప్పారు. మిగిలిన వాళ్ళందరి ఉద్దేశ్యాలనీ కూడా కనుక్కోవాలి కదా"

"లేనిపోని తలనొప్పి మనకెందుకు చెప్పండి నాన్నగారూ"

"అలా అని అందరూ అనుకుంటే ఆ వృద్ధుల్ని పట్టించుకునే దెవరూ? "

"ఒద్దు నాన్నగారూ. మీరు యీ బాధ్యత ల్నించి తప్పించుకోండి. నా మాట వినండి. ప్రశాంతంగా గడిపేసే యీటైమ్‌లో లేనిపోని తలనొప్పి తెచ్చుకోకండి."

"కొంచెం ఆలోచించనీ వేణూ హేస్టీ డెసిషన్స్ మంచివి కావు. జస్ట్ వెయిటండ్ సీ" అన్నారు.

మిత్రవింద బయలుదేరగానే బాల సుబ్రహ్మణ్యం గారి కుటుంబ సభ్యులందరూ గేటు వరకూ వచ్చి మిత్రవిందని జాగ్రత్తగా పంపించే ఏర్పాట్లు చేశారు.

"మిత్రవిందా! వెళ్ళగానే ఫోన్ చేయి" అన్నారు బాల సుబ్రహ్మణ్యంగారు.

కారు మలుపు తిరగ్గానే "ఏమిటి నాన్నగారూ! కారులో పంపిస్తూ కూడా మీ కంగారు" అని నవ్వాడు.

★ ★ ★

మిత్రవింద ఇంట్లో అడుగుపెట్టి తనను దింపి వెళ్ళిపోతున్న కారు వైపోక్షణం చూసింది. దారి పొడవునా ఆలోచనలే. తను మాత్రమే యిలా అంతుచిక్కని ఆలోచనలతో సతమతం అవుతోందా? తన వయసువాళ్ళందరూ ఈ ప్రపంచంతో సంబంధం లేనట్లు స్వేచ్ఛాగాలుల్లో ఎగిరిపోతున్నట్లు కనిపిస్తారెందుకో? అర్థం కావడం లేదు.

## మా గురుదేవుడు అదృష్టవంతుడు



నన్నయ, తిక్కనాదులకన్నా నా గురువు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గొప్పవారని, అదృష్టవంతుడని విశ్వనాథ ఏకంగా ఓ పద్యమే రాశారు. ఎందుకట అని మనం అడక్కుండానే అదేపద్యంలో నాలాంటివాడిని శిష్యుడిగా పొందడమే ఆ భాగ్యం అని చెప్పారాయన. నిజమే.. అలా అనడానికి ఎంతటి తెగువ కావాలి? ఎంతటి ధీమంతుడై ఉండాలి? అందుకే ఆయన కవిసమ్రాట్ అయ్యాడు.

"ఏమ్మా మీటింగ్ బాగా జరిగిందా? " పార్థసారథి అడిగాడు.

ఉలిక్కిపడి తెప్పరిల్లింది మిత్రవింద "అంత బాగా జరగలేదు. సేమోల్డ్ ప్రోబ్లమ్. నాన్నగారూ! అందర్నీ మెప్పించగలవాడు పుట్టకుండానే చచ్చిపోతాడట. ఎవర్నీ నొప్పించలేం అదంతే"

"మీ తాతగారు గాఢ నిద్రలో వున్నారు"

"పాపం" అంది మిత్రవింద.

"అందరికన్నా అదృష్టవంతుడెవరో తెలుసామ్మా? "

"చెప్పండి"

పార్థసారథి నవ్వి చెప్పాడు. "తనకోసమే బతికేవాడు"

దీర్ఘంగా నిట్టూర్చింది మిత్రవింద

"అందరూ నిద్రపోయారు. నువ్వూ వెళ్ళిపడుకో. రేపు ఏదో ఓ నిర్ణయానికి వద్దాం"

మిత్రవింద బుర్ర ఊపింది.

ఆ పెద్ద ఇల్లు నిశ్శబ్దంలో మునిగిపోయింది. తన గదిలోకి వెళ్ళబోతూ అవధానిగారి గదిలోకి తొంగి చూసింది. మంచం మీద వెల్లకిలా పడుకున్న ఆయన గుండెల మీద చేయిపెట్టుకున్నారు. నిశ్చింతగా నిద్రపోవడం అదేనేమో... మిత్రవింద తన మంచం మీద వాలిపోతూ అనుకుంది.

పరిగెత్తి పరిగెత్తి అలసిపోయి, దొంగలా భయపడుతూ తరుముకువస్తున్న వాళ్ళ నుంచి తప్పించుకుని ఎంతో విచిత్రంగా రైల్లో పడ్డారు. విచిత్రంగా ఉంది మిత్రవిందకి, ఓ చోట పిరికివాడై మరోచోట ధీరుడై ప్రవర్తించటం చెబితే నమ్మరెవరూ. ఆ పెద్దాయనతో పరిచయం కాకతాళీయమే.

ఉన్నట్లుండి ఆమెలో మరో మనిషి నిద్రలేచింది. ఆమెని చూడగానే మిత్రవిందకి ఓ క్షణం భయం వేసింది. అనుకోకుండా వచ్చిన అతిథిని కొన్నాళ్ళు భరించగలం. అది మానవత్వం కూడా.

మిత్రవింద పక్క మీంచి లేచి కూర్చుంది. తనేమిటి ఇలా రెండు రకాలుగా చీలిపోతోంది. తను ధైర్యం చేసి ఆయన్ని తీసుకువచ్చింది. వచ్చే ముందు ఇంట్లోవాళ్ళకి ఈ విషయం చెప్పింది కూడా!

మిత్రవిందకి అడుగుముందుకు వేయడం మాత్రమే తెలుసు వెనకడుగువేసే ప్రసక్తే లేదు. "దేవుడా! నాకు తోవచూపించు" ఆ గదిలో జీరోవాల్ట్సు బల్బు వెలుగుతోంది. ఆ మసక చీకట్లో తన మనసు చిక్కుకుపోకుండా కనిపించని భగవంతుణ్ణి మౌనంగా

ప్రార్థిస్తోంది.

ఆ కొద్దిక్షణాల్లోనే మహేంద్ర, బాలసుబ్రహ్మణ్యంగారు గుర్తుకువచ్చారు. అంతే! ఆవరించిన చీకట్లు మాయం అయిపోయాయి. మనిషి అలసిపోవడం ప్రారంభిస్తే పతనానికి ఎంతో దూరంలో లేడన్నమాటే. శరీరానికి కావలసిన బలం గుండె లోతుల్లోంచి వస్తుంది.

తను యిక నిద్రపోవాలి విశాలమైన ఆశ్రమాల్లో నలిగిపోతున్న పెద్దవాళ్ళందరికీ మంచిదారి చూపించాలి. మిత్రవింద కళ్ళ ముందు 'కాగడా' పట్టుకుని తనుముందుకు వెడుతున్నట్లూ తన వెనుకే తన ఈడు పిల్లలు రెట్టించిన ధైర్యంతో కదులుతున్నట్లూ అనిపించింది. ఆ తరువాత ఆమెకు మంచి నిద్ర పట్టేసింది.

★ ★ ★

"రాత్రి చాలా పొద్దుపోయేవరకూ రాలేదేం మిత్రా" తల్లి నెమ్మదిగా ఆమెకే వినిపించేట్లు అడిగింది. ఆ పైన చుట్టూ చూసింది. అత్తగార్లూ, తోడికోడళ్ళు ఆ సమయంలో ఎవరూ లేరక్కడ. వాళ్ళుంటే ఏదో అనేస్తారని కాదు. బాగుండదని!

"నాన్నగారు కనిపించారు, నాకోసం గేటు దగ్గర నిలుచున్నారు"

"బయటి విషయాలు నాకేమీ తెలియవు మిత్రా! ఆడపిల్ల రాత్రీ పగలూ లేకుండా స్వతంత్రంగా తిరుగుతోందని అంటారని భయం"

ఫక్కున నవ్వింది మిత్రవింద! "ఇంకా ఈ హద్దులేమిటమ్మా అటువంటివి పట్టించుకోకూడదు."

"నాకు తెలియదు" ఆవిడ చిన్నబుచ్చుకుంది.

తల్లి భుజాల చుట్టూ చేతులేసి "సారీ... సారీ. అమ్మా ఇంకోసారి నిన్ను కష్టపెట్టను" అంది.

తల్లి ఆమె తల మీద చేయి వేసి సన్నగా నవ్వుకుంది.

అవధానిగారు లేచి తన పనులన్నీ పూర్తిచేసుకున్నారు. పార్థసారధి ఓసారి ఆయన్ని పలకరించేందుకు వచ్చాడు. అలికిడి విని ఆయన "గుడ్‌మార్నింగ్" అని విష్ చేశారు.

పార్థసారధి కూడా చెప్పాడు "కొత్త స్థలం. నిద్ర సరిగా పడుతోందా?" "సుఖంగా వున్నాను హాయిగా నిద్రపోయాను. అన్నట్లు ఓ రాత్రివేళ మెలుకువ వచ్చింది. ఒక్కసారి గుండె ఝల్లుమంది. ఆశ్రమం అనుకున్నాను. ఒళ్ళంతా చెమట్లు పట్టేశాయి. లైటు వేశాను అప్పుడు తెలిసింది. నేను స్వర్గసీమలో ఉన్నానని".

పార్థసారధి సంభ్రమంగా చూశాడు. కళ్ళు మూసుకుంటే కాలం చాపకింద నీరులా దొర్లిపోతోంది. మరో యిరవై ఏళ్ళు గడిస్తే తమ సంగతీ యింతే అవుతుందేమో? ఏమిటో భవిష్యత్తుని నిర్ధారించుకోలేకపోతున్నారు. ఈ సమస్య ఎలా పరిష్కారం అవుతుందో అతని మనసులో భావాలు కెరటాల్లా కొట్టుకుంటున్నాయి.

'మిష్టర్ పార్థసారథీ! నా కింకా నమ్మశక్యం కావడంలేదు. ఓ ఫైన్ మార్నింగ్ నాదారి నన్ను చూసుకోమనరు కదా" అనుమానంగా భయంగా అడిగారాయన. కాఫీ గ్లాసుల్తో అప్పుడే అడుగుపెట్టిన మిత్రవింద "ఛ! అలాంటివేమి మనసులో పెట్టుకోకండి" అంది కాఫీ గ్లాసు అందిస్తూ.

ఆయన వాలు కుర్చీలో కూర్చుని కాఫీ సిప్ చేస్తూ పరిసరాల్ని చూస్తూండిపోయారు.

తండ్రీకూతుళ్ళు మొహామొహాలు చూసుకున్నారు.

కొంచెం ఆగి కొద్దిగా ముందుకు జరిగి ఆయనకే వినిపించేట్లు పార్థసారధి అన్నాడు "మీరు నాతో బాటు ఆశ్రమానికి వస్తే బాగుంటుందేమో ఓసారి ఆలోచించండి. ఎవరి సొమ్మూ దొంగిలించలేదు. ఆ పంజరంలో ఇమడలేక బయటికి వచ్చేశారు. ఇందులో తప్పేం ఉంది? మీకే ప్రమాదం

రాకుండా నేను చూసుకుంటాను. 'అపరాధిని', అనే భావాన్ని నెత్తినపెట్టుకుని ఎంత కాలం భయపడతారు? మీ అంతట మీరే బాలసుబ్రహ్మణ్యం గారికీ, ట్రస్ట్ మెంబర్స్‌కీ చెబుదురుగానీ. నేనూ చెబుతాను. మీరు గర్వంగా తలెత్తుకుని రోడ్ మీద తిరుగుతూంటే మాకూ హాయిగా వుంటుంది. నేను మీ స్వంత కొడుకునే అనుకోండి ప్లీజ్"

అవధాని గారి మొహం క్షణంలో నల్లగా మాడిపోయినట్లయింది. దుఃఖం గొంతులో గరగరలాడుతోంది. చేతిలో వున్న కాఫీ గ్లాస్ కింద పెట్టేశారు. 'నన్ను కాపాడు పార్థసారథీ' అంటూ బావురుమన్నారు.

"అయ్యో! అయ్యో! ప్లీజ్ రిలాక్స్! ఇప్పటికిప్పుడు బయలుదేరమనటం లేదు నేను. మీకు తెలియకుండా ఏ పనీ చేయనూ



నన్ను నమ్మండి".

"ఇంటికి పెద్దవాడవటం ఓ సుఖం, మీరు గాబరా పడకండి, అక్కడ బాలసుబ్రహ్మణ్యం గారు వాళ్ళు ఎంత కంగారు పడిపోతున్నారో! మీ జాడ తెలిస్తే చాలు" పార్థసారధి అన్నాడు.

"నాన్న గారూ! మరో రెండు రోజులు ఆగుదాం తొందరేముంది? ఆయన్ని బాధ పెట్టవద్దు ప్లీజ్" అంది మిత్రవింద.

చాలాసేపటి వరకు అవధాని గారు మామూలు మనిషి కాలేక పోయారు. తర్వాత ఆయనే యీ లోకంలోకి వచ్చినట్లు "సారీ! పార్థసారధీ కొంచెం కూడా ఆలోచించకుండా ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తున్నాను. నాకు తెలుసు నేను ఏ స్థితిలో ఉన్నానో, అన్నింటి కంటే ముందు నన్ను సైకియాట్రిస్ట్ దగ్గరికి తీసుకువెళ్ళు నాయనా" అని ఆగారు.



"అరెరె... మీరు చాలా ఆలోచిస్తున్నారు. మీకేమీ కాదు. మీరు కోరుకున్న జీవితాన్ని మీరు అనుభవించేలా చేస్తాను చూడండి. కాకపోతే ఓ మాట తప్పు మనది కాకూడదని నేను కోరేది" పార్థసారధి బాధ పడ్డాడు.

మిత్రవింద కలగజేసుకుంది. "ఓ పని చేద్దాం నాన్నగారూ! ఇప్పుడు ఈ విషయం తాత గారితో చెప్పేశారు గదా, మనమే బాలసుబ్రహ్మణ్యం గారితో చెబుదాం".

ఈ సారి అవధాని గారు ఏమీ మాట్లాడలేదు పార్థసారధి వాచీ చూసుకున్నాడు. ఎనిమిది గంటలు కావస్తోంది, ఇక తాను బయటికి వెళ్ళాలి. ఉన్నట్లుండి అతనికి భయం వేసింది. అవధాని గారివైపు చూస్తూ "ప్లీజ్ ఇక్కడ మీకేదో హాని జరుగుతుందని భయపడి వెళ్ళిపోకండి, నన్ను నమ్మండి" అని 'మరి నేను వెళ్ళిరానా' అని అడిగాడు.

అవధాని గారు అప్పటికిగానీ మాట్లాడలేదు.

పార్థసారధికి నవ్వొచ్చింది. చిన్నపిల్లల తత్వం అని స్వగతంగా అనుకున్నాడు.

మెట్లు దిగుతున్న పార్థసారధిని చూస్తూ "ఇలాంటి కొడుకు నాకు వుంటే ఎంత బాగుండేది? " అనేశాడు అవధానిగారు.

మిత్రవింద జాలిగా చూసింది 'డోంట్ వరీ ఐ సే" అంది ఆయన భుజం మీద చేయివేసి.

ఆ స్పర్శకే అవధాని గారు పొంగిపోయారు.

★ ★ ★

నిశ్శబ్దంగా నాలుగు రోజులు గడిచిపోయాయి. అవధాని గారు ఊపిరి పీల్చుకున్నారు. ఓ విధంగా ఆయన మనసులో చాలా సంతోషించారు. బాలసుబ్రహ్మణ్యం గారికి చెబుతానన్న విషయం బయటికి పొక్కనందుకు మహా సంబరంగా వుంది. ఎగిరిగంతేయాలని వుంది. కాని వయస్సు పర్మిట్ చేయడం లేదు. హాయిగా గొంతెత్తి పాడలనిపిస్తోంది.

ఆయన ప్రమేయం లేకుండా గొంతులోంచి మధురమైన పాట వినిపించింది.

"చల్లని వెన్నెలలో... చక్కని కన్నెసమీపంలో" మెట్లెక్కివస్తున్న మిత్రవింద ఆయన తన్మయత్వాన్ని చూసి మరో అడుగు వేయలేక ఆగిపోయింది. తన అడుగుల శబ్దం విని పాట ఎక్కడ ఆపేస్తారోనని భయపడింది. 'ఇంత ఆనందాన్నిచ్చే కబురేం విన్నా

**చేయదగినదేదీ యాధృచ్ఛికంగా చేయలేదు. నా అపురూప కల్పనలు యాధృచ్ఛికంగా జరుగలేదు. – ఎడిసన్**

రాయన? ’

ఓహ్.....చాలా సంతోషం వేసింది మిత్రవిందకి. కదిలివెళ్ళి "హాలో తాతగారూ! ఎలా ఉన్నారు? " గదిలోకి వస్తూ అడిగింది. ఉలిక్కిపడ్డ అవధాని గారు చిన్నగా నవ్వి ఊరుకున్నారు. తను కూర్చుంటూ "మీకో మంచి కబురు చెప్పడానికొచ్చాను" అంది మిత్రవింద. "చెప్పమ్మా" అన్నారు ఆయన ఈజీ ఛైర్‌లో కూర్చుంటూ. మిత్రవింద చెప్పింది. "నాన్నగారు మిష్టర్ బాలసుబ్రహ్మణ్యంతో మీ గురించి చెప్పారు" అని.

అవధాని గారి మొహంలో ఒక్కసారి రక్తమంతా తోడేసినట్లు కనిపించింది. మిత్రవింద ఆయన వైపు ప్రశాంతంగా చూస్తూ "మీరు భయపడే పనిలేదు తాతగారూ! బాలసుబ్రహ్మణ్యం గారు చాలా సంతోషించారు. ఇన్ని రోజులనుంచి రాత్రిళ్ళు నిద్ర లేక, మీరెక్కడికి వెళ్ళిపోయారో అనే భయంతో, బెంగతో ఎంత బాధపడుతున్నారో నాకు తెలుసు, చూస్తూ చూస్తూ ఓ మనిషిని, అందులో మీ లాంటి వాళ్ళని కష్టపెట్టడం తప్పుకదండి. మిమ్మల్ని ఎవరూ ఏమీ చేయలేరు. మీరు మీ ఇష్టం వచ్చినట్లు హాయిగా బతికేయచ్చు. మీ వెనుక మేమున్నాం. ఇప్పుడు నాకు ఎంతో హాయిగా వుంది. మీ అబ్బాయి కోడలు ఎవరొచ్చినా, మీరు నిర్భయంగా ఉండొచ్చు బాలసుబ్రహ్మణ్యం గారు అంతహామీ ఇచ్చారు. అంతకంటే ఏం కావాలి చెప్పండి? ఇదిగో చూడండి తాతగారు! అనవసర భయాల్ని దగ్గరికి రానీయకండి, ఆరోగ్యం పాడు చేసుకోవద్దు. స్వయంగా నాన్నగారే చెప్పారు. ఈ వయస్సులో ఆయన్ని కష్టపెట్టడం ధర్మం కాదు. ఆయన ఉండాలనుకుంటే మా ఇంట్లో వుంటారు. అలా అని కనిపించే ప్రతి వాళ్ళకీ ఆశ్రయం ఇచ్చేంత గొప్పవాడిని కాను, నేను మామూలు మనిషిని. ఆయన ఘోష వినలేక మా ఇంట్లో దాచుకున్నాను అన్నారు నాన్నగారు" అంది.

ఆ.... పెద్దయన కళ్ళలొంచి నీరు ధారగా కురుస్తోంది. మిత్రవిందకి కూడా దుఃఖం వచ్చింది. అదీ కొంతసేపే. "సో మీరు మీ పాటను కంటిన్యూ చేయవచ్చు తాతగారు" ఆయన ఫక్కున నవ్వారు.

సాయంత్రం ఆరుగంటలు కావస్తోంది. పడమటి ఆకాశం కృంగిపోతున్న సూర్యుడికి వీడ్కోలు చెబుతోంది. నెలవంక స్పష్టంగా కనిపిస్తోంది.

శాంతారాం వేడివేడి కాఫీ గ్లాస్‌లతో అడుగు పెట్టాడు. "అక్కా! చల్లారిపోతుంది తీసుకోండి" అన్నాడు. అతను ఆ ఇంట్లో పనిచేసే డ్రైవర్ మాణిక్యం కొడుకు. చిన్నప్పటి నుంచి ఈ ఇంట్లోనే ఉండి చదువుకుంటున్నాడు. శాంతరాంని గూడా మిత్రవింద తమ్ముడనుకుంటారు అందరూ.

"మిత్రవిందా! నీకు ఫోన్" అని అమ్మ పిలుస్తోంది.

"వస్తున్నా"... అంటూ, ఇప్పుడే వస్తాను తాతగారూ" అని కాఫీ గ్లాస్‌తో లేచి వెళ్లింది

మిత్రవింద.

"అక్కా, తాతగార్ని నేను చూసుకుంటాను నువ్వు వెళ్లు" అన్నాడు శాంతారాం.

మిత్రవింద ఫోన్ అందుకుంది "నేను మహేంద్రని". ఒక్కసారి ఉలిక్కిపడింది మిత్రవింద. 'చెప్పండి', అంది నెమ్మదిగా.

"ఓ సారి నువ్వు రాగలవామ్మా"

"ఇప్పుడా"...

"ఏమ్మా రాలేవా! చీకటికి భయమా! నేను డ్రాప్ చేస్తానమ్మా"

"అయ్యో అదేం లేదుసార్ నాకలవాటే, కాని మీరు ఇప్పటికిప్పుడే రమ్మంటే ఎటూ పాలు పోక అన్నానంతే".

"అత్యవసరంగా నిన్ను వెంటనే చూడాలి".

"ఏమయ్యింది సార్?"

"ఫోన్‌లో చెప్పలేనమ్మా"

"ఎక్కడికి రావాలి?" "బిర్లామందిర్ దగ్గరుంటాను వస్తావా"

"అరగంటలో అక్కడుంటాను సార్".

"థాంక్యూ థాంక్యూ వెరీమచ్".

"వస్తున్నాను సర్, మీరలా థాంక్స్ చెప్పకండి ప్లీజ్"

★ ★ ★

ఉదయం ఆరు గంటలు దాటింది. బాలసుబ్రహ్మణ్యంగారు పారిజాతాలనీ, పొగడపూలనూ పూలసజ్జలో వేసుకుంటూ ముందుకు వెళ్లారు. పున్నాగపూలు నేలంతా పరుచుకున్నాయి. సంక్రాంతి రోజుల్లో అలికి రంగుల ముగ్గులు పెట్టినట్లు ఆ పూలతోట శోభాయమానంగా అనిపించింది.

ఆయన ఓ చేత్తో సజ్జను పట్టుకొని మరో చేత్తో తాళం వేస్తూ నడుస్తున్నారు.

"రామ నన్ను ... బ్రోవరా... శ్రీరామ నన్ను బ్రోవరా"...

ప్రకృతిలో లీనం అయి తనను తాను మరచి పోయి తాదాత్మ్యం చెందుతున్నారు.

ఘొల్లుమన్న శబ్దం వినిపించి అదిరిపడ్డారు. దూరంగా గుడిసెల్లో ఓ మగవాడి అధికారం, ఓ ఆడకూతురి ఆర్తనాదం విని పిస్తున్నాయి. మంచీ, చెడూ తేడా తెలియని మూర్ఖుడు చావబాదుతూ నోటికి వచ్చినట్లు బండ బూతులు తిడుతున్నాడు.

ఆ గుడిసెల్లో రోజూ ఇది మామూలే. అయినా ఎప్పటికప్పుడు ఈ వీధి భాగవతాన్ని దారినపోయే వాళ్ళు ఆగి మరీ చిత్తగిస్తుంటారు.

అది వాళ్లకి పరిపాటైపోయింది.

ఆ దృశ్యం చూస్తూంటే తగని బాధేసింది. ఆయన అక్కడ నుంచి తిన్నగా డైనింగ్ టేబిల్ దగ్గరికి వచ్చి కూర్చున్నారు. మిసెస్ బాలసుబ్రహ్మణ్యం నవ్వుతూ కాఫీ అందించింది. "అదేమిటి త్వరగా వచ్చేశారే"

ఆయన మొహం చిట్లించారు. "నువ్వేమైనా చెప్పు అరుంధతీ, ఈ ఆడవాళ్ళు ఎందుకు ఎదురు తిరగరు? వాడు తిడుతుంటే, కొడుతుంటే కుయ్యో, మొర్రో అనటం తప్ప నోరెత్తరెందుకని ఎందుకిలా వానపాములాగ ఉంటారు"?

ఆవిడ నవ్వింది. "వాళ్లంతే! మీరు ముందు కాఫీ తాగండి. సాయంత్రం ఆరు గంటలకి నేనో చిత్రం చూపిస్తాను. మిత్రవిందని పిలవండి. అంతవరకు మీరు చూసినవన్నీ మరచిపోయి హాయిగా గడిపేయండి సరేనా?"

"ఏమిటో అరుంధతీ, నా మూడ్ పాడయింది".

"మూడ్ ఉన్నదెందుకు, పాడవడానికే, సో కాసేపు ఆ మూడ్‌లోంచి బయటికి రండి. బి లైక్ ఎ గుడ్ బాయ్" ఆవిడ ఆయన క్రాఫ్ లోకి వేళ్ళు పోనిచ్చి క్రాఫ్ చెరిపేసింది. ఆ అనుభూతిని మూటగట్టుకొని పదిలంగా దాచుకోవాలనిపించింది బాలసుబ్రహ్మణ్యం గారికి.

గణ గణ శబ్దంతో మీనాక్షి మంగళహారతి శ్రావ్యంగా విన్పిస్తోంది.

"శుభం" వింటున్న బాలసుబ్రమణ్యం గారు అప్రయత్నంగా అన్నారు.

★ ★ ★

కిటికీలోంచి సూర్యకిరణాలు మొహం మీద పడగానే మిత్రవింద ఉలిక్కిపడి లేచింది. రాత్రి పడుకునేసరికి చాలా పొద్దుపోయింది. అక్కడికీ తన స్కూటీతో పాటు మహేంద్ర కూడా తన వెనకే వచ్చి ఇంటి దగ్గర దిగబెట్టి లోపలికి రాకుండానే వెళ్ళిపోయాడు.

గోడ గడియారం ఎనిమిది గంటలు కొట్టింది. ఎందుకో మనసంతా అలజడిగా ఉంది ఎక్కడో గిల్టీ కాన్షస్. తప్పు చేశానేమోననే భావం. తప్పు చేయలేదే అన్న సర్దుబాటు ఎక్కడికైనా పారిపోవాలనే ఆరాటం, ఎందుకీలేనిపోని సమస్యల్లో ఇరుక్కుపోవడం. అందరి లాగే తనూ బుద్ధిగా చదువుకోవచ్చుగా! తనని నమ్మి ఇంట్లో వాళ్ళు స్వేచ్ఛనిస్తే దుర్వినియోగం చేస్తోందా?

ఎవరు వీళ్ళంతా? తనేమైనా రాజకీయ నాయకురాలా దేశాన్ని ఉద్ధరించడానికి? లేక దిగొచ్చిన దేవతా వరాలివ్వడానికి, తన మనసు ఎందుకిలా అల్లకల్లోలం అయిపోతోంది ఉన్నట్లుండి. తనకేమైంది? బయటకి వెళ్ళటానికి మనస్కరించటం లేదు.

ఎందుకని?

"మిత్రా రా!" తండ్రి గొంతు విని ఈ లోకంలోకి వచ్చింది మిత్రవింద. మంచం దిగి తండ్రికి ఎదురుగా వెళ్ళి ఆయన్ని చుట్టేసి బావురుమంది.

"ఏమైందమ్మా" ఆయన నిర్ఘాంతపోతూ కూతురిని మంచంమీద కూర్చోబెట్టి తలని మురుతూ అన్నారు. "ఎగ్జయిట్ కాకు తల్లీ, అసలేం జరిగింది? " ఎందుకమ్మా ఏడుస్తు

## శ్రీనాథుడ్ని అడ్డంపెట్టుకుని..



విజయవాడ ఎస్. ఆర్. ఆర్ కాలేజీలో జరిగిన ముచ్చటే ఇదికూడా. అక్కడ ఆంగ్లోపన్యాసకుడిగా పనిచేస్తున్న జొన్నలగడ్డ సత్యనారాయణకు.. విశ్వనాథకు సరిపడేది కాదు. ఓరోజున విద్యార్థులకు తెలుగు క్లాసు అయిన వెంటనే ఇంగ్లీష్ బోధించడానికి వచ్చిన జొన్నలగడ్డ 'అబ్బాయిలూ.. ఇప్పటిదాకా ఏం నేర్చుకున్నార్రా.. 'సమ్ రాట్' అంతేనా? ' అన్నారు.

విశ్వనాథ కవిసమ్రాట్ కదా.. సమ్రాట్ అనే పదాన్ని అలా ఆంగ్లోచ్చారణలో విరిచి వెక్కిరించారన్నమాట.

విషయం విశ్వనాథకు తెలిసింది. మర్నాడు తనక్లాసు ముందు నుంచి జొన్నలగడ్డ పోతున్న వేళ ఆయన వినేలాగా కావాలనే గట్టిగా-

'ఓరేయ్ శ్రీనాథుడీ పద్యం ఎంత బాగా రాశాడో చూడండి.. జొన్నకలి.. జొన్నంబలి.. జొన్నన్నము.. జొన్నపిసరు.. జొన్నలె తప్పన్ సన్నన్నము సున్నసుమీ' అంటూ రాగయుక్తంగా శ్రీనాథుడు పల్నాడుమీద రాసిన పద్యం చదివారు. జొన్నలగడ్డను వెక్కిరించడానికి శ్రీనాథుడిని ఇలా వాడుకున్నారన్నమాట.

న్నావు" ఆ తర్వాత ఆయన మాట్లాడ లేదు.

మనసంతా కడిగేసినట్లయ్యింది మిత్ర విందకి. అప్పుడు చెప్పింది "నాన్నా! రాత్రి మహేంద్ర అంకుల్ నాతో చాలాసేపు మాట్లాడారు. ఆయనకి తాతగార్ని, నాన మ్మని ఆశ్రమంలో ఉంచటం సుతరామూ ఇష్టం లేదు. ఎలాగైనా ఇంటికి తీసుకెళ్లా లని ఆయన కోరిక. దానికి నేనేం చేయగ లను చెప్పండి? నా వల్లనే అవుతుంది అంటారు. ఎలా నా కర్థం కావడం లేదు నాన్నా? నిన్నటివరకు అవధాని తాతగారి బాధ విన్నాను. ఇప్పుడు మహేంద్ర అంకుల్! నా వల్ల కాదు నాన్నా. నాకు నీరసం వచ్చేస్తోంది. ఐ కాంట్ డూ"

పార్థసారథి గారు ఆమె భుజం మీద తడుతూ "నువ్వు ధైర్యంగా ఉండాలిరా. ఇప్పుడేమై పోయిందని? వీళ్ళందరి తోటి



కలసి తిరుగుతున్నావు కదా! భారాన్ని తట్టుకోలేకపోయావు అంతే. నీకు నేనున్నాను భయపడకు. అసలు నాకీ ఆశ్రమం పద్ధతే నచ్చలేదు. చివరి దశలో పెద్దవాళ్ళకి నరకం చూపిస్తున్నట్లుంది. ఒద్దమ్మా ఆశ్రమాలు ఉండాలని ఎంకరేజ్ చేయద్దు. అర వైలో ఇరవై చూస్తూ బతకాల్సిన వాళ్లు 'ఆలో లక్ష్మణ' అని ఏడవకూడదు. దీనికి పరిష్కారం నలుగురం కలిసి ఆలోచిద్దాం. నువ్వు గాబరాపడిపోకు. హాయిగా నిశ్చింతగా వుండు" అని "లే... లేచి మొహం కడుక్కొని రా!" అన్నారు.

అంతలో ఫోన్ మోగింది. మిత్రవింద ఫోన్ తీసి "హలో" అంది.



అవతలివైపు మిసెస్ బాల సుబ్రహ్మణ్యం పలికారు ఐదు నిమిషాల తరువాత ఫోన్ పెట్టేసి దీర్ఘంగా నిట్టూర్చింది మిత్రవింద.

"ఎవరమ్మా"... పార్థసారథి అడిగాడు.

"మిసెస్ బాలసుబ్రహ్మణ్యం నాన్నా! సాయంత్రం ఆరు గంటలకి మిమ్మల్నీ, నన్నూ వాళ్ళింటికి రమ్మనీ, మరచిపోవద్దనీ మరీ మరీ చెప్పారు. మీరు వేరే పనులేవీ పెట్టుకోకండి. మనం తప్పకుండా వెళ్దాం. ఆవిడ పిలిచారంటే ఏదో కారణం వుండే వుంటుంది." ఆయన మధ్యలో అందుకున్నారు "సమస్యకు పరిష్కారమేమో! కిందికి పోదాం" తండ్రీ కూతురు మెట్లు దిగారు. అవధాని గారు హాలు బయట కూర్చుని అందరినీ చూస్తున్నారు. ఓ వైపు వంటలు. మరోవైపు కాఫీ టిఫిన్లు. ఇంకోవైపు పేపర్ చదవటాలు, ఆయన మొహం నిండా ఆనందం తొణికిసలాడుతోంది. పార్థసారథిని, మిత్రవిందలను చూసి 'థ్యాంక్యూ' అన్నారు. మిత్రవింద ముందుకు అడుగు వేసి ఆయన దగ్గరికి వెళ్లి పక్కనే కూర్చుని మీరు చీటికీ మాటికీ ఇలా 'థాంక్స్'లు చెబితే నాకూ మా నాన్నగారికీ కూడా నచ్చదు. మీ అంతట మీరే పరాయి మనిషిలా గిరిగీసుకుంటున్నారు, ఇంకెప్పుడూ కృతజ్ఞతాభావంతో ఉండద్దు".

"సారీ"... తమాషాగా అన్నారు ఆయన.

పార్థసారథి కూతురువైపు చూస్తూ "మిత్రా! నువ్వు మొహం కడుక్కోవటం మర్చిపోయావు", మిత్రవింద అక్కడి నుంచి కదిలివెళ్ళింది.

"అక్కా... రాత్రి ఎక్కడికెళ్ళావ్"... చెల్లెలు అడిగింది.

"మిత్రా... చెప్పకుండా వెళ్ళావేంటమ్మా" పది మంది పది వైపుల నుంచి మిత్రవిందని అబ్బురంగా పలకరిస్తున్నారు. అవధానిగారికి ఆ దృశ్యం చాలా నచ్చింది.

★ ★ ★

సరిగ్గా ఐదు గంటల నలభై ఐదు నిమిషాలకు బాలసుబ్రహ్మణ్యం గారింట్లో మహేంద్ర, మనోహర్, మిత్రవింద, పార్థసారథి ఆ ఇంట్లో సమావేశం అయ్యారు. అందరికీ ఉత్కంఠగా ఉంది. ఎవరికి వారే 'ఎందుకు పిలిచారు? ఇంకా వచ్చే వాళ్ళెవరైనా ఉన్నారా?' అనుకుంటున్నారు.

ఇంతలో మీనాక్షి, వేణుగోపాలరావు కూడా వచ్చారు. బాలసుబ్రహ్మణ్యంగారు భార్యవైపు చూస్తూ "చెప్పు అరుంధతీ! ఎందుకు వీళ్ళందర్నీ పిలిచావు" అని అడిగారు.

పది నిమిషాల వరకూ, అటు రాజకీయాలనీ ఇటు సినిమాలనీ, మరోవైపు సత్సంబంధాలనీ కొంత వరకూ ఆధ్యాత్మిక చింతన గురించీ ఏకధాటిగా మాట్లాడుకున్నారు.

ఉన్నట్లుండి డప్పుల మేళం వినిపించింది. అక్కడున్న వాళ్లు ఉలిక్కిపడ్డారు. వాళ్ళు కూర్చున్న చోట కిటికిలోంచి ఆ దృశ్యం కళ్ళకు కట్టినట్లు కనిపిస్తోంది. వీరలెవల్‌లో చిందులేస్తున్నారు. పాటలు పాడుతున్నారు. ఆ పాటలకి అర్థమే తెలియడం లేదు. దాదాపు ఓ ఐదు కుటుంబాల వాళ్ళు ఉండి ఉంటారు. ఆడ, మగ కలసి తరతమ భేదం లేకుండా, సంతోషంతో తడిసిపోతున్నారు. పడమటి వైపు వెలిగిపోతున్నా సూర్యుడు ప్రయాణం ఆపుకొని వీళ్ల సంబరాన్ని చూసేందుకు ఆగిపోయినట్లు అక్కడ వెలుగు పరుచుకుంది.

"ఇంతకీ మీరు ఎందుకు పిలిచారు? " అడిగింది మిత్రవింద. అందుకు మిసెస్ సుబ్రహ్మణ్యం కూర్చుంటూ 'చాలా ముఖ్య విషయం' మన సమస్యకి సంబంధించింది, "పొద్దున ఆ గుడిసెల్లో ఓ భర్త, భార్యని తిట్టడం, కొట్టడం మిష్టర్ సుబ్రహ్మణ్యం చూడలేకపోయారు. ఆ సమయంలో అక్కడ ఎవరున్నా భరించలేరు. రోజూ చూసే నాకు మాత్రమే తెలుసు అక్కడ ఏమి జరిగేదీ".

"క్షణంలో కలుసుకుంటారు, మరుక్షణం కత్తులు దూసుకుంటూ చావుకి, బతుక్కీ, పెళ్ళికి, పేరంటానికీ, అందరూ ఒకటై కష్టం, సుఖం పంచుకుంటారు. వాళ్లు నిన్నటి గురించి ఆలోచించరు. రేపటి గురించి చర్చించుకోరు. ఎప్పటికప్పుడు ఆ క్షణంలో బతుకుతారు".

"వాళ్ళకి కార్లు అక్కర్లేదు. పగలంతా సంపాదించి, రాత్రి తిని, తాగి, ఖర్చు చేసేస్తారు. చీకుచింతా లేని బతుకులు వాళ్ళవి, మనలాగ సమస్యలు సృష్టించుకోరు, అసలు వాళ్ళకి సమస్యలే లేవు. అదిగో అటు చూడండి" కిటికి అవతల చూపించింది ఆవిడ. అందరి దృష్టి అటు మళ్ళింది.

అక్కడ కుక్కి మంచం మీద ఓ పెద్దాయన కాళ్ళు చాపుకొని కూర్చున్నాడు. మన వలు కాబోలు ఇరవై ఏళ్ళుంటాయి. కాళ్ళకి చేతులకీ మర్దనా చేస్తున్నారు. బహుశా! అతని భార్య అయి వుంటుంది. సజ్జరొట్టె వెల్లుల్లిపాయ కారం కలిపి ఆ పెద్దాయన నోటికి అందిస్తోంది.

దాదాపు అటువంటి స్థితిలో నలుగురైదు గురు కనిపిస్తున్నారు.

"బాగుందమ్మా చాలా బాగుంది". మిత్రవింద సంతోషం పట్టలేక లేచి వెళ్ళి ఆవిడని చుట్టేసింది. మిసెస్ బాలసుబ్రహ్మణ్యం ఏమి చెప్పదల్చుకున్నారో అక్కడ ఉన్న వాళ్ళందరికీ అర్థం అయింది.

మహేంద్రకి చాలా సంతోషంగా ఉంది. అతను తన మనసులో మాట బయట పెట్టాడు. "అసలు నేనెందుకు స్వయం నిర్ణయం తీసుకోలేదు? అర్థం కాలేదు. నేను ఎవరికో ఎందుకు భయపడాలి? నాకు తోచినట్లు నేను బతుకగలను కదా! ఈ విషయమే మిత్రవిందతో చెప్పాను. ఒక విధంగా చెప్పాలంటే మిత్రవింద నాకు ఊపిరి పోసింది, ధైర్యాన్ని ఇచ్చింది. అమ్మకూచిలాగ, నేను భార్య కూచినా? అందుకే ఇన్నాళ్ళూ ఎటూ తేల్చుకోలేని పరిస్థితిలో ఇలా రావటం మంచిదైంది. నేను చదువుకున్న అనాగరికుణ్ణి. చదువు సంధ్యలు లేని ఆ గూడెంలో మనుషుల మానవత్వం, ప్రేమా ఇవన్నీ వాళ్ళ చర్యల ద్వారా తెలిసింది. వాళ్ళు నాకు పాఠం చెప్పారు. "మిష్టర్ బాలసుబ్రహ్మణ్యం మీరు నన్ను అర్థం చేసుకోండి. ఇన్నాళ్ళూ మీతో ఉన్న పరిచయంతో ఓ మాట చెబుతాను. ఏమీ అనుకోకండి. ఈ ఆశ్రమాన్ని మూసేయండి. ఇలాంటి ఆశ్రమాలని 'బాన్' చేయమని ప్రభుత్వాన్ని కోరుదాం. నేనేదో ఆవేశంతో చెప్పడంలేదు. 'ఫాక్ట్'. నేను పడ్డ బాధ ఇలా మాట్లాడనిస్తోంది. బలవంతంగా ఆశ్రమంలో చేర్చి చేతులు దులిపేసుకోవడం నేరం. బతికున్నంత కాలం పెద్దలకు సేవ చేయడం మన కర్తవ్యం. ఇంట్లోంచి బయటికి గెంటేయడం పాపం. ఎటూ తేల్చుకోలేని మిథ్యాభావంతో కొట్టుకుపోతున్న నన్ను

## వరండాలో గాడిద



విజయవాడలో ఎస్.ఆర్.ఆర్ కాలేజీలో విశ్వనాథ తెలుగుశాఖాధిపతిగా పనిచేసిన కాలంలో ఆయన మాటకు తిరుగుండేది కాదు. కాలేజీకి ప్రిన్సిపాల్ ఎవరైనాసరే విశ్వనాథ మాట ప్రకారమే అన్నీ జరిగేవి. ఆయన పాండిత్యం.. వాగ్ధాటి ముందు మిగిలినవాళ్లు వెలవెల పోయేవారు. కొంతమంది ఆయనప్రభ ముందు తమ ప్రతిభ కొరగాకుండా పోతోందని బాధపడేవారు.

అలాంటి ఓ ప్రిన్సిపాల్ ఒకరు విశ్వనాథమీద తరచూ ఓ కన్నేసి ఉంచేవాడు. ఓరోజున తరగతిగది పక్కనే వరండాలో విశ్వనాథకు కనబడకుండా పొంచి ఆయన ఏం చెబుతున్నాడో కుతూహలంగా వింటున్నాడు. ప్రిన్సిపాల్ అక్కడ నిలబడ్డాడేంటని విద్యార్థులు తరచూ వరండాలోకి చూస్తున్నారు. ఇదంతా గమనించిన విశ్వనాథకు అసలు విషయం అర్థమైంది.

వెంటనే కుర్రాళ్లను ఉద్దేశించి 'పాఠం చెప్పేటప్పుడు నావైపు తిరిగి వినండర్రా.. వరండాలో గాడిదలేమన్నా తిరుగుతున్నాయా? పనీపాటా లేని గాడిదలు తిరిగినా చూడకుండా జాగ్రత్తగా పాఠం వినండి' అంటూ అన్యాపదేశంగా ప్రిన్సిపాల్‌ను గాడిదతో పోల్చి తిట్టారు. అంతే ప్రిన్సిపాల్ అక్కడి నుంచి క్షణాల్లో ఉడాయించాడు.

మిత్రవింద నిద్రలేపింది". అతను గట్టిగా శ్వాస పీల్చుకున్నాడు.

క్షణం ఆగి మిత్రవింద వైపు చూస్తూ "థ్యాంక్యూ బేబీ. థ్యాంక్యూ" అన్నారు.

మిత్రవిందకి తను రాత్రి మహేంద్రతో మాట్లాడిన మాటలు గుర్తొచ్చాయి.

బాలసుబ్రహ్మణ్యం గారు కలుగజేసుకున్నారు. "ఒక మంచి పని చేసేటప్పుడు భగవంతుడు కొంతమందిని పనిముట్లుగా ఉపయోగించుకుంటాడు. మిత్రవిందని అందుకే పంపాడేమో" అని పార్థసారథి వైపు చూశారు. "మీరేమంటారు సార్? "

పార్థసారథి గంభీరంగా చెప్పారు "పెద్దవాళ్ళు మన జీవితాలకి చుక్కాని లాంటివారు. మన సంస్కృతీ, సంప్రదాయాలు చాలా పటిష్టమైనవి. సంపాదనా, విదేశాలకు వెళ్లటం, స్వలాభం కోసం బతకటం ఇవన్నీ వ్యామోహాలు. పిల్లలు తమ తల్లిదండ్రుల్ని పసిపిల్లల్లా చూసుకోవాలి. ఇది మన బాధ్యత. మిష్టర్ మహేంద్ర చెప్పినట్టు ఆశ్రమాలను వృద్ధులకు కాలక్షేపం కోసం ఉపయోగించాలి. అంతేగానీ అవి జైళ్ళు కాకూడదు"

"భేష్" అన్నాడు. బాలసుబ్రహ్మణ్యం, "రిక్రియేషన్ క్లబ్ లేదా ధ్యానమందిరం అనాలి. పోలా అక్కడికి వచ్చి ధ్యానం చేసుకోవచ్చు. చదువుకోవచ్చు ఇండోర్ గేమ్స్ ఆడొచ్చు. ఏదైనా సరే. వాళ్ళకి సంతోషాన్నిచ్చేదిగా కన్‌వర్ట్ చేద్దాం"

"ఈ విషయం మీటింగ్‌లో సభ్యులకు చెబుదాం. అవసరమైతే ప్రభుత్వ సహాయం కూడా తీసుకుందాం!"

"ఓ చిన్న సంఘటన జీవితాలనీ, నిర్ణయాలనీ మార్చేస్తుంది" బాలసుబ్రహ్మణ్యం భార్యవైపు చూశారు. "గూడెంలో అక్షరం ముక్క రాని బడుగు వర్గం గుర్తుచేసే వరకూ తెలుసుకోలేకపోయామా? ఓ విధంగా తప్పించుకున్నాం" అంతే.

అరుంధతీ 'యూ ఆర్ రియల్లీ గ్రేట్' నిజంగా నువ్వు చాలా గొప్పదానివి. కిటికీ అవతల ప్రపంచం ఎంత ఉన్నతమైందో మాకు తెలిసేటట్లు చేశావు. సమావేశాన్ని ఏర్పాటు చేసినందుకు నీకు నా కృతజ్ఞతలు."

అరుంధతి సిగ్గుపడింది. "నాకు థాంక్స్ చెబుతారేమిటి? ఇట్స్ మై డ్యూటీ!" మీనాక్షి మరోసారి కాఫీ తీసుకొచ్చింది. కాఫీ తాగి అందరూ సెలవు తీసుకున్నారు.

★ ★ ★

నెల రోజుల తర్వాత...

బాలసుబ్రహ్మణ్యం అందర్నీ ఉద్దేశించి చెప్పారు. "మనుషులం కదా! ఏవో చేయబోయి మరేవో చేస్తాం. మేము తప్పు చేశాం. సరిదిద్దుకుంటున్నాం. ఆశ్రమాన్ని తీసేయడం మీకు దూరమైపోవటానికి కాదు. మరింత దగ్గర అయ్యేందుకు. ఈ ఆశ్రమం ఎప్పటికీ ఇక్కడే ఉంటుంది. మీ అవసరాల్లో ఆదుకునేందుకు ఓ స్నేహశీలిగా అవతారం ఎత్తింది. అంతే. ఇక్కడున్న పెద్దల్లో మాకు అన్నల్లాంటివారున్నారు. తండ్రిలాంటి వారు ఉన్నారు. వాళ్లందరికీ మా నమస్కారం. మేము పిలిచిన వెంటనే వచ్చి మమ్మల్ని కలుసుకొని మంచి మనసుతో తమ వాళ్ళని తిరిగి ఇంటికి తీసుకెళుతున్న మహానుభావులందరికీ మరోసారి నమస్కారం"

హాలు చప్పట్లతో దద్దరిల్లింది.

అవధాని గారు లేచి చెప్పారు. "పార్థసారధి లాంటి బిడ్డల్ని చూస్తే నాకూ ఇలాంటి కొడుకు కావాలి అనుకోని తల్లిదండ్రులు ఉండరు. ఆ దేవుడి దయవల్ల మిత్రవింద చలువవల్లా నా కొడుకు, కోడలు నన్ను తీసుకువెళ్ళేందుకు వచ్చారు. నాకు చెప్పలేనంత ఆనందంగా ఉంది"

మహేంద్ర నానమ్మని, తాతగార్ని చెరో వైపు నడిపించుకొని మైక్ దగ్గరికి వచ్చాడు. "ఇవాళ నాకు పండగ రోజు... నా భార్య మనస్ఫూర్తిగా నా వాళ్ళకి స్వాగతం చెబుతోంది. మిస్టర్ అండ్ మిసెస్ బాలసుబ్రహ్మణ్యంగారి మేలు మరచిపోలేను".

మళ్ళీ చప్పట్లు.

కొంచెం ఆగి మహేంద్రే అన్నాడు. "సినిమాల్లోనూ, నవలల్లోనూ కొన్ని సంఘటనలు విచిత్రంగా కనిపిస్తాయి. అది మనవరకు వస్తేగాని తెలియదు. మిత్రవిందని మా మనోహర్‌కిచ్చి పెళ్ళి చేస్తున్నాం. ఇది యాదృచ్ఛికం, భగవంతుడు నాకు గొప్ప వరాన్నిచ్చాడు. ఇది నా అదృష్టం, ఇంత కంటే ఎక్కువ చెప్పలేను."

ఇంతలో పార్థసారధి మిత్రవిందనీ, మనోహర్‌నీ సభికులకి పరిచయం చేశాడు.

మళ్ళీ చప్పట్లు. ఉన్నట్లుండి ఆవరణలో లైట్లు వెలిగాయి. బాలసుబ్రహ్మణ్యంగారు మెంబర్స్ నీ, ఆశ్రమంలో వారినీ పేరు పేరునా అందరిని వేదిక మీదికి రప్పించి వాళ్ళని సన్మానించారు.

రంగారావు అన్నపూర్ణ మొదలైన వాళ్ళు పర్మినెంట్ ఉద్యోగస్తులయ్యారు. అన్నపూర్ణ మళ్ళీ పెళ్ళికి ఒప్పుకుంది. ఆకాశాన్నంటే ఉత్సాహంతో బాణాసంచా కాలుస్తున్నారు. ఆ సందడిలో ఒక్కో కారూ ఒకదాని వెంట మరొకటి గేట్లోంచి దూసుకుపోతున్నాయి. అందులో కేరింతలు కొట్టే చిన్నపిల్లలున్నారు. వాళ్ళని ఒళ్ళోకి తీసుకున్న తాతలూ, నాన్నమ్మలూ ఉన్నారు. ఆ ప్రయాణం, ఆ గమ్యం ఓ మరపురాని స్వర్గం.



**నిస్వార్థపరత్వమే దైవం.** – స్వామీ వివేకానంద

## ప్రపంచ ప్రసిద్ధ నవలలు

భూస్వాముల అమానుషత్వాన్ని ఎండగడుతూ రైతుల దుర్భరస్థితికి దర్పణం పట్టిన

# మృతజీవులు

## రష్యన్ నవల

ఇంగ్లిష్‌లో నావెల్ అనే పదం కల్పిత కథాత్మక కావ్యం అనేదానికి సమానం. నావెల్ అనే పదం నోవెల్లా అనే ఇటాలియన్ భాషా పదంనుండి వచ్చింది. ఆ ఇటాలియన్ పదం నోవ అనే లాటిన్ శబ్దంనుండి పుట్టింది. దానికి నూతనమైన అని అర్థం. సంస్కృత భాషలో నవ శబ్దానికి ఇది సమానార్థకం.

ఇంగ్లిష్ భాషా సాహిత్య ప్రభావంతో తెలుగులో నవలారచన ప్రారంభమైంది. అప్పట్లో నవలను వచన ప్రబంధమని పేర్కొనేవారు. ఇంగ్లిష్ నవలకు నాలుగు వందల సంవత్సరాల చరిత్ర ఉంది. ప్రపంచ వ్యాప్తంగా అనేకానేక భాషలలో నవలా సాహిత్యం విస్తరించింది. ప్రతి భాషలోనూ అత్యుత్తమమైనవనదగిన, పాఠకుల మెప్పుపొందిన నవలలున్నాయి. ప్రపంచవ్యాప్తంగా ప్రశంసలందుకున్న రష్యన్ నవల 'డెడ్‌సోల్స్'ను 'మృతజీవులు' శీర్షికతో కొడవటిగంటి కుటుంబరావు అనువదించారు. 'డెడ్‌సోల్స్' రచయిత గురించి, నవల రచనా నేపథ్యం ఈ సంచికలో పరిచయం చేస్తున్నాం.

నికొలాయ్ వాసిలీవిచ్ గొగోల్ ఏప్రిల్ 1 (1809) నాడు ఉక్రెయిన్‌లోని వెలికియె సొరొచింట్సీ గ్రామంలో జన్మించాడు. అతడిది భూస్వాముల కుటుంబమే. నాలుగు వందల మంది కమతగాళ్లుం (అర్ధబానిసలు) దేవాళ్లు

'నలుగురికీ సాయపడాలి. మంచి చెయ్యాలి' అనే కోరిక గొగోల్‌కు స్కూల్లోనే ప్రారంభమైంది "మా క్లాస్‌మేట్లు, తోటి పిల్లలు నన్నర్థం చేసుకోరు. నాకో ఆదర్శము న్నదని కనీసం నువ్వయినా గ్రహిస్తావా" అంటూ ఆ కాలంలోనే తల్లికి లేఖ రాశాడు. అయితే తనొక రచయిత కావాలనే అభిప్రాయం మాత్రం అప్పుడు లేదు. ప్రభుత్వోద్యోగంలో చేరి ప్రజాసేవ చెయ్యాలని కోరిక. సమాజంలో అన్యాయమున్నది. న్యాయ వ్యవస్థలో చేరి దీన్ని ప్రక్షాళనం చెయ్యాలి.

కాని గవర్నమెంటు సర్వీసుకూ, న్యాయ పోరాటానికీ చుక్కెదురని త్వరలోనే తెలిసి వచ్చింది. నమ్మింది నలుగురికీ చెప్పటం కార్యాచరణకు ప్రారంభం చేయాలి. అందుకు రచన తప్ప మరో మార్గం లేదు. సెయింట్ పీటర్స్‌బర్గ్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడిగా ఉంటూ రచనా వ్యాసంగం కొనసాగించాడు. తొలి కథా సంకలనం "విలేజ్ ఈవెనింగ్స్ నియర్ డికాంకా" (1832) అతణ్ణి అగ్రశ్రేణి రష్యన్ రచయితల సరసన నిలబెట్టింది. ఉక్రెయిన్ జానపద వారసత్వం, ఆచార వ్యవహారాలను ప్రతిభావంతంగా చిత్రించిన కథలకు పాఠకులు ముగ్ధులయ్యారు. అంతేకాదు. ఈ పుస్తకం అలెగ్జాండర్ పుష్కిన్ (రష్యన్ సాహిత్య పితామహుడు) ప్రశంసలనందుకుంది.

1835లో మరో రెండు కథాసంపుటాలు - మిర్గోరాడ్ అరాబెస్క్స్ వెలువడ్డాయి. ఈ

కథల్లోని హాస్యం, వ్యంగ్యం ఇప్పటికీ పాఠకులకు చురకలు పెట్టి నవ్విస్తాయి.

"ఇరుగు పొరుగుల్నీ పొట్టీ, పొడుగూ, గుడ్డీ, మెల్లా, నత్తీ వున్న వాళ్లను ఎద్దేవా చెయ్యటమెందుకు? అధికార మధాంధుల్ని, నియంతల్ని, మనమీద సవారీ చేస్తున్న, మనల్ని దోపిడీచేస్తున్న దుర్మార్గుల్ని ఎద్దేవా చెయ్యి" అంటూ తనను తాను హెచ్చరించుకున్నాడు గొగోల్. ప్రభుత్వోద్యోగుల అవినీతిని ఎండగడుతూ ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించే వ్యంగ్యనాటకం "గవర్నమెంట్ ఇన్‌స్పెక్టర్" 1836లో వెలువడి అధికారులకు కోపం తెప్పించింది. ఇది జార్జ్ చక్రవర్తికి బాగా నచ్చింది కాని చక్రవర్తి ఇష్టపడినంత మాత్రాన సరిపోతుందా? తన ఉద్యోగుల అవినీతి ప్రజలకు తెలిసిపోతే ఎలా? అందువల్ల ఆయన మంత్రి వర్గం ఈ నాటకాన్ని నిషేధించవలసిందిగా ఏకగ్రీవ తీర్మానం చేసింది. అన్ని ప్రపంచదేశాలలో ఈ నాటకాన్ని ఇప్పటికీ ప్రదర్శిస్తూనే ఉన్నారు.


నికొలాయ్ వాసిలీవిచ్ గొగోల్

గొగోల్ ఒక చిరస్మరణీయమైన గొప్ప కావ్యం రాయలని పుష్కిన్ కోరిక. ఎంత రాసినా ఎంత పేరు వచ్చినా ప్రతి రచయిత పరిణితికి శిఖరాగ్రాన నిలిచే పుస్తకం ఒకటుంటుంది. ఉదాహరణకు సెర్వాంటెస్ అనేక ఉత్కృష్ట రచనలు చేశాడు. కాని అతని పేరు వినగానే 'డాన్ క్విక్సోట్' గుర్తుకువస్తుంది"

మృతజీవులు (డెడ్‌సోల్స్) రాయటం వెనక పుష్కిన్ ప్రేరణ వుందని రాసుకున్నాడు గొగోల్

ఆనాడు రష్యాలో అమలులోవున్న అర్ధ బానిస విధానంలో (Serfdom) రైతుకూలీల్ని భూస్వాములు వినియోగవస్తువుల్లా కొనుక్కునే ఆచారం ఉండేది. ప్రతి భూస్వామి తన వద్దవున్న రైతుకూలీల పేర్లను రెవెన్యూ రికార్డుల్లో నమోదు చేయించుకోవాలి. కూలీల సంఖ్యను బట్టి శిస్తు కూడా చెల్లిస్తాడు. మృత జీవుల్లోని కథావస్తువు ఇదే! చిచికోవ్ అనేవాడు ప్రతి భూస్వామి దగ్గరకూ వెళ్ళి అతడి వద్ద ఉన్న చచ్చిన కూలీల్ని కొనుక్కుని బ్యాంకులకు తాకట్టు పెట్టి డబ్బు చేసుకుంటాడు. ఈ కూలీల దొంగ లెక్కలు అప్పటి రెవెన్యూ రికార్డుల్లో పుష్కలంగా ఉండేవట ఇప్పటి మన దొంగ వోటర్లలాగ.

***చిచికోవ్ పాత్ర గొగోల్ అద్భుతసృష్టి.*** ఆధునిక బిజినెస్ గ్రాడ్యుయేట్లకు ఇతడు ఆదర్శపురుషుడు

"ఎవరేం చెప్పినా అవునంటాడు చిచికోవ్. గుర్రాల గురించి, గాడిదల గురించి వేటకుక్కల గురించి మరేదైనా విషయం గురించి ఎవరేం మాట్లాడినా అతడికి అందులో ప్రవేశం ఉంటుంది. దేన్నైనా సమర్థించగలడు. దేన్నైనా విమర్శించగలడు. మీ వల్ల అతడికి ప్రయోజనం ఉందనుకుంటే అవసరం తీరిందాకా ఏం చెయ్యమంటే అది చేస్తాడు."

రష్యాలోని గ్రామ గ్రామానికీ తిరిగి, ప్రతి భూస్వామినీ కలసి, అతడి (చచ్చిన) రైతు కూలీల వివరాలు సేకరించి, బేరమాడి, పేర్లు కొనుక్కుంటాడు చిచికోవ్. ఆనాటి రైతుల దుర్భర, దయనీయ పరిస్థితులకు కన్నీరు కార్చని వారుండరు. వాళ్ల బతుకు పెంపుడు జంతువులకన్నా అధ్వాన్నం.

భూస్వాముల అమానుషత్వానికి కోపం వస్తుంది. ఆ పిసినారుల మూర్ఖత్వానికి నవ్వాగదు. ఒకడో ఇద్దరో మంచివాళ్ళూ తగలక పోరు. కాని చేతకాని వాళ్ళ సదుద్దేశాలకూ విలువ లేదు. భూలోక నరకాన్ని మన కళ్ళ ముందు దర్శింపచేసిన రచయిత, 'సమాజం, వ్యవస్థ మారాలి' అంటూ ప్రత్యేకంగా వ్యాఖ్యానాలు చెయ్యనవసరం లేదు. ప్రభువుల దృష్టిలో ప్రజలు ఇలాంటి సత్యాలు తెలుసుకోవటమే నేరం. కడుపుబ్బ నవ్వించే కథ కూడా విప్లవ భావాల్ని జాగృతం చెయ్యగలదు.

పుస్తక ప్రచురణకు సెన్సారువాళ్ళు అభ్యంతరం తెలిపారు. 'డెడ్ సోల్స్' అనే పేరులోనే రచయిత మత విశ్వాసాల్ని అవహేళన చేస్తున్నాడన్నారు. సోల్ (ఆత్మ)కు మరణం ఉండదు కదా. అందువల్ల పుస్తకం పేరు "అడ్వెంచర్స్ ఆఫ్ చిచికోవ్"గా మార్చమన్నారు. చివరికి ఏదో రకంగా 1842లో ఈ పుస్తకం అచ్చయినా కొద్ది రోజులకే ప్రభుత్వం నిషేధించింది. (ప్రభుత్వ వ్యతిరేకతను అధికారులు ఎప్పుడూ ఏ కాలంలోనూ సహించరు) రాడికల్ గ్రూపుల వాళ్లు దీన్ని చేత్తో కాపీ చేసి మరీ సర్క్యులేట్ చేశారు.

'మృతజీవులు' రెండవ భాగం రచన 1845లో ముగించాడు గొగోల్. "వ్యక్తుల నీచత్వాన్నీ, దిగజారిన తనాన్నీ, స్వార్థాన్నీ అర్థం చేసుకోకుండా, ఉన్నత, ఉదాత్త విషయాల గురించి మాట్లాడి లాభం లేదు. రెండవ భాగంలో ఈ ప్రయత్నమే కొనసాగించాను. కాని ప్రభుత్వమూ, అధికారులూ తమను తాము అద్దంలో చూసుకోవటానికి యిష్టపడరు" అంటాడో ఉత్తరంలో.

మొత్తంమీద ఈ పుస్తకం రచయితకు అసంతృప్తినే మిగిల్చింది. 11 ఫిబ్రవరి 1852 నాడు నిస్సహాయ స్థితిలో రెండవ భాగం ఫెయిర్ కాపీని తగలపెట్టాడు. మరో పది రోజులకు 21 నాడు డెడ్ సోల్స్ రచయిత మరణించాడు.

మరో మూడేళ్ళకు 1855లో చిత్తు ప్రతి ఆధారంగా డెడ్ సోల్స్ రెండో భాగం వెలుగు చూసింది. మధ్యలో అక్కడక్కడా కొన్ని పేజీలుండవు. మహానుభావుడు నవల మూడో భాగం కూడా రాయాలని ప్లాను చేసుకున్నాడట. అదింకా బాగుంటుందని కథ విన్న వాళ్ళు చెప్పారు. ఇప్పటికి మిగిలిన రెండు భాగాలూ చాలు గొగోల్ ని అగ్రశ్రేణి ప్రపంచ రచయితగా నిలపటానికి.

## "మృత జీవులు" నుండి మచ్చుకో పేరా: భూస్వాముల విందు

వెండి స్టాండులలో వెలుగుతున్న కొవ్వొత్తులు, పూల గుత్తులు, స్వీట్లు, రకరకాల మద్యం సీసాలు. ఖరీదైన నగలలంకరించుకున్న సుందరులు. సేవకులు అనుసరించగా ఠీవిగా కదిలే పురుషులు. హాలు నిండా టేబుళ్ళ మీద గుట్టలు గుట్టలుగా భోజనం. చేపలు, కోళ్ళు, బీఫ్. విలాసాలకు హద్దు లేదు. "ఎందుకింత వృధా!" అనుకున్నాడు చిచికోవ్. వర్షాలు లేవు. పంటలు పండలేదు. ఎటు చూసినా క్షామం. రైతులు ఆకలితో అలమటించి మృత్యువాత పడుతున్నారు. మార్కెట్లో ఉన్న కొద్ది ధాన్యాన్నీ కొనుక్కోగల శక్తి ఎవరికీ లేదు. వీళ్ళకేమో ఇన్ని షోకులు. ఒక్కొక్కరి డ్రెస్సూ కనీసం వెయ్యి రూబుళ్ళు చేస్తుంది. పస్తులుండి రైతులిచ్చిన కౌలు డబ్బులతో పొట్టలు పగిలేలా మెక్కుతున్నారు. అందరూ లంచగొండులే. పైకి మాత్రం పేదలనాదుకుంటామని ప్రగల్భాలు పలుకుతారు. నకనకలాడే కమతగాళ్లిచ్చిన డబ్బులతో వీళ్ళ పెళ్ళాలు సింగారాలు చేసుకుంటారు. ఇలాంటి విందుల్లో ఆనందముండదు. ఇది నరకం. దేశంలో పరిస్థితి ఇంత దారుణంగా ఉంటే శుష్క ప్రసంగాలతో కాలక్షేపం చేస్తారు. ఇదంతా పెద్దఫార్సు!"

– పినాకి

✦

# చతుర కతలు

## బామ్మగారు ఎం.డి.ఏ.

మా బామ్మగారు మహామేధావి. ఆవిడకి ఏ డిగ్రీలు లేకపోవచ్చుగాక! యూనివర్సిటీ ఆఫ్ కామన్ సెన్స్‌లో ఆవిడకి ఎం.డి.ఎ. వుంది. (మాస్టర్ ఆఫ్ డొమెస్టిక్ అడ్మినిస్ట్రేషన్) ఇవాళ చింతచిగురు పచ్చడి అద్భుతంగా చేసిందనుకోండి. ఆ పచ్చడి కొంచెం మిగిలి పోతే రేపు టేబులుమీద చింతచిగురు వేసిన చారు ఘుమఘుమలాడుతూ దర్శనమిస్తుంది. ఆవిడ పాక కళ గురించి ఎన్ని జిహ్వలతో పొగిడినా తక్కువే అవుతుంది. అందాలను బ్రెయిలీ లిపిలోను, అరిటాకులోని వంటకా లను ఆస్వాదనతోను వర్ణించే నాకు అందు వల్లే చిన్న వయసులోనే కాస్త ఒళ్ళు, బొజ్జ వచ్చేశాయి. ఆవిడ వంటల గురించి పొగిడేకన్నా రుచి చూస్తేనే భేషుగ్గా వుంటుంది. కాని ఆవిడకున్న అపార మేధాశక్తి గురించి మాత్రం చెప్పక



తప్పదు. అతిక్లిష్ట సమయాలలో కూడా ఆవిడ బుర్ర ఎంత చురుకుగా పనిచేస్తుందో ఓ ఉదా హరణ చెబుతాను.

ఊరగాయల కాలం. మా నాన్నగారు రైతుబజారుకెళ్ళి మామిడి కాయలు ఏరి బాగా పుల్లగా వున్నదీ లేనిదీ రుచి చూసి, ముక్కలు కొట్టించి తెచ్చి బామ్మగారికి హేండోవర్ చేశారు. ఆవిడ చాలా శ్రద్ధగా ఆవకాయ కలిపి పెద్ద జాడీల్లోకి ఎక్కిం చింది. ఆ రాత్రి ఆ జాడీల మూతలు తీసి, డబ్బాడు ఆడించిన పప్పునూనె జాగ్రత్తగా ఆ జాడీల్లో వంపింది. మర్నాడు తెల్లవారాక మా నాన్నగారు బ్రేక్‌ఫాస్ట్‌లో గారెల్లోకి నంజుకోడానికి చెరకు పానకం డబ్బా దగ్గర కెడితే ఆ డబ్బా ఖాళీగా దర్శనమిచ్చింది. పక్కనున్న పప్పునూనె డబ్బా నిండుగా ముసిముసి నవ్వులు నవ్వుతూ నిలబడింది.

నాన్నగారు గావుకేక వేశారు. 'అమ్మోయ్! కొంప ముంచేశావ్! నువ్వు ఆవకాయ జాడీల్లో నూనెకి బదులు చెరుకు పానకం పోసేశావే!"

మా బామ్మగారు అవాక్కయిపోయింది. ఇంట్లో అందరూ ఆవిడమీద రాళ్ళు విసరబోతే 'నోర్ముయ్యండ్రా' అని అరిచింది. తరవాత కోడల్ని పిలిచి 'ఏమే, ఓ ముప్ఫయి ఖాళీ

గిన్నెలు తీసుకొచ్చి ఇక్కడ పెట్టు' అంది.

మా అమ్మ కోపంగా 'ఇంకెందుకు? ఆ ఊరగాయ బయట పారేయండి. అంతకన్న చేసేదేముంది? ' అంది.

అయినా ఆవిడ వినిపించుకోకుండా చెరుకు పానకం కలిపిన ఆ అవకాయని ముప్పై గిన్నెల్లో నీటుగా సర్దింది. ఇంక ఆవిడ టార్గెట్ నేనే కదా. ఆవిడ చెప్పినట్లు చేసితీరాలి. జాగ్రత్తగా ఒక్కొక్క గిన్నెడు ఆవకాయ మా కాలనీలో వున్న ఒక్కొక్క కుటుంబం వారికి తీసికెళ్ళి ఇచ్చి 'మా బామ్మ స్పెషల్‌గా చెరుకు పానకంతో తీపి ఆవకాయ చేసింది. రుచి కోసం మీకిమ్మంది' అని చెప్పి ఇచ్చి వచ్చాను. నాలుగు రోజులు తిరక్కుండా మా ఇంటికి ముప్పై గిన్నెల్లో రుచులూరించే ఆవ కాయలు వచ్చి చేరాయి. తీసుకున్నవాళ్ళు ఎవరూ ఖాళీ గిన్నెలు తిరిగి ఇవ్వరుకదా. అందుకని ఆ గిన్నెలు శుభ్రంగా కడిగి, ఎండ బెట్టి వాటిల్లో పెట్టుకున్న ఆవకాయ కొంచెం పెట్టి తిరిగి మాకు పంపించారు. కారాలు, మిరియాలు నూరదామనుకున్న మా ఇంట్లో వాళ్ళందరూ ఆవిడ సమయస్ఫూర్తికి తలలు వంచి నమస్కరించారు.

– పెయ్యేటి రంగారావు

---

# తీరని కోరిక

"చందూ లేవరా. అప్పుడే నాలుగున్న రైంది. లేరా" అమ్మ మేలుకొలుపు.

జనవరి చలి దంచేస్తోంది. మరింత మునగదీసుకుని దుప్పటి తల మునిగేదాకా లాక్కుని అన్నాడు చందూ. "అబ్బ! చలిగా వుందమ్మా. కాస్సేపు పడుకోనీయమ్మా"

"లేవరా చందూ. తెల్లవారుజామున లేచి చదువుకుంటే బాగా గుర్తుంటాయిరా. మా మంచి బాబు. లేస్తాడు గదూ" అమ్మ విసుక్కోకుండా అనేసరికి లేవక తప్పింది కాదు చందూకు.

లేచి ముఖం చల్లటి నీళ్ళతో కడిగేసరికి నిద్ర ఎగిరిపోయింది. పుస్తకాలు ముందేసుకుని చదవడం మొదలెట్టాడు. చందు పదవ తరగతి చదువుతున్నాడు. కొడుక్కు మంచి మార్కులు రావాలని తల్లి ఆరాటం. ఇప్పుడు కొంచెం కష్టపడితే, మంచి చదువు అబ్బి, మంచి ఉద్యోగం వస్తే ఇక జీవితమంతా సుఖంగా సంతోషంగా గడపొచ్చని అమ్మ ఎప్పుడూ చందూకి చెబుతుంటుంది. కొడుకు హైస్కూలులో చేరినప్పటినుండీ ఆమెకు కొడుకు చదువు గురించే ధ్యాస.

చందూ కూడా అమ్మ చెప్పినట్లు నడుచుకునే మంచి బాలుడే. కష్టానికి తగ్గట్లుగా తెలివిగలవాడు కూడా అయినందున చందూ చదువులో బాగా రాణించాడు. అయినా అమ్మకు భయం. ఏమరుపాటుగా వుంటే ఎక్కడ కొడుకు చదువులో వెనుకబడిపోతాడేమోనని.

చందూ పెద్దవాడయ్యాడు. అమ్మ కోరికకు అనుగుణంగానే మంచి మార్కులతో ఎం.కాం. పాసై బ్యాంకు ఆఫీసరుగా సెలక్ట య్యాడు.

అమ్మయ్య! ఇక తెల్లవారిందాకా లేవక్కర్లేదు. హాయిగా ఉదయం ఏడింటిదాకా నిద్రపోవచ్చునని చందూ ఆనందపడ్డాడు. చందూకు పెళ్లి అయింది. భార్య కూడా బ్యాంకు ఆఫీసరే. అయితే ఇద్దరికి చెరొక ఊర్లో ఉద్యోగలయ్యాయి. భార్యను ఉద్యోగం మానెయ్యమన్నాడు చందూ.

"ఇంకా నయం. మనమేమైనా లక్షాధికార్లమా? కోటీశ్వర్లమా? ఇద్దరూ ఉద్యోగాలు చేస్తేనే ఈ రోజుల్లో అంతంత మాత్రం. ఇక నీ ఒక్కడి ఉద్యోగంతో సంసారం ఏం గడుస్తుంది? " అమ్మ పడనీయలేదు.

"అది కూడా నిజమే. ఇద్దరు ఉద్యోగుల

ఇతరులలో మంచిని చూడటమే మన మంచితనం. – అమ్మ

యితేనే జీవితం ఎటువంటి ఆర్థిక ఇబ్బందులు లేకుండా గడుస్తుంది" అనుకున్నాడు చందూ.

ఇద్దరూ చెరొకచోటా ఉండటం కష్టం కాబట్టి, ఒకరు నిలకడగా, రెండోవారు అప్‌అండ్‌డౌన్ చేస్తే సరిపోతుందనుకు న్నాడు చందూ.

పడుకొని నిద్రపోవచ్చు ఇక నన్ను అడిగేవాళ్ళు లేరు' అనుకున్నాడు చందూ.

నాలుగురోజులు గడిచాయి. అరి కాళ్ళు ఒకటే మంటలు. డాక్టరు పరీ క్షలు చేసి షుగర్, బి.పి. రెండూ



అనుకున్నట్లే చందూ మగవాడు కాబట్టి తిరగక తప్పలేదు. అయితే అతను ఆఫీ సుకు అందుకోవాలంటే అతను వెళ్ళాల్సిన ఊరికి ఉదయం ఏడు గంటలకు మాత్రమే రైలుంది. ఇక అతనికి మళ్ళీ తెల్లవారుజా మున లేవక తప్పలేదు. ఆ తిరుగుడు అత నికి రిటైరయ్యేదాకా తప్పలేదు.

చందూకి ఇద్దరు మగపిల్లలు. వాళ్ళు చందూ అమ్మ పెంపకంలో బాగా చదువుకు న్నారు. ఒకరు సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా అమె రికాలో, మరొకరు డాక్టర్‌గా లండన్‌లో స్థిర పడ్డారు. చందూ బాధ్యతలు తీరిపో యాయి. చందూ తల్లి కూడా చనిపో యింది. చందూ రిటైరైనాడు.

'హమ్మయ్య! ఇక హాయిగా తెల్లారిందాకా

వున్నాయి అని తేల్చాడు. చందూ గుండెలు గుభేలుమన్నాయి. ఎన్నిరకాల మందులు మింగాలోకదా అనుకున్నాడు.

"ఫర్వాలేదు. రోజూ ఉదయం ఒక గంట నడవండి. ఉదయంపూట నడక ఆరోగ్యానికి మంచిది. ఎర్లీ మార్నింగ్ నడవాలి సుమండీ" అన్నాడు డాక్టరు.

"లేవండీ! మిమ్మల్నే. లేవండి. అప్పుడే అయిదు దాటింది. మార్నింగ్ వాక్‌కు వెళ్ళరా? " చందూ భార్య అతన్ని లేపుతోంది.

ఒక మూలుగు మూలిగి తప్పనిసరై లేచాడు చందూ. ఇక అతనికి జీవితమంతా తెల్లవారుఝామునే లేవాలి మరి.

*– మండవ బాలగంగాధరరావు*

---

## డయాబిటిస్

**డాక్టర్‌తో ముఖాముఖీ**

డాక్టర్: హలో! ఎవరండీ!

వాణి: నేను అనంతవాణినండి! విజయవాడ నుంచి.

డాక్టర్: ఆ! చెప్పండి! ఏమిటి మీ సమస్య?

వాణి: నేను ఆరోగ్యంగానే ఉన్నానండి. మా ఆయనకి షుగర్ వ్యాధి. పోస్ట్ లంచ్ 425 ఉంది.

డాక్టర్: మీ ఆయన్ని మాట్లాడమనండి.

వాణి: పెళ్ళైనప్పట్నుంచీ ఆయన నోరు విప్పితే ఒట్టు డాక్టర్.

డాక్టర్: టెన్షన్‌వల్ల కూడా షుగర్ ఎక్కువ అవుతుంది. షుగర్ ఎన్ని సంవత్సరాలనుంచి?

వాణి: పది సంవత్సరాలనుంచండి.

డాక్టర్: మీ అత్తమామలకి కూడా షుగర్

డాక్టర్! ఆయన చాలా ఉత్తములు! ఆయన నన్నసలు బాధపెట్టలేదు!

డాక్టర్: అయితే ఆయన పోయినందుకు సారీ! అమ్మా! టీవీలో ఈ హెల్త్ ప్రోగ్రామ్ టైమ్ మొత్తం మీరే తినేస్తు





ఉందా?

వాణి: అవునండి. ఇద్దరికీ ఉండేది. మా అత్తగారు షుగర్‌వల్లే పోయారండి.

డాక్టర్: సారీ! అమ్మా!

వాణి: సారీ ఎందుకండీ! ఆవిడ పోయిన తర్వాతే సుఖపడుతున్నాను.

డాక్టర్: ప్రస్తుతం మీ మామగారున్నారా?

వాణి: ఆ గయ్యాళి పోయిన సంతోషం పట్ట లేక ఈయన గుండె ఆగిపోయింది.

డాక్టర్: వెరీగుడ్.

వాణి: ఆయన పోతే వెరీగుడ్ ఏమిటి న్నారు. ఇక సరిపెట్టండి.

వాణి: ప్లీజ్ డాక్టర్! భర్తలో సగభాగం భార్య అంటారు కదా! నేను నడిస్తే మా ఆయన షుగర్ తగ్గుతుందాండి.

డాక్టర్: తప్పమ్మా! అలా నేనొప్పుకోను!

వాణి: నాకు షుగర్ లేదు కాని విపరీతమైన నీరసం డాక్టర్. ఎలా తగ్గుతుంది ఈ నీరసం?

డాక్టర్: మీరు సార్థక నామధేయులు అనంత వాణీగారూ! మీరు మాట్లాడ్డం తగ్గిస్తే మీ నీరసం తగ్గుతుంది.

**- భమిడిపాటి సోమయాజి**

---

## అంతా రాసేశా!

తన పేరు మీదొచ్చిన ఉత్తరాన్ని కష్టపడి మళ్లీ చదువుకున్నాడు పుల్లారావు. అది అతడి స్నేహితుడు చక్రపాణి రాసింది. చక్ర పాణికో దురలవాటుంది. ఉత్తరం రాయాల నుకున్నప్పుడు ఇన్లాండ్ లెటర్ తీసుకుని ముందుగా దానిమీద అడ్రసూ, తన అడ్రసూ రాసి జేబులో పెట్టుకుంటాడు. ఒక వారం రోజుల తర్వాత క్షేమ సమాచారాలు రాస్తాడు. ఇంకో వారం రోజులు ఆలోచించి అసలు విషయం రాస్తాడు. ఇంకో వారం ఆగి ఇతర విషయాలూ, తర్వాత ఇంకో వారానికి 'ఇంతే సంగతులు' అని రాసి అప్పుడతికించి పోస్ట్ చేస్తాడు. అలా దాదాపు నెల రోజుల కిందట తాను రాసిన ఉత్తరానికిది రిప్లై. మూడు రోజుల కిందట తనను కలవడానికి ఇక్కడికొస్తూ బస్సెక్కే

ముందు బస్టాండ్‌లో పోస్ట్ చేసిన ఉత్తర మిది.

అతడది చదువుతూ ఉండగానే ఆదరాబా దరాగా పుస్తకాలు బూజు దులిపి తీసుకొచ్చాడు చక్రపాణి. "ఇంకా తయారవలేదా? పరీక్షకు టైమైపోతోంది" అంటూ.

"ముందెళ్లి మాత్రం చేసేదేముంది? ఇదిగో నువ్వు రాసిందే ఉత్తరం చదువుతున్నాను" అంటూ అది అతడి చేతిలోనే పెట్టి బయలుదేరాడు పుల్లారావు.

పరమ మొద్దు అయిన పుల్లారావు ఎలాగైనా పదవ తరగతి 'పాస్' అనిపించుకోవాలని మహా పట్టుదలగా ఉన్నాడు. గతంలో మూడుసార్లు కష్టపడి మూడు లాంగ్వేజీ పేపర్లు మాత్రమే పాసై మిగతా సబ్జెక్టులు పాసవడం ఈ జన్మలో జరిగే పని కాదని నిర్ణయించుకున్న తర్వాత మండల కేంద్రమైన వాళ్ల ఊళ్లోనే పరీక్షాకేంద్రం ఏర్పాటైంది. ఆ సెంటర్ 'మానేజ్' చేసుకునే వాళ్లకు అనువుగా ఉంటోంది. చివరి అర గంట సేపూ చూసీ చూడనట్లు వదిలేస్తున్నారు. దాంతో ఆశపుట్టుకొచ్చి ఫ్రెండ్ చక్రపాణి సాయంతో పరీక్షలు రాస్తున్నాడు.

సోషల్ స్టడీస్ పరీక్ష జరుగుతోంది. చక్రపాణి ముఖ్యమైన ప్రశ్నలన్నిటికీ సమాధానాలు సిద్ధం చేసి ఉంచాడు. ప్రశ్న నంబర్ తెలియగానే వేసి లోపలికి పంపడానికి అనుకున్న ప్రశ్నలమీద పూర్తి నమ్మకముంది గాబట్టి అవసరానికి మించి పంపడం అనవసర శ్రమ కనుక అదనంగా ఖాళీ పేపర్లు కూడా తెచ్చుకోలేదు. ఈలోగా ఒక సెక్షన్లో



తానూహించిన ప్రశ్నల్లోంచి కాకుండా అన్నీ వేరే ప్రశ్నలొచ్చాయని తెలిసింది. వాటిలో కనీసం ఒకటైనా రాయడం తప్పనిసరి. ఒకదానికి సమాధానం తనకు తెలుసు. కానీ బైటికెళ్లి పేపర్ తెచ్చి రాసిచ్చే టైం లేదు. అందుకే జేబులు తడుముకుని దొరికిన కాగితమ్ముక్కల్లో కాస్త అనువైనది చూసి సగానికి గీత కొట్టి ఖాళీగా ఉన్నవైపు సమాధానం రాసి మడిచి లోపలికి పంపాడు అటెండర్ ద్వారా.

★ ★ ★

బెల్ మోగగానే పుల్లారావు బయటికొచ్చాడు గర్వంగా. "ఎలా రాశావురా?" అనడిగే లోపే "మొత్తం దింపేశా" అన్నాడు తన 'ప్రతిభ'కు తనే మురిసిపోతూ. పైగా "ఇప్పుడు సిలబస్ మారిందా ఏమిట్రా సోషల్ పరీక్షలో కూడా లెటర్ రైటింగ్ వచ్చిందీ?" అని కూడా అడిగాడు సంబరంగా.

దాంతో అదిరిపడ్డాడు చక్రపాణి. "లెటర్ రైటింగేమిట్రా? నీకేమైనా మతిపోయిందా?" అన్నాడు గాభరాగా.

"మతి పోవడమేమిట్రా? నేను లాంగ్వేజీ పేపర్లు పాసయిందే లెటర్ రైటింగ్‌లో మంచి మార్కులు రాబట్టే గదా? ఈ రోజు కూడా నువ్వు రాసిన లెటరే ఉపయోగపడింది చూశావా?" అన్నాడు ఉత్సాహంగా.

దాంతో తలపట్టుకుని "కొంపదీసి లెటర్లో ఉన్నదంతా రాసేశావా ఏమిటి?" అనడిగాడు చక్రపాణి జుట్టు పీక్కుంటూ.

"అక్షరం పొల్లు బోకుండా అంతా దింపేశా. కానీ బొమ్మ వేయడమే కష్టమైపోయింది" అన్నాడు పుల్లారావు.

"బొమ్మెక్కడుందీ? అసలేం బొమ్మేశావ్?"

పుల్లారావు తీసి చూపించాడు. తాను పంపిన ఇన్లాండ్ లెటర్ మీదున్న పోస్టల్ శాఖ బొమ్మ అది. దాంతో కళ్లు తిరిగి కింద పడబోతూ అడిగాడు చక్రపాణి "అంతా అంటే ఇంకా ఏమేం రాశావ్?"

ఆన్సర్‌తో పాటే తాను నెలరోజుల పాటు రాసిన ఉత్తరం, దానిమీద అడ్రసులూ, హిందీ ఇంగ్లీషులలో ఉన్న సూచనలూ, కుటుంబ నియంత్రణ స్లోగన్, రేటూ, డేట్ స్టాంప్‌లతో సహా...

మొత్తం అంతా దింపేశాడు!

– జి. త్రివిక్రమ్

---

# గారాబం

సన్యాసి రావ్‌కి నలభై ఏళ్ళ వయసులో లేకలేక ఓ మగ నలుసు పుట్టుకొచ్చాడు. వాడి పేరు నానీ!!

ఇంకేముంది! వాడు ఏది అడిగినా క్షణాల్లో కొనిచ్చేవాడు. వయసుతో బాటు అయిస్‌క్రీమ్, చాక్‌లెట్ బార్, కూల్ డ్రింక్స్ నుంచీ కోరికల లిస్ట్ పెరగసాగింది.

సన్యాసిరావు భార్య భ్రమరాంబ, "వాడిని అలా గారాబం చేయకండి శృతిమించి రాగాన పడుతుందని, హెచ్చరిస్తే, "ఆడదాని మాట వినడమా నాన్సెన్స్! వాడు నా కొడుకు నా ఇష్టం, నువ్ నోర్ముయ్" అని కసిరేవాడు.

"మీ ఖర్మ! అనుభవించండి" అనుకుంది భ్రమరాంబ

ఓసారి బంధువులింట్లో పెళ్ళికి వెళ్ళారు సన్యాసిరావ్ ఫ్యామ్లీ. ఆ పెళ్ళికి వచ్చిన వారిలో బాబీ అనే అబ్బాయి వేసుకున్న కొత్తరకం షూమీద కళ్ళు పడ్డాయ్ నానీకి.

ఇంకనేం, "డాడీ నాకా లైట్ వెలిగే షూస్ కావాలి ఇప్పుడే కొను" అంటూ మారాం చేశాడు.

"నానీ ఇప్పుడు అర్ధరాత్రి అయిందిరా! షాపులుండవ్ కదా మరి.. రేపు వెళ్ళి కొనుక్కుందాం' అని, ఊరుకో బెట్టాలని ప్రయత్నించాడు సన్యాసిరావ్.

"ఎప్పుడూ అడిగిన వెంటనే కొనిస్తావ్



కదా... అలా వీల్లేదు ఇప్పుడే కావాలీ... అన్నాడు నానీ.

"నా తండ్రి కదూ, నా బంగారు కొండవు కదూ, రేపు పొద్దున్నే లేచి షాపు కెళ్ళి కొనుక్కుందాం" అని కొడుకుని బ్రతిమాలేడు, బుజ్జగించాడు సన్యాసిరావ్.

అబ్బే పేచీ మానలేదు. పెళ్ళిపందిరి దద్దరిల్లేలా ఏడుపు మొదలెట్టాడు నాని గాడు.

భ్రమరాంబ కొడుకు నెత్తుకుని నచ్చచెప్పాలని చూసింది.

తల్లంటే అసలు లెక్కలేని నాని గాడు, బతిమాలిన కొద్దీ పేట్రేగిపోయాడు.

"అదిగో చూడు! అక్కడున్న బంటీ ఎంత బుద్ధిమంతుడో వాడికసలు జోడు కూడా లేదు. అయినా పేచీ పెట్టాడా? " అంటూ బంటీని చూపించాడు సన్యాసిరావ్.

తక్షణం పేచీ మానేసి, 'బంటీ వాళ్ల డాడీ ఏడీ? ' అనడిగాడు నానీ.

కొడుకు ఏడుపు మాన్పించ గలిగాననే సంతోషంతో, నానీని ఎత్తుకుని బంటీవాళ్ళ నాన్న దగ్గరికి తీసుకెళ్ళాడు సన్యాసిరావ్.

'నేనూ ఈ డాడీ కొడుకుని అవ్వాల్సింది. బుద్ధిలేక నీ కొడుకుని అయ్యాను'

'మమ్మీ నాకీ కొత్త డాడీ కావాలీ' అంటూ, మళ్ళీ ఏడుపు లింకించుకున్నాడు నానీ

సన్యాసిరావ్ సిగ్గుతో అక్కడినుంచి పారిపోయాడు.

– ఎ. అన్నపూర్ణ

**మహనీయులు చరిత్రను సృష్టించరు చరిత్రే మహాపురుషులను మలుస్తుంది.**

– స్టాలిన్

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనా శక్తిని రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తమ ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**నవలను గురించే కాక ఇతర శీర్షికలపై కూడా పాఠకుల అమూల్య అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాం.**

**కూపన్**

ఆగస్టు చతుర నవల **అందిన స్వర్గం**

సమీక్షకుని పేరు: ____________________

చిరునామా: ____________________

____________________

____________________

# తలలపై కొబ్బరి కాయలు కొట్టించుకునే వీరభద్రుని భక్త'వీరులు'

చతుర ఫీచర్

ఏడాది పొడుగునా ఇంటిల్లి పాదీ శ్రమించగా చేతికందిన పంటను చూసి రైతు కుటుంబం మురిసిపోతుంది. ధాన్యలక్ష్మి ఇంటి నిండా కళకళలాడుతుంటే పొలంలో తనకు సాయంగా నడిచి, దుక్కి దున్ని, ఫలసాయాన్ని లోగిలిలోకి



తెచ్చిన ఎద్దులపై ఎనలేని ప్రేమ పొంగు తుంది. అందుకే రైతు కనీసం ఏడాది కొక్క రోజైనా ఎద్దుల్ని అలంకరించి ఊరేగిస్తాడు. పందాలు పెట్టి మురిసిపోతాడు. శివుని వాహనమైన నందిగా భావించి పూజలు చేస్తాడు. ఇది మన రాష్ట్రంలోనే కాదు. అనేక ప్రాంతాల్లో ఉన్న సంప్రదాయం.

కర్నాటకలో పంటలు చేతికందినప్పుడు ఎద్దులను అలంకరించి, పూజించి, ఊరేగించి ఆనందిస్తారు. వీరభద్రుని ఆల యాలలో ఎద్దును దేవునికే సమర్పిస్తారు. దైవకార్యాలకి, జాతర ఉత్సవాలకీ తప్ప గుడికి చెందిన ఎద్దుతో వ్యవసాయపు పనులు చేయించరు. నంది రూపంగా భావించి దానికి పూజలర్పి స్తారు. కర్నాటకలోని 'కురుబ' తెగవారు జరుపు కునే దొడ్డజాతరలో ఎద్దులకి, విశే షమైన ఆదరణ ఉంది. జాతర సందర్భంగా ఎద్దుల్ని కనువిందుగా అలంకరించి, ఊరేగించి జాతర ముగింపును సూచిస్తూ ఎద్దు తలపై రెండు కొబ్బరికా యలు పగలగొడతారు. ఇది అక్కడి విశేషం.

కురుబలుగా పిలువబడే గొర్రెల కాప రులు కర్నాటక రాష్ట్రంలో దాదాపు 35 లక్ష



లకు పైగా ఉన్నారు. వ్యవసాయం, గొర్రెల పెంపకం, ఊలు నేయటం వారి ప్రధాన వృత్తులు. వీరు దేశవ్యాప్తంగా నివసిస్తున్నారు. తమిళనాడులో ఈ తెగవారిని 'కురుంబ' అనీ మన రాష్ట్రంలో 'కురుమి' అనీ మధ్యప్రదేశ్‌లో 'ధాన్‌గడ్' అనీ, ఉత్తర ప్రదేశ్‌లో 'గడేరియా' లేక 'బాగేల్' అనీ, రాజస్థాన్‌లో 'పాల్‌క్షత్రియ' అనీ అంటారు. కురుబలు సాధారణంగా ఊరూరా తిరుగుతుంటారు. వీరు నిజాయితీపరులు. కలహాలు, సమస్యలు సృష్టించని అమాయకులు. వీరి సత్యప్రియత్వాన్ని ఇష్టపడిన మైసూరు మహారాజావారు వీరిని తన ప్రత్యేక పరిచారకులుగా నియమించేవాడు. ఇప్పటికీ వీరు తమ ఆచారాల్ని పాటిస్తూ సాధారణ జీవనం గడుపుతున్నారు.

కురుబల ఆరాధ్యదైవం వీరభద్రుడు. వీరభద్రునే బీరేశ్వరుడునీ, బీరదేవరు అనీ అంటారు. వీరభద్రుడు శివుని కుమారుడు. హిందూ పురాణగాథల్లో పురాతనమైన, ప్రశస్తమైన కథలో ఈ కురుబల నమ్మకాలు ముడిపడి ఉన్నాయి. పురాణ కథనం ప్రకారం సత్ర యజ్ఞానికి శివుడు, ఆయన మామగారైన దక్ష బ్రహ్మ వెళ్తారు. దక్షబ్రహ్మకంటే ముందుగా యజ్ఞవాటికను చేరిన శివుడు ధ్యానమగ్నుడై తనకై కేటాయించిన స్థలంలో కూర్చుంటాడు. దక్షబ్రహ్మ యజ్ఞవాటికకు వెళ్ళేసరికి గౌరవసూచకంగా అందరూ లేచి నిలబడి ఆయనకి అభివాదం చేశారు. శివుడు దక్షబ్రహ్మ వచ్చిన సంగతి గమనించక లేచి నిలబడడు. శివుడు గర్వంతో తనను అలక్ష్యం చేశాడనీ, ఆయనకి యజ్ఞపు హవిస్సుని ఇవ్వకూడదనీ దక్షుడు వాదించాడు. తన ఆరాధ్యులైన బ్రహ్మ, విష్ణుల ధ్యానంలో ఉండి, దక్షుని రాకను గమనించలేదని చెబుతూ శివుడు యజ్ఞస్థలం నుండి నిష్క్రమించాడు. దక్షబ్రహ్మకు ఆ తరువాత కూడా శివునిపై కోపం తగ్గలేదు. కొన్ని

రోజులు గడిచాక అల్లుడిని చిన్నబుచ్చే ఉద్దేశంతో ఘనంగా యజ్ఞం చేయాలని నిశ్చయిస్తాడు. ఆహ్వానితులందరికీ ఖరీదైన వస్త్రాలు పంపించి కూతురు పార్వతికీ, అల్లుడు శివునికీ ఆహ్వానాలు పంపించలేదు. దివ్యంగా అలంకరించుకుని ప్రవాహ సదృశంగా ఆహ్వానితులు యజ్ఞశాలకు బయలుదేరి వెళ్తుంటే పార్వతి చూసి, తను కూడా తండ్రిగారి యజ్ఞానికి వెళ్లాలనే కోరికను అణచుకోలేక బయల్దేరుతుంది. పిలవని పేరంటానికి వెళ్తున్నందుకు పర్యవసానాన్ని భరించడానికి సిద్ధపడుమని చెప్పి అయిష్టంగానే ఆమె వెళ్లేందుకు సమ్మతిస్తాడు శివుడు. ఆమెకు తోడుగా నందిని పంపిస్తాడు. మహాద్వారంలో ప్రవేశించివస్తున్న పార్వతిని చూసి అనాహ్వానిత అతిథి వస్తోందనీ, ఎందుకు వచ్చావనీ దక్షబ్రహ్మ ఆమెని నిందిస్తాడు. అతిథులు ఎందరో చూస్తుండగా తండ్రి తనని అవమానించటం పార్వతి భరించలేకపోతుంది. కైలాసానికి తిరిగివెళ్ళి భర్తకు ముఖం చూపలేని అవమానభారంతో యజ్ఞకుండంలోకి దూకి ఆత్మాహుతి చేసుకుంటుంది. ఈ వార్త తెలిసిన శివునికి పట్టలేని ఆగ్రహం వస్తుంది. తన కుమారుడు వీరభద్రుని పిలిచి దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేయమని ఆదేశిస్తాడు. వీరభద్రుడు తన అనుచరులతో కలిసి వెళ్ళి దక్ష యజ్ఞాన్ని ధ్వంసం చేస్తాడు. దక్షుని అనుచరుల తలలు నరికి 'రుండమాల'గా పుర్రెల దండను మెళ్లో వేసుకుంటాడు. దక్షుని తల నరికి శివుని వద్దకి తీసుకువెళ్తాడు.

అసంపూర్తిగా యజ్ఞం ముగిసినందుకు దేవతలు బాధపడి యజ్ఞం పూర్తిచేయాలనీ, దక్షుడు యజ్ఞకంకణం విప్పకపోతే విపత్తులు రాగలవనీ, దక్షుని పునర్జీవితుని గావించి యజ్ఞం పరిసమాప్తి చేయించమనీ శివుని వేడుకుంటారు. దక్షుని భార్య ప్రసూతాదేవి పువ్వులు, పళ్లూ తీసుకువెళ్ళి శివునికి అర్పించి ఏ పాపమెరుగుని తనకు వైధవ్యం శాపంగా మారటం అన్యాయమనీ, తన భర్తని బతికించమనీ ప్రార్థిస్తుంది. వీరి ప్రార్థనలను మన్నించిన శివుడు దక్షబ్రహ్మకు ప్రాణదానం చేయాలనుకుంటాడు. కానీ అతనికి గర్వభంగం చేయాలని పాత శిరస్సు బదులుగా మరొక తలను అతికించాలనుకుని వీరభద్రుని పిలిచి గొర్రెతలను ఒక దాన్ని ఖండించి తెచ్చి దక్షబ్రహ్మ మొండానికి అతికించుమని ఆదేశిస్తాడు. వీరభద్రుడు తండ్రి ఆదేశం పాటిస్తాడు. గర్వభంగం జరిగిన దక్షబ్రహ్మ మిగిలిన తన వాజపేయ యజ్ఞాన్ని పూర్తిచేయడానికి వెళ్తాడు. ఫలితంగా గొర్రె తలను తీసుకువెళ్ళి దక్షబ్రహ్మకు అతికించిన వీరభద్రుడు గొర్రెల కాపరులైన కురుబలకు ఆరాధ్యదైవమయ్యాడు. వీరభద్రుని సాహసోపేత చర్యల్ని తలచుకొని కురుబలు పులకించిపోతారు. ప్రత్యేక భక్తులు 'వీరుల' తలలపై కొబ్బరికాయలు పగులగొడతారు. కురుబలు తమ ఆలయాల్లో గర్భగుడిలో వీరభద్రునే ప్రతిష్ఠించుకుంటారు. వీరభద్రుని నాలుగు చేతుల్లో కత్తి, కర్ర, ధనుస్సు, బాణం ఉంటాయి. మెడలో రుండమాల ఉంటుంది. ఆయన కుడివైపున గర్వభంగం పొందిన దక్షబ్రహ్మ గొర్రెతల అమర్చాక వచ్చిన రూపంతో ప్రణామాలర్పిస్తుండగా వీరభద్రుని ఎడమవైపు పువ్వులు, పళ్ల పళ్లెంలో అమర్చుకుని ప్రసూతాదేవి నిలబడి వుంటుంది. ఈ మూర్తులకీ, శివునికీ కురుబలు పూజలు చేస్తారు.

కర్నాటకలో లెక్కలేనన్ని వీరభద్రుని ఆలయాలు ఉన్నాయి. ఒక్కో గుడికి వెయ్యిమందికి పైగా కురుబ కుటుంబాల వరకు, ఉండి పూజలర్పించటం జరుగుతుంది. వివాహ సమయాల్లో అతను ఏ గుడికి చెందిన వాడో చెప్పిన తరువాతే మిగతా వ్యవహారాలు మాట్లాడుకుంటారు.

పొలాల్లో ధాన్యం దండిగా పండితే, గొర్రెల పెంపకం ద్వారా ఆదాయాలు కలిసివస్తే, కురుబల నాయకులు, గుళ్ల నిర్వాహకులు కలిసి జాతర నిర్వహణ గురించి చర్చిస్తారు.



10 నుండి 15 సంవత్సరాల వ్యవధిలో జాతర జరుపుకుంటారు. ఏడాదికి ఒకసారో, తరచుగానో జాతర చేసుకోవాలన్న కుతూహలం అందరిలోనూ ఉన్నా ఈ సందర్భంగా అయ్యే ఖర్చును భరించటం ఈ అల్పాదాయవర్గాలకు అసాధ్యం కనుక జాతర జరిపే వ్యవధిని పెంచుతారు. పది, పన్నెండేళ్లకు ఒకసారి జరిపినా ఎంతో ఘనంగా నిర్వహిస్తారు. ఈ జాతర సాధారణంగా ఏప్రిల్ నెలలో జరుగుతుంది. ఈ రోజుల్లోనే కురుబలకి పనులనుండి విరామం దొరుకుతుంది. కుల పెద్దలు జాతరను గురించిన నిర్ణయం తీసుకున్న తరువాత 8, 9 మంది సభ్యులు కలిసి ఆరు నెలలు ముందే జాతర నిర్వహణకోసం అన్ని గుడులకు చెందిన కురుబ కుటుంబాలను దర్శిస్తారు. జాతర వివరాలు తెలుపడానికి వెళ్తూ అలంకరించిన నందిని తమతో ఇంటింటికీ తీసుకువెళ్తారు. ప్రతి గుడికీ ప్రత్యేకమైన నంది ఉంటుంది. ఇది దైవానికే పరిమితమని దీనిచేత వ్యవసాయం పనులు చేయించరు. దీనికి పూజలు చేసి, పవిత్ర జలం పైన చిలకరించి జాతర నిర్వహణకు మాత్రమే ఉపయోగిస్తారు. ఈ ఎద్దు పైన డప్పులు పెట్టి ఊరేగింపుగా బయల్దేరతారు. ప్రతి గ్రామంలోనూ డప్పు వాయిద్యాలతో, నాదస్వరంతో ఈ వృషభానికి గ్రామస్తులు స్వాగతం పలుకుతారు. ప్రతి గృహస్తు

ఈ నందికి పూజలు చేసి, ప్రత్యేకంగా దాని కోసం తయారుచేసిన పదార్థాల్ని తినిపించి జాతరకు గాను తమ వంతు వాటాగా కొంత పైకం చెల్లిస్తారు. ఈ ఊరేగింపుద్వారా రెండు రకాల లాభాలున్నాయి. జాతరకు కావలసిన సొమ్ము సమకూరుతుంది. కురుబ లందరికీ జాతర జరిగే సమయం, వివరాలు తెలుస్తాయి.

సుమారు ఇరవై ఎకరాల ఖాళీస్థలంలో చెరువు లేదా నదీ తీరంలో అన్ని గుళ్లకు చెందిన కురుబలు కలిసి మూకుమ్మడిగా జాతర నిర్వహిస్తారు. ఇక్కడే తలలపై కొబ్బరికాయలు కొట్టే ఆచారాన్ని నిర్వహిస్తారు. సాధారణంగా కోలార్ కురుబపేట వద్దగల చెరువు సమీపంలో ఈ దొడ్డజాతర నాలుగు రోజులు జరుగుతుంది. ఇక్కడికి కాలినడక తోనూ, ఎద్దుల బళ్ళపైనా, బస్సులపైనా కురుబలు తరలివస్తారు. దూరతీరాలనుండి కూడా మరికొందరు భక్తులు వస్తారు.

జాతర జరిగేరోజు ఉదయాన్నే భక్తులంతా కొండపై ఉన్న అంతర గంగవద్ద స్నానానికి బయల్దేరతారు. ఇరువైపులా యుకలిప్టస్ చెట్లు ఉంటాయి. మధ్య ఉన్న సుమారు వంద మెట్లెక్కి కొండపైకి చేరతారు. అంతర గంగా స్నానంతో ఉత్సవం ప్రారంభమవుతుంది. వీరభద్రుని విగ్రహాలకి స్నానం చేయించి గంగను పూజిస్తారు. ఆలయ వితానంలో ఉన్న నంది ప్రతిమ నోటి ద్వారా నీరు ప్రవహిస్తుంటుంది. ఈ నీటిని తాగడానికి భక్తులు పోటీలు పడతారు.

తలలపై కొబ్బరికాయలు కొట్టించుకునే భక్తుల్ని 'వీరులు' అంటారు. ఈ వీరులు 'అంతరగంగ' జలంలో స్నానం ముగించి ఉపవాసం ఉంటారు. శివునికి పూజలు చేస్తారు. ఇనుపకర్రను 'అలగు' అనీ, బాకాను కాహళె అనీ, కాషాయ దుస్తులు ధరించి నర్తిస్తూ భక్తి పాటలు పాడే భక్తుని 'కలటగరారు' అనీ అంటారు. ఈ కలటగరారులు దేవుని శ్లాఘిస్తూ కీర్తనలు పాడి ఆయన ఆశీస్సుల్ని కోరుకుంటారు.

ఆ తరువాత 'వీరుల'కి పూలదండలు వేస్తారు. కురుబల్లోనే లింగాయతుడైన పూజారికి వీరులు వినయంగా పాదాభివందనం చేసి దీవెనలు పొందుతారు. పూజారి వీరుల నొసటిపై అడ్డంగా త్రిమూర్తులకి ప్రతీకలుగా మూడు వేళ్లతో విభూతి రేఖలని గీస్తాడు. వీరులు పూజారులు కలిసి అలంకరించిన నందివద్దకి వచ్చి దాని చుట్టూరా గుమిగూడతారు. మరి కొందరు బాకాలు ఊదటంతో దొడ్డజాతర ప్రారంభమవుతుంది. ఆ తరువాత వీరుల తలలపై కొబ్బరి కాయలు కొట్టే కార్యక్రమం మొదలవుతుంది.

వీరులు నంది ఎదుట మోకాళ్లపై వంగి దానికి నమస్కరిస్తారు. ఆ తర్వాత పవిత్రమైన అలగును (ఇనుపకర్రను) గట్టిగా చేతితో పట్టుకొంటారు. ఆ అలగు ద్వారా, దివ్యశక్తులు వస్తాయని గాఢంగా విశ్వసిస్తారు. అలగు పట్టుకోగానే ట్రాన్స్‌లోకి వెళ్తారు. అప్పుడు వీరుని తలపై కొబ్బరి కాయ కొడితే అది రెండు ముక్కలవుతుంది. కానీ అతనికి ఏ మాత్రం బాధకలుగదు. దెబ్బ తగలదు. ఒక కొబ్బరికాయ కొట్టగానే వీరులు తమ పొజిషన్‌ని మార్చి చేతిలోని ఇనుపకర్రను గట్టిగా పట్టుకుని నేలపై ఆన్చి లేక మోకాళ్లపై అదిమో తరువాత దెబ్బకోసం సిద్ధపడతారు. 25 మంది వీరుల తలలపై దాదాపు 800 కొబ్బరికాయల్ని పగులగొడతారు. అంతర గంగ దగ్గర ఉన్న వీరభద్రుని ఆలయంవద్దనేగాక కురుబ పేటలోని ప్రధానాలయంలో కూడా ఇలా వీరుల తలలపై టెంకాయలు కొడతారు. ముఖ్యంగా తలపై కొట్టే కొబ్బరికాయ ఒకే ఒక్క దెబ్బకి రెండు ముక్కలు కావాలి. ఉత్సవం ముగింపు రోజున ఉత్సవం ముగిసిందని సూచిస్తూ పూజారి రెండుకొబ్బరి కాయల్ని ఇద్దరు వీరుల తలలపై కొడతాడు. ఆ తరువాత నంది తలపై రెండుకొబ్బరి కాయలు కొట్టి జాతరను పరిసమాప్తం



*నేను పాటలు పాడి! నీవు ఆటలు ఆడి!! చేరుకుందాం మనం శివుని గుడి!!!*

చేస్తాడు. అంతర గంగనుండి కొండ దిగువన గల ప్రధానాలయం వద్దకు ఊరేగింపుతో భక్తులు తమ తలలపై వీరభద్రుని ప్రతిమను మోస్తూ వెళ్తారు. వారి తిరుగు ప్రయాణంలో తొలి మజిలీగా 'తీలెకుట్టి' ఆలయం దగ్గర ఆగి పూజారి అక్కడి గుళ్లో పూజలు చేస్తాడు. అక్కడి గుళ్లోని బీరేశ్వరుని పాదసన్నిధిలో అత్యంత భక్తిశ్రద్ధలతో వీరుల తలలపై తెగిన కొబ్బరికాయ ముక్కల్ని పెడతారు. కాషాయం దుస్తులు వేసుకున్న 'కలటగరారు' భక్తులు మళ్ళీ నృత్యం చేస్తూ భక్తిగీతాలు పాడతారు. మళ్ళీ ఊరేగింపు బయల్దేరుతుంది.

వీరులకి శివుని స్తుతించే కొన్ని మాటలు తప్ప శ్లోకాలు, మంత్రాలు రావు. వారికి భగవంతునిపై, ఆచార వ్యవహారాలపై అనన్యమైన భక్తి విశ్వాసాలుంటాయి. వీరుల తండ్రులు, తాతలు కూడా వీరులే! దొడ్డ జాతరలో వారంతా వీరులుగా తలలపై భక్తిగా కొబ్బరికాయలు కొట్టించుకున్నవారే! ఒక వీరుడు మరణిస్తే కొబ్బరికాయలు తలపై జాతర సమయంలో కొట్టించుకునే బాధ్యత అతని పెద్ద కుమారునిదే! తండ్రి మరణ సమయానికి కొడుకు తక్కువ వయసులో ఉన్నా అతనేమీ కంగారుపడక ఎంతో ఉత్సాహంతో తన విధిని నిర్వర్తిస్తాడు. వీరునికి సంతానం లేకుంటే అర్హతకల మరొకరికి ఈ విధి అప్పగిస్తారు. ఒక కుటుంబంలో ఒక్క వ్యక్తికే గురుదీక్ష ఇచ్చి వీరునిగా చేస్తారు. నియమాలు పాటించగల నిగ్రహశక్తి, భగవద్భక్తి కల వారికే గురుదీక్ష ఇస్తారు. వీరుడు కాళ్లకి చెప్పులు వేసుకోకూడదు. అతని భోజనం విడిగా, శుచిగా వండాలి. వివాహాలలో, మరణ సందర్భంలో ఇంకా ఇతర సామూహిక విందుల్లో అతను భోజనం చేయకూడదు. దొడ్డ జాతరలోపాల్గొనమని వీరుడిని ఎవ్వరూ ఆహ్వానించనవసరం లేదు. జాతర విషయం వినగానే అక్కడికి వెళ్లటం అతని నైతిక బాధ్యత. కొబ్బరి కాయలు తలపై కొట్టించుకున్న తర్వాత ఎవరినుండైనా కానుకలు, పైకం స్వీకరిస్తే అది దైవాపరాధంగా

భావించబడుతుంది. ఒక వీరుని తలపై ఒకే రోజున యాభై కొబ్బరికాయలు కొట్టినా అతనికి నొప్పి అనిపించదు. ఈ శక్తి ఇను పకర్రను పట్టుకున్నపుడు సంక్రమించిన దైవ శక్తే అని వారి విశ్వాసం. పైగా ఈ కార్య క్రమానంతరం వారికెంతో మానసిక ప్రశాం తత లభిస్తుందంటారు.

వీరుడు తన నియమాల్ని అతిక్రమిస్తే అతని దివ్యశక్తులు పోతాయని ఆ తెగవా రంతా నమ్ముతారు. అందుకు నిదర్శనంగా శిక్షగా జాతరరోజు ఆ వీరుని తలపై కొబ్బ రికాయ పగలదు. తలలోనుండి వెంటనే రక్తం స్రవిస్తుంది. వీరుడు తన దోషాల్ని ఒప్పుకుని క్షమించమని దేవుణ్ణి ప్రార్థిస్తాడు. పవిత్రస్నానం చేసి, కులపెద్దలకి అపరాధ రుసుం చెల్లించి మళ్ళీ తననుతాను ఆచారా నికీ, దేవునికీ మానసికంగా శారీరికంగా అర్పించుకుంటాడు. ఇక ముందెన్నడూ నియమోల్లంఘన చేయనని ప్రమాణం చేస్తాడు. ఆ తరువాత కొబ్బరికాయలు అతని తలపై ఎప్పటిలా సునాయసంగా పగులుతాయి.

మరునాటి సాయంత్రం చెరువు దగ్గరి కురుబల ప్రధానాలయంవద్ద ముగింపు ఉత్సవం జరుగుతుంది. ఆ తెగలోని అన్ని కుటుంబాలవారు తమ బంధుమిత్రులతో, కుటుంబ సభ్యులతో కలిసి పూజకు హాజరవు తారు. 30 తెగలకుపైగా కురుబలు ఈ పూజలు చేస్తారు. త్రాసులా ఉండే కావడికి రెండువైపులా 'కంబి', 'కావడి' వేలాడదీస్తారు. దీనిని ప్రతి కురుబ కుటుంబ పెద్ద ఆలయం దగ్గరికి మోసుకువస్తాడు. ఒక చివర కట్టిన కంబిలో బియ్యంతో చేసిన 12 కిలోల బరు వున్న తీపి వంటకం, నేతిదీపం పెడతారు. మరో చివర కట్టిన 'కావడి'లో 15 కిలోల బరువున్న బియ్యపు కుండ, బెల్లం, నెయ్యి, జీడిమామిడి పలుకులు వుంచుతారు. ఆ తరువాత ఇవన్నీ వండి ప్రసాదంగా పంచిపె డతారు. కంబి సుమారు 30 కిలోల బరువు తూగుతుంది. బియ్యంలో వెలుగుతున్న దీపాన్ని ఆరకుండా చూసే బాధ్యత 'కంబిని' భుజాలపై మోసే వ్యక్తిదే!

పూజ ముగిసే రోజున తల్లిదండ్రులో, సోదరులో తెచ్చిన కొత్తచీరల్ని స్త్రీలు కట్టు కుంటారు. బియ్యంతో చేసిన చిన్నచిన్న తీపి బిళ్లలు, వెలిగే దీపాలను ఒక పెద్ద పళ్లెంలో పెట్టి పూజకోసం గుడికి ఇంటి యజమానురాలు మోసుకువెళ్తుంది.

'కంబి'ని గుడికి తెచ్చేసరికి చీకటిపడు తుంది. తలలపై వెలుగుతున్న దీపాలప ళ్లాలు పెట్టుకుని, రంగురంగుల కొత్తచీరలు కట్టుకుని వరుసగా మహిళలు వీరభద్రుని ఆలయంలోకి వెళ్తారు. తమ కుటుంబానికి మేలు జరగాలని వీరభద్రుని వేడుకుంటారు.

బియ్యంతో చేసిన తీపి పదార్థాల్ని వెదు రుబుట్టలో, కంబిలో పెట్టి ఇంటి పెద్ద తలపై పెట్టుకుని మోస్తాడు. ఆయన తరు వాత వివాహమైన వాళ్ళు ఒకరితర్వాత మరొకరుగా దానిని తలపై కాస్సేపు పెట్టు కుంటారు. ఇంటిపెద్ద తరువాత దొడ్డ జాతర నిర్వహణకు వారసులుగా ఒకరి తర్వాత మరొకరం సిద్ధంగా ఉన్నామని చెప్పడమే దీని అంతరార్థం. బెంగుళూరు నుండి 65 కిలోమీటర్ల దూరంలో ఉన్న కోలార్‌లో ఏప్రిల్‌లో దొడ్డజాతర జరు గుంది. జాతర ముగియగానే వీరులు తమ ఇళ్లకి వెళ్ళిపోతారు. దైవభక్తితో, నియమబ ద్ధమైన జీవనం గడుపుతూ తరువాత దొడ్డ జాతర పిలుపుకి ఎదురుచూస్తుంటారు. వీరులు వీరభద్రునికి మొక్కినపుడు తమకి ఆస్తులూ, అంతస్తులూ కావాలని వరాలు కోరుకోకుండా మళ్ళీ జరుగబోయే దొడ్డజాత రలో తనూ, తనవారూ సంప్రదాయాల్ని సవ్యంగా నిర్వర్తించాలని, తరతరాలవరకు వీరభద్రుని ఆశీస్సులు తమపై ఉండాలని కోరుకుంటారు.

– జ్యోతిరాణి

✦

# చతుర ప్రపంచం

# జ్ఞానపీఠ బహుమతి గ్రహీత కేశవలాల్‌షా

రాజేంద్ర కేశవలాల్ షా, అహమదాబాద్ నగరానికి వెలుపల గల భోపాల్‌లో నివసిస్తున్నాడు. ఆయన నిరాడంబరుడు. ఎల్లప్పుడూ నమ్రతగా ఉంటాడు. అహమ్మదాబాద్ నగర ప్రాంతంలో ప్రముఖ సాహితీవేత్తలు ఎందరో ఉన్నారు. అచ్చట వీచే గాలి సాహిత్య తరంగాలతో ఇమిడి ఉంటుంది. అది కవితా పరిమళాలను వెదజల్లుతుంది. ఇదివరలో గుజరాతీయులైన ఉమాశంకర్ జోషీ, ప్రసన్నలాల్ పటేల్‌లు కూడా జ్ఞానపీఠ పురస్కారాన్ని పొందారు. ఆ కోవకు చెందిన వాడే కేశవలాల్ షా. జ్ఞానపీఠ పురస్కారం యొక్క న్యాయనిర్ణేతలు కేశవలాల్‌ను అత్యంత ప్రతిభావంతునిగా బహుధా ప్రశంసించారు! గుజరాతీ కవిత్వంలో ఓ కొత్త వరవడిని ఆయన ఏర్పరచారని న్యాయనిర్ణేతలు అన్నారు.

కవి, విమర్శకుడు డాక్టర్ చంద్రకాంత్ టోపీవాలా ఇలా అన్నారు-

"కేశవలాల్ సౌందర్యోపాసకుడు. ప్రకృతి సొగసులను చూసి పరవశించి అద్భుతమైన కవితలు వ్రాశాడు. వాటిని మృదుమధురంగా పాడాడు!"

షా 1913వ సంవత్సరంలో, ఉత్తర గుజరాత్‌లోని కపాడ్‌వన్జ్‌లో జన్మించాడు. ఆయన 2వ సంవత్సరంలోనే తండ్రి మరణించాడు. 20 సం.రాల వయస్సు వచ్చేసరికి షాలో కవిత్వం పొంగిపొరలసాగింది. అప్పుడాయన ముంబాయిలోని విల్సన్ కాలేజీలో చదువుతున్నాడు. ఫిలాసఫీలో పట్టభద్రుడైన షా అనేక ఉద్యోగాలు చేసి చివరికి రచయితగా స్థిరపడ్డాడు.

"కవితలు గురించి కలలు కనడం,
వాటిని వ్రాయడం ఎంతో ఆనందం
కలిగిస్తుంది! నా నుంచి కవితలు
జాలువారుతున్న ప్రతి నిమిషం
పరవశత్వం కలిగిస్తుంది!" అంటారు షా.

ఇప్పటికి ఆయన 21 పుస్తకాలు ప్రచురించారు. 1951లో ఆయన తొలి పుస్తకం "ధవానీ"(లోలోపలి శబ్దాలు) ప్రచురించబడింది. ప్రస్తుతం ఆయన కవితా సంకలనం "వహున్‌సాక్షి"(అవును నేనొక సాక్షిని) ప్రచురణలో ఉంది. షా గేయాలు- ప్రేమ గురించీ, ప్రకృతి, మతం, మృత్యువు, మాయ, నవీన నాగరికత, గ్రామీణ జీవితాలతో నిండి ఉంటాయి. ఆ రచయిత సానెట్స్, గజల్, హైకూల రచనల్లో బహునిష్ణాతుడు!




1964లో కేశవలాల్ షాకు సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. ఆయనకు గుజరాత్‌లో గల అత్యున్నత సాహితీ పురస్కారాలు అన్నీ లభించాయి. షా చెయ్యి తిరిగిన అనువాదకుడు. సంస్కృతం, బెంగాలీ, గుజరాతీ భాషలలోని ఉత్తమ గ్రంథాలను చక్కగా అనువదించారు.

సాహిత్యాన్ని సంపన్నం చేస్తున్న కేశవలాల్ షా ఎంతైనా అభినందనీయుడు!

# కళాఖండాల వంటి ఆనాటి కాలసూచికలు

శాస్త్రజ్ఞుల చేత రూపకల్పన చెయ్యబడిన చక్రం, స్టీమ్ ఇంజన్, విమానం - మానవాళికి చేసిన మేలు అనన్య సామాన్యమైనది!

కాలాన్ని సూచించే సాధనమైన గడియారాన్ని శాస్త్రజ్ఞులు రూపొందించడం ఎంతో గొప్ప విషయం! రోజూ గడియారం మనకు ఎప్పటికప్పుడు కాలాన్ని తెలియపరుస్తూ మనల్ని అద్భుతమైన రీతిలో ప్రభావితం చేస్తోంది!

తొలిసారిగా రూపొందించబడిన గడియారం 'సన్‌డయల్' - అనేది. దీనినే 'షాడో క్లాక్' అంటారు. అటు పిమ్మట 'వాటర్ క్లాక్స్' ఆవిర్భవించాయి. తర్వాత 'శాండ్ గ్లాస్'లు, టైమ్ క్యాండిల్స్ అమలులోకి వచ్చాయి. 13వ శతాబ్దం తొలిరోజుల్లో, లోపలవున్న యంత్ర సామగ్రితో పనిచేసే మొదటి గడియారం ఆవిష్కరించబడింది. తదాది ఎన్నెన్నో గడియారాలుబహుసుందరమైనవి, అద్భుతమైనవి రూపుదాల్చాయి. చిత్ర విచిత్రమైన ఆకారాలతో, కళాఖండాలను తలపించే పనితనంతో ఆ గడియారాలు ప్రపంచం నలుమూలలా నెలకొన్నాయి. ఆనాటి కళాకారుల ప్రతిభను, నాటి నాగరికతను మనకు ప్రస్ఫుటంగా విశదం చేస్తూ దిగ్భ్రాంతి కలిగిస్తాయి. అటువంటి గడియారాలను నేడు మనం హైదరాబాద్‌లోని 'సాలార్‌జంగ్ మ్యూజియం'లో చూడవచ్చు అచ్చట 178 గడియారాలు కొలువుతీరాయి. వాటిని ప్రపంచం అంతటినుంచీ, మీర్ యూసఫ్అలీఖాన్ (సాలార్‌జంగ్3) సేకరించాడు. ఇవి 18 నుంచి 20 శతాబ్దాలలో రూపొందించబడ్డవి. వాటిల్లో తాబేలు పెంకుపై ఇత్తడితో సొగసైన అలంకారంతో చేసిన గడియారం చూడముచ్చటగా ఉంటుంది! ఫ్రాన్స్ నుంచి సాలార్‌జంగ్ తెచ్చిన పాలరాతి గడియారం బహుసుందరంగా ఉంటుంది. ఫ్రాన్స్ రాజు కోసం, పేరు పొందిన గడియారాల శిల్పి జూలియన్ రిలామ్ రూపకల్పన చేశాడు.

'క్లాక్' అనే పదం ఇంగ్లాండులో ఉద్భవించింది. అంతకుముందు గడియారాలను అందరూ 'హోరోలోగ్యూ' అనేవారు. తాతాల నాటి గడియారాలు పేరిట అతి పెద్ద గడియారాలు కూడా అక్కడ దర్జాగా నిలబడి ఉన్నాయి. అతిసుందరంగా పోర్సిలిన్‌తో రూపొందించబడిన జర్మన్ పోర్సిలిన్ కక్కూ గడియారాలు తమాషా ఆకారంలో చెక్కతో తయారు చెయ్యబడినవి. ఐరోపాకు చెందిన క్యూపిడ్ గడియారాలు మనకు ఆనందం కలిగిస్తాయి.




17వ శతాబ్దానికి చెందిన అస్థిపంజరంతో రూపకల్పన కావించబడిన ఓ గడియారం అందరికీ విస్మయం కలిగిస్తుంది! వెనకటి కాలంలో కూడా, ఆనాటి పనివారు కనపరిచిన ప్రతిభ మనకు ఆనందాన్ని ఇస్తుంది.

★

# పాఠకుల కోరిక మేరకు...

## అమూల్యం

**మే** నెల చతురలో మహర్షి దాతా దయాల్ శివవ్రతలాల్ వర్మన్‌గారు 'పవిత్రత' గురించి ఎంతో వివరంగా, మనసును నిర్మలంగా ఎలా వుంచుకోవాలో సోదాహరణంగా వివరించారు.

ఈ జ్ఞానతరంగిణి శీర్షిక పాఠకులకెంతో ప్రయోజనకరంగా వుంది. ఈ శీర్షిక పాఠకులకు అందించే సందేశం అమూల్యం! నూరు పేజీల నవల అందించే సందేశం కంటే రెండు పేజీల జ్ఞానతరంగిణి అందించే సందేశం విలువైనదిగా వుందంటే అది అతిశయోక్తికాదు.



"స్నానం చేసి పరిశుభ్రమైన దుస్తులు ధరించటం శరీరం యొక్క పవిత్రత! ఎవరినీ నిందించకుండా అందరికీ నచ్చే మాటలు మాట్లాడటం వాక్కు పవిత్రత. మనసులోకి దురాలోచనల్ని రానీయకుండా మంచి ఆలోచనలనే పెంచుకోవటం మానసిక పవిత్రత.

ఈ మనో వాక్కాయములకు సంబంధించిన త్రివిధ పరిశుభ్రతే మనిషిని పరిపూర్ణుణ్ణి చేస్తుంది.

అమూల్యమైన ఈ బోధనలోని సారాంశాన్ని ఆసక్తితో చదివి అర్థం చేసుకొనే పాఠకులకెంతో ఆహ్లాదకరం! ప్రయోజనకరం.

ఇంతమంచి సందేశం అందించిన మహర్షిదాతాదయాల్ శివవ్రతలాల్ వర్మన్‌గారు ఏ రాష్ట్రానికి చెందినవారో, వారి పూర్తి వివరాలేమిటో రాస్తే పాఠకులు తెలుసుకునేవారు.

మంచి విషయాలు సేకరించి జ్ఞానతరంగిణి శీర్షిక ప్రారంభించినందుకు జ్యోతిరాణి గారికి అభినందనలు.

**-పారుపల్లి వెంకటేశ్వరరావు, (రచయిత ) హైదరాబాద్**

జ్ఞానతరంగిణి శీర్షిక ప్రారంభించిన డిసెంబర్ 04 సంచిక నుండీ రెగ్యులర్‌గా చదువుతున్నాను. 'స్వాధ్యాయం' మొదలుకొని 'మిత్రులు' వరకూ అన్నీ సూపర్బ్. అభినందనలు.

**– కొడిమెల శ్రీరామమూర్తి,** (రచయిత) ఏలూరు

"నీ కష్టాల్ని ఎవరితోనూ చెప్పుకోకు. సమస్యలు లేనివారుండరు. తమ సమస్యలు తాము, పరిష్కరించుకోలేని వ్యక్తి నీ సమస్యలనేలా పరిష్కరిస్తాడు? నీ కష్టాలెలా తీరుస్తాడు" అన్న 'జ్ఞానతరంగిణి' సందేశాన్ని అక్షరాలా ఆచరిస్తున్నాను. ఈ ఘనత మీదే!

**– శ్రీనివాసమూర్తి,** ఖమ్మం

మంచి శీర్షికలు ప్రవేశపెడుతున్నారు. బాగుంది. రచయితలకు ప్రత్యేకం, కథ వెనుక కథ, 'జ్ఞానతరంగిణి' అన్నీ మంచి శీర్షికలే!

**– ఎన్.వి. రామారావు (టీచర్),** యడ్లపాడు

## 'జ్ఞానతరంగిణి' రచయిత పరిచయం

*మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్‌గారు (1860–1939) ఎం.ఎ. ఎల్.ఎల్.డి., పిహెచ్.డి. పట్టభద్రులు. ఉర్దూ, హిందీ, ఇంగ్లిష్, సంస్కృత భాషలలో నిష్ణాతులు. వారణాసి, అలహాబాద్‌ల మధ్య గోపీగంజ్ సమీపంలో వీరి ఆశ్రమం ఉంది. రాధాస్వామి మతస్థాపకులైన స్వామీజీ మహరాజ్‌గారి శిష్యులైన రాయ్‌సాలిగ్‌రామ్ మహరాజ్‌గారి శిష్యులు వీరు. పర*

మార్గపథ సద్గురువులై తన ప్రవచనాల ద్వారా, రచనల ద్వారా సంత్‌మతం వ్యాపింపచేశారు. వేలాది మందికి జ్ఞానబోధ చేశారు. దాదాపు ఐదువేల ఆధ్యాత్మిక గ్రంథాలను నవలలుగానూ, కథలుగానూ, పద్యరూపంలోనూ, బోధనల రూపంలోనూ వెలువరించారు. అత్యధిక పుస్తకాలు రాసిన రచయితగా వీరి పేరు గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్ పరిశీలనలో ఉంది.

---

అలహాబాదు విశ్వవిద్యాలయంలో ఎం.ఎ. వరకు చదివిన మహర్షి దాతా దయాల్ శివ వ్రత్‌లాల్ వర్మన్‌గారు చికాగో విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్.డి. పూర్తి చేశారు.

వారణాసి, చునార్, మీర్జాపూర్, బరేలి పాఠశాలల్లో ప్రధానోపాధ్యాయునిగా పని చేశారు. అప్పట్లో హమారీ మాతాయేం, సచ్చీమాతాయేం, సచ్చీదేవియాం, సచ్చీస్త్రీయాం, రాజస్థాన్‌కే వీరరాణియా, సతీవృత్తాంత్, రాజ్‌పుతిని యోంకే కర్తవ్య, చిత్తౌడ్‌కీ చఢాయియాం, హిందూ మాతాయేం పృథ్వీరాజ్, రాజ్‌పుత్రోంకీ లడాయియాం, అమలి హోవూదల్, ఆధ్యాత్మిక రామాయణ్, ఆధ్యాత్మిక మహాభారత్, వివేక కల్పద్రుమం మొదలైన అనేక పుస్తకాలు రాశారు. 1905లో మహాత్మా హంసరాజ్, లాలా లజపత్‌రాయ్‌గార్లు 'ఆర్యగజట్'ను ఎడిట్ చేసే పనిని అప్పగించారు. ఆ తరువాత కొన్నాళ్లకు ఆయన 'సాధు' పేరిట తనే ఓ ఉర్దూ మాస పత్రికను ప్రారంభించి జ్ఞానం, ధ్యానం, యోగం, సాంఖ్యం, ప్రేమ, భక్తి, వివేకం, నిర్ణయం, కర్మ, ధర్మం, వేద, పురాణ, గీత, శాస్త్ర, వేదాంత, ఉపనిషత్తులు వంటి వాటికి ప్రాధాన్యమిచ్చారు. ఆ పత్రిక విపరీతమైన ప్రజాదరణ పొంది అత్యధిక కాపీలు అమ్ముడయ్యేవి. ఆధ్యాత్మిక క్షేత్రంలో ఆధ్యాత్మిక భావనలు ఉవ్వెత్తున పొంగాయి. ఫలితంగా సంత్ సందేశ్, సరస్వతీ భండార్, లక్ష్మీభండార్, మార్తాండ్, తత్వదర్శి, పంజాబీ సూర్‌మా మొదలైన మరికొన్ని మాసపత్రికలను ఆయన స్థాపించారు. వీటి ద్వారా దేశం నలుమూలలా ఆయన సర్వోన్నతమైన ఆలోచనా విచారాలు వ్యాపించి పాఠకుల అభిమానాన్ని సంపాదించుకున్నాయి.

1911లో ఆయన చైనా, జపాన్ అమెరికా తదితర దేశాలలో సంత్ మత విలువలను, సందేశాలను విరివిగా ప్రచారం చేశారు. భౌతికవాదులను ఆధ్యాత్మిక వాదులుగా మార్చారు. స్వదేశానికి వచ్చాక విజ్ఞాని, సంత్ సమాగమ్, సంత్ ధౌలాగిరి పర్వత్, అవధూత్, సుమేరుపర్వత్, వేదాంత మేగజైన్, రమతారామ్, మన్‌మగన్, ఉపనిషత్ మేగజైన్, సత్ సంగత్, సంత్ సంజోగ్, సంత్ అమృతవాణి మొదలైన మాసపత్రికలను ప్రచురించసాగారు. వీటి ద్వారా సంత్ మహాత్ముల ఉపదేశాలు ప్రచారమయ్యాయి. శాహీ పరంపర, మోతీపరంపరలో డజన్లకొద్దీ ఆధ్యాత్మిక నవలలు రాశారు. ఆయన పుస్తకాలలో ఆధ్యాత్మికత నిండుగా ఉండి పాఠకులకు మానసిక సాంత్వన, ఆనందం కలిగిస్తాయి. He was himself a book of books 'పుస్తకాలలో ఆయనే ఒక పుస్తకం' అని ఆయనను అభివర్ణించేవారు కొందరు. కబీర్‌యోగం, నానక్‌యోగం, రాధాస్వామియోగం, సురత్ శబ్దయోగం, పంథ సందేశ్, సంత్ సంజోగ్, సంత్‌మాల, భక్తమాల, సాధుమాల, యోగ వశిష్టాయన్, పంచదశీ, భగవద్గీత, విజ్ఞాన రామాయణ్, మహారామాయణ్, ఘట్ రామాయణ్, విజ్ఞాన కృష్ణాయన్, విజ్ఞాన బోధాయన్, విజ్ఞానసంతాయన్, సూఫీయిజమ్, సంత్ అమృతవాణి, సహజయోగ్, ఆనందయోగ్, అద్భుత ఉపాసనా యోగం, శబ్దయోగం, వచన్‌సార్, ఉపనిషత్తుల టీకా వగైరా హిందీలో రాశారు. ఇక ఇంగ్లీష్‌లో శబ్దయోగ్, ఆనంద్‌యోగ్, మెసేజ్ ఆఫ్ పీస్, ఎన్‌ట్రీ ఇన్ టు ది కింగ్‌డమ్ ఆఫ్ ది హెవెన్, లైట్ ఆన్ ది ఆనందయోగ్ మున్నగునవి ముఖ్యమైనవి. ఇవేగాక బౌద్ధ, జైన, హిందూ, సంత్, శాక్త, సూఫీ మతాలపై కూడా పుస్తకాలు రాశారు. మన రాష్ట్రంలో హైదరాబాద్, హన్మకొండ, నిజామాబాద్, కరీంనగర్, హుజురాబాద్, సంగారెడ్డి తదితర ప్రాంతాలలో (1918-1939) విస్తృతంగా పర్యటించి నివసించి ఆధ్యాత్మిక సత్సంగ సందేశాలు ఇచ్చారు. ✦

# 'హీరో' పై సమీక్షలు

జూన్ 2005 'చతుర'లో ప్రచురితమైన సి.ఎస్. చంద్రశేఖర్ నవల 'హీరో' పై మాకు అందిన ఉత్తమ సమీక్షలు

## సమపాళ్ళలో...

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

నాటక లక్షణాలలో కథానాయకుడిని ధీరోదాత్తుడు, గంభీరుడు, నిర్భయుడు, ధైర్యశాలి, ఆపద్బాంధవుడు అని వర్ణించారు. ఈ నవల హీరోలో కథానాయకుడు శశాంక్‌కి పైన చెప్పిన లక్షణాలు చాలా వరకు సరిపోయాయి. కానీ ఇందులో నాయకుడు సున్నిత మనస్కుడు. ఆ సున్నితమైన మనస్సు ఇతరుల సమస్యలకు స్పందించే తీరును రచయిత చాలా అద్భుతంగా మలచారు. ఈ హీరో సమస్యలెదురైనప్పుడు వాటికి ధీటుగా స్పందించి మొక్కవోని విశ్వాసంతో ఆ సమస్యలకు పరిష్కారం కనుగొనడంలో కృతకృత్యుడయ్యాడు. మధ్యలో సమస్యల్లో ఇరుక్కుంటున్నానేమోనన్న భయం కలిగినా వాటిని అధిగమించిన తీరు చక్కగా రాశారు.

ఆడవారి పట్ల, ప్రేమపట్ల అతనికున్న ఖచ్చితమైన అభిప్రాయాలు మనల్ని ఎంతగానో అలరిస్తాయి. తనకు ఏ మాత్రం పరిచయం లేని హసీనా కోసం అతడు పరితపించిన తీరు, సాహితి పట్ల అతడు ఆకర్షితుడైనా ఆమెకు పెళ్ళి కుదరడంతో తన మనస్సులోని ఆ భావాన్ని తుడిచేసి ఒక శ్రేయోభిలాషిగా ఆ కుటుంబం కోసం తపన పడటం, డాక్టర్ మాధవిని తన వ్యక్తిత్వంతో ఆకర్షించడం చాలా చక్కగా వర్ణించారు.

పొరుగు రాష్ట్రంలో, భాష తెలియని చోట, ఆడపిల్లల జీవితాలతో ఆడుకొనే ముఠాను పోలీసులకు పట్టివ్వడంలో అతడు చూపిన చొరవ, తెగువ, ఒంటరి పోరాటం నేటి యువతకు ఎంతైనా ఆదర్శప్రాయం.

ఎదుటి వారికి సహాయం చేయడం, వారికి ఎటువంటి ఆపద కలగకూడదని తపన పడటం, దేవుని పట్ల నమ్మకం, తన వృత్తి పట్ల అంకిత భావం, సమస్యలోని ఒక్కో మెలికను విడదీయడంలో అతడి ఆలోచనా విధానం చదువుతుంటే ఇలాంటి వ్యక్తి నిజజీవితంలో మనకు పరిచయం అయితే ఎంతబాగుంటుందో అన్పిస్తుంది.

నవల మొదలు పెట్టినప్పట్నుంచీ పత్రిక క్రింద పెట్టకుండా చదివి తృప్తిగా ముగిస్తాం. ప్రేమ, హాస్యం, క్రైమ్, సస్పెన్స్, డిటెక్షన్ ఇలా అన్నీ సమపాళ్ళలో అమరి వినోదాత్మకంగా ఉన్న చక్కటి నవల. రచయిత శ్రీ సి.ఎస్ చంద్రశేఖర్ గారికి, ప్రచురించిన చతుర సంపాదక వర్గానికి అభినందనలు.

—కె. వందన, చిత్తూరు - 517127

## ఆద్యంతం ఉత్కంఠ భరితం

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

అపరాధ పరిశోధనకూ, అందమైన ప్రేమ కథకూ మధ్యగా సాగుతూ, ఉత్కంఠనూ, ఉత్తేజభరిత కథనాన్ని తనలో నింపుకుని మొదలు, తుది మధ్య విరామం లేకుండా పాఠకులను అక్షరాల వెంట పరిగెత్తించిన నవలా రాజం 'హీరో'

ఒక మెడికల్ రిప్రజెంటేటివ్, ఒక అందమైన డాక్టరు, ఒక పక్కింటి అమ్మాయిల మధ్య జరిగిన సంఘటనల సమాహారమే ఈ కథ. అలాగని ఇది ముక్కోణపు ప్రేమ వ్యవహారం కాదు. పక్కింటి అమ్మాయి మీద సానుభూతి, మాధవి స్నేహితురాలిపై జాలి, మాధవి ప్రేమికుడిగా తన కర్తవ్యనిర్వహణ వెరసి హీరో శశాంక్‌ను స్వప్న హంతకుడి

అన్వేషణకు పురికొల్పుతాయి. ఇక ఆ అన్వేష ణలో అతనెదుర్కున్న కష్టనష్టాలు, అత్యంత నాటకీయమైన మలుపులతో సాగిన నవల. సాహితికి కాబోయే వరుడు మోహనే ఆ హంతకుడు అని తెలియటంతో దుఃఖాంతం వంటి సుఖాంతం అవుతుంది.

మోహనే అసలు నేరస్థుడని పాఠకులు అనుమానించేలా చేసి మరలా అతన్ని అమా యకుడిగా చిత్రీకరించి కథాంతంలో అనుకోని మలుపులో అతన్ని అసలు దోషిని చేయటం థ్రిల్లర్ తరహా రచనలలో ఒక నూతన ప్రయోగం. ఒక కుటుంబ క్షేమం కోసం అతను పడ్డ తపన, ప్రాణాలకు తెగించి ప్రమాదకరమైన ముఠాతో అతను తలపడ్డ వైనం, శశాంక్‌ను ఒక ఆదర్శ పురుషుడిగానే చిత్రిస్తాయి. గోముఖ వ్యాఘ్రాల వంటి ప్రేమికుల వలలో చిక్కక అప్రమత్తంగా ఉండాలని స్త్రీ లోకాన్ని స్వప్న పాత్రద్వారా హెచ్చరించారు రచయిత.

మహిళా లోకానికి చైతన్యవంతం, పురుష లకు ఆదర్శవంతం, సర్వ జనావళికి ఆద్యంతం ఉత్కంఠభరితం అయిన ఈ నవలా రచయితగా చంద్రశేఖర్‌గారు పాఠ కుల మనసుల్లో నిజంగా 'హీరో' అయ్యారు.

– పి.వి.ఎల్. నరసింహ ప్రసాద్,
కరీంనగర్- 505001.

## అందరికీ హీరో రాడు కదా!

(మూడవ బహుమతి రూ. 50/–
పొందిన సమీక్ష)

తన స్వార్థమే పరమార్థంగా భావించే ఈ రోజుల్లో తప్పబుట్టి 'ఓ కుటుంబానికి చెడు జరగకూడదు' అనే తపనతో ఎన్నో కష్టనష్టా లకు ఓర్చి ప్రమాదాలకు ఎదురొడ్డి నిలబడి, మృత్యువుకు కూడా భయపడకుండా తాను అనుకున్న లక్ష్యాన్ని సాధించిన ఓ సెన్సిటివ్ కుర్రాడి హీరోయిజం ఈనాటి స్వార్థపరులకు ఒక గుణపాఠం.

కథనం చాలా మామూలు భాషలో ముందుకు సాగినా, సాహితిలాంటి అమా యకురాలి జీవితంతో ఆటలాడుకోవాలను కున్న విలన్ ఎవరబ్బా అనే సస్పెన్స్ తో చివరి వరకు నవల చదివేట్లు చేశారు రచ యిత. ఇంటపుట్టిన ఆడపిల్లను మహాలక్ష్మి అని అపురూపంగా పెంచి, విద్యాబుద్ధులు చెప్పించి వివేక వంతురాలిని చేసినా, తగిన కుర్రాడికిచ్చి పెళ్లి చేయటమంటే ఈ రోజుల్లో మామూలు విషయం కాదు. మేడి పండులాగా అందంగా, వినయంగా కనిపిం చినంత మాత్రాన మోసపోగూడదు. అబ్బాయి గుణగణాలు, ప్రవర్తన, కారెక్టరు అన్నీ క్షుణ్ణంగా తెలుసుకోకుండా పెళ్లి చేద్దా మనుకుంటే సాహితికి ఎదురైన పరిస్థితే ఎవరికైనా ఎదురవుతుంది. అందరికీ హీరో లాంటి శశాంక్ రక్షించడానికి రాడు కదా! అందుకే అమ్మాయిల తల్లిదండ్రులకు బహు పరాక్ అని మంచి సందేశం కూడా ఇచ్చారు రచయిత. ఏమైనా శశాంక్ లాంటి యువకులు, ప్రోత్సహించి వెన్నుతట్టే మాధవి లాంటి అమ్మాయిలు కూడా ఈ రోజుల్లో కొందరైనా ఉంటే మదన్, ఉదయ్ లాంటి వారితో బాధ లేకుండా కలికాలం బంగారు కాలమే అవుతుంది.

– మాచిరాజు విష్ణువందన,
ఇబ్రహీంపట్నం-521 456.

## ఏకబిగిన...

(నాలుగవ బహుమతి రూ.50/–
పొందిన సమీక్ష)

'హీరో' నవలలోని హీరో శశాంక్ నిజంగా హీరోనే. హీరోయిజం అంటే టిప్ టాప్‌గా డ్రస్ వేసుకొని క్రాఫ్ పదే పదే సవ రించుకుంటూ ఆడపిల్లల్ని ఆకర్షించడానికి స్టైల్‌గా తిరగడం కాదని, ఒక న్యాయం కోసం ఎన్ని కష్టాలనైనా ఎదుర్కొని పోరాడ డమని అదేనిజమైన హీరోయిజం అని శశాంక్ నిరూపించాడు.

ఒక స్నేహితురాలి కోసం, ఓ కుటుంబం కోసం అతడు చూపించిన ధైర్యం, తెగువ, సాహసం నిజంగా ప్రశంసనీయాలు. స్త్రీ జాతిపట్ల అతడు చూపిన గౌరవం, ఒక స్త్రీని భయంకరమైన ఆపదనుండి కాపాడడానికి అతడు పడిన తపన, ఆపదలను ధైర్యంగా ఎదుర్కొన్న ఆ సాహసం అభినందనీయం.

తొందరపాటుతో ప్రవర్తించే ఆడ పిల్లల జీవితానికి ఈ నవల దర్పణం. తల్లిదండ్రులకు తెలియకుండా మగపిల్లలతో స్నేహాలు పెంచుకోవడం, క్షణికావేశంలో సర్వస్వం అర్పించడం ఆ తరువాత ఆత్మహత్య చేసుకోవడం నేటి కొందరు ఆడ పిల్లలకు పరిపాటి అయిపోయింది. నైతిక విలువలకంటే, క్షణిక సుఖాలకు, ఆనందాలకు ప్రాముఖ్యత ఇచ్చిన[illegible] అడపిల్లలకు ఈ కష్టాలు తప్పవు, పైపైమెరుగులకు మోసపోయే ఆడ పిల్లలకు ఈ నవల కనువిప్పు కలిగిస్తుందనీ, స్త్రీ జాతిని గౌరవిస్తూ అధర్మాన్నీ, అన్యాయాన్నీ ధైర్యంగా ఎదుర్కొనే హీరోలను తయారు చేస్తుందనీ ఆశిస్తున్నాను.

చదువు కంటే గుణానికి ప్రాధాన్యత ఇచ్చి శశాంక్‌ను వివాహమాడి జీవితాన్ని సుఖమయం చేసుకున్న డా॥ మాధవి అభినందనీయురాలు.

కథనం బాగుంది. ఆద్యంతం అనేక మలుపులతో ఉత్కంఠ భరితంగా సాగింది. మొదటి నుండి చివరి వరకు ఏకబిగిన చదివింపజేసింది.

— కాజా ఇందిరా దేవి,
-హైద్రాబాద్-500 028.

# సగం తప్పు ఆమెదే!

*(ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

"మంచి మనసున్న మనిషికి అంతా మంచే జరుగుతుంది" అనే నిజాన్ని నిరూపించిన నవల 'హీరో'. చాలా కాలం తరువాత మంచి 'అపరాధ పరిశోధన' నవల చదివిన అనుభూతి కలిగింది. మదన్, మోహన్ ఒక్కరేనా, కాదా, ఒక్కరేనేమో, కాదేమో అనే సందేహం శశాంక్ కన్నా పాఠకులకే ఎక్కువ అనుమానం కలిగేలా రచన సాగింది. ముఖ్యంగా బ్యాంక్ ఎకౌంటులో ఫోటో శశాంక్ చూస్తున్నప్పుడు ఫోటో ఎవరిదై ఉంటుంది అనే టెన్షన్ కలగక మానదు. అమాయకులైన ఆడ పిల్లలు మీడియా వలన, నవ నాగరికత వలన, వరకట్న సమస్య వలన మదన్ (మోహన్) ఉదయ్ లాంటివారి దుర్మార్గాలకి గురి అవుతున్నారు. అటువంటి వారికి కనువిప్పు కలిగించే నవల ఇది. అన్యాయానికి గురి అయిన ప్రతి స్త్రీ తన తప్పు సగం ఉంటుందనే విషయం తెలుసుకోవాలి. ఎంతో శక్తి ఉన్నా 'నాకెందుకులే' అనే ఉదాసీనతతో బాధ్యతలను మరచిన యువతకి శశాంక్ మార్గదర్శకుడు. కేవలం ఒక ఆడపిల్ల జీవితం నాశనం కాకూడదనే తపన, ఆతృత వలన స్వార్థ రహితంగా సాగించిన పోరాటంలో విజయం సాధించిన నిజమైన హీరో శశాంక్. ప్రతి క్షణం అతని లోని నిజాయితే అతని విజయానికి కారణం.

— సాయి ప్రకాష్, విశాఖపట్నం-27.

☆

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

సచిత్ర విచిత్రం

# కోల్‌కతాలో ఈఫిల్ టవర్!



ప్రపంచ ప్రసిద్ధి చెందిన అపురూపమైన కట్టడాల్లో ఈఫిల్ టవర్ ఒకటి. ఫ్రాన్స్‌లో నెలకొన్న ఆ అద్భుతమైన టవర్‌ను చూడటానికి ప్రపంచం నలుమూలల నుండి పర్యాటకులు అసంఖ్యాకంగా వస్తూ ఉంటారు. ప్రస్తుతం ఫ్రాన్స్ వెళ్లి ఆ అందాల టవర్‌ను చూడటానికి వ్యయ ప్రయాసలు పడవలసిన అగత్యం లేదు!

ఈఫిల్‌టవర్ కోల్‌కతాలోనే మనందరి కళ్ల ముందు సాక్షాత్కరిస్తోంది! అక్కడి 'నిక్కో పార్క్'లో ఆ టవర్ ప్రతి రూపాన్ని తీర్చి దిద్దారు. ఎందరో శిల్పులు, చిత్రకారులు, పెయింటర్లు, ఇంజనీర్లు శ్రమించిన 110 అడుగుల ఎత్తు గల ఆ కట్టడానికి గాను 30 మెట్రిక్ టన్నుల స్టీల్ ఉపయోగించడం జరిగింది. 3 నెలలపాటు రాత్రింబవళ్ళు ఎందరో ఆ సుందర నిర్మాణానికి విశేష కృషి సలిపి సందర్శకుల అభినందనలు అందుకున్నారు.